# ఆ కళ్లలో తళుకు కలకాలం ఉండాలి



## మార్గదర్శి

ఆ పాప అపార సంతోషం సంతృప్తి గురించే ఇప్పుడూ ఎప్పుడూ మీ ఆరాటం! ఆమె కన్నుల్లో ఆ సంతోషపు వెలుగులు కలకాలం వర్ధిల్లడానికి ఈ రోజే మార్గదర్శిలో చేరండి.

మీ డబ్బుకు సురక్షిత దుర్గం మార్గదర్శి. ఎన్నో ఏళ్ళుగా తన ఎనలేని సేవలతో వేనవేల సభ్యులలో కలిగించిన అనంతమైన సంతృప్తి, అచంచల విశ్వాసం మార్గదర్శి నిజాయితీకి నిబద్ధకు నిదర్శనం. ఆర్థిక పాటవంగల సభ్యుల్ని చేర్చుకోవటంలో మార్గదర్శి చూపే శ్రద్ధ సభ్యుల ప్రయోజనాలకు శ్రీరామరక్ష. సభ్యులందరి అభ్యుదయానికే ఈ అవిరళ కృషి.

ఈ అనన్య ప్రతిష్ఠ ఆర్జించడానికి మార్గదర్శి ఇరవైనాలుగు సంవత్సరాలు పరిశ్రమించి ఈనాడు యావద్దేశంలో అగ్రగామి చిట్‌ఫండ్ సంస్థగా పురోగమిస్తున్నది. అంచెలంచెలుగా ఎదుగుతూ మార్గదర్శి వార్షిక వ్యాపారం ఇప్పుడు రు.60 కోట్లు దాటింది. మీ వివిధ అవసరాలకు అనుగుణంగా రకరకాల మొత్తాలలో ఎన్నెన్నో చిట్‌లు మార్గదర్శి మీ కోసం సిద్ధం చేసింది.

### ప్రస్తుత పథకం

| చందా | నెలలు | మొత్తం | సభ్యులు |
|---|---|---|---|
| 400 | 25 | 10,000 | 25 |
| 1000 | 25 | 25,000 | 25 |
| 2000 | 25 | 50,000 | 25 |
| 200 | 50 | 10,000 | 50 |
| 400 | 50 | 20,000 | 50 |
| 500 | 50 | 25,000 | 50 |
| 1000 | 50 | 50,000 | 50 |
| 2000 | 50 | 1,00,000 | 50 |
| 4000 | 50 | 2,00,000 | 50 |
| 8000 | 50 | 4,00,000 | 50 |

### బ్రాంచీలు

- బషీర్‌బాగ్, హైదరాబాద్.
- లకిడికాపూల్, హైదరాబాద్.
- చిక్కడపల్లి, హైదరాబాద్.
- అమీర్‌పేట్, హైదరాబాద్.
- ఎమ్.జి.రోడ్, సికింద్రాబాద్.
- ఎ.ఎమ్.సి.కాంప్లెక్స్, విజయవాడ.
- బందర్‌రోడ్, లబ్బీపేట్, విజయవాడ.
- జగదాంబ జంక్షన్, విశాఖపట్నం.
- స్టేషన్‌రోడ్, గుంటూరు.
- జి.పియన్‌రోడ్, వరంగల్.
- టి.నగర్ రాజమండ్రి.
- సుభాష్‌రోడ్, కాకినాడ.
- నెహ్రూ రోడ్, కర్నూలు.
- వైరారోడ్, ఖమ్మం.
- నరసింహారావ్‌పేట ఏలూరు.

డబ్బుకోసమైనా మీ చింత! మార్గదర్శి ఉన్నది మీ చింత!!



**మార్గదర్శి చిట్‌ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్**

రిజిష్టర్డ్ మరియు సెంట్రల్ ఆఫీసు :
ఆబిడ్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

Kiron-MCF-86-3

# ప్రతి వొక్కరూ సితార See రియల్‌ని ఎందుకు



**'సితార' కోసం...** 'సితార' ఏంచేసినా దానికో విశిష్టత వుంటుందని మొదటినుంచీ నా నమ్మకం. లోగడ 'సితార' చేసిన 'ప్రేక్షకులకి ఎలాంటి సినిమాలు కావాలి' అనే అభిప్రాయ సేకరణ, 'ఫొటోసీరియల్' వంటి కొత్త శీర్షికలు నాకు నచ్చాయి. 'క్లైమాక్స్' Seeరియల్ 'సితార' చేస్తున్న మరో కొత్తప్రయోగం ఇదీనాకు నచ్చినదే. అందుకే అంటాను 'సితార'కి ఎప్పుడూ విక్టరీనే అని!



**అందరినీ చూసి...** సాధారణంగా నేను పత్రికలు చదవను. అయితే 'సితార'లో వస్తున్న 'క్లైమాక్స్' సీరియల్ గురించి మా ఆఫీసులోవాళ్ళంతా గొప్పగా చెప్పుకోవడం చూసి నేను ఇదేమిటో చూద్దామని 'సితార'కొని చదివాను. నిజంగానే నాకూ ఇది ఎంతో గొప్పగా అనిపించింది. దిసీజ్ రియల్లీ సూపర్బ్.



**అసభ్యత, అశ్లీలత లేదని...** అసభ్యత, అశ్లీలత లేని రచనలు, పత్రికలు కనబడని నేటి రోజుల్లో 'సితార', అందులోని 'క్లైమాక్స్' సీరియల్ కుటుంబసమేతంగా చదువుకోగలిగినట్టు వుంటున్నాయి. అందుకే నేను దీన్ని ఎంతగానో ఇష్టపడుతున్నాను. ఒక్కనేనే కాదు- మాఇంట్లో వాళ్ళందరూ కూడా.



**ఆసక్తి కల్గించే కొత్త ప్రయోగమని...** ముందేం జరుగుతుందోనన్న ఉత్కంఠకల్గిస్తూ సాగేదే మంచి సీరియల్ అని నా అభిప్రాయం. 'క్లైమాక్స్' సీరియల్‌కి సంబంధించి రచయిత, సినీతారలు జరిపే చర్చల్లో ముందుముందు రాబోయే పాత్రలగురించీ, సన్నివేశాలగురించీ ప్రస్తావన వస్తోంది. ఇది ఆసక్తి కలిగిస్తూ నాచేత చదివిస్తోంది- ఏవారం మిస్‌కాకుండా!

# సమర్పిస్తున్న క్లైమాక్స్ చదువు తున్నారు? ______



అభిమాన తారలు పొల్గొంటున్నారని... నేను చిరంజీవి ఫాన్ని. నాఫేవరేట్ ఏక్టర్ చిరంజీవి చెప్పిన దానితో ఈ 'క్లైమాక్స్' Seeరియల్ మొదల యిందనే సరికి నాలో దీనివల్ల ఒక గొప్ప ఇష్టం ఏర్పడిపోయింది. నేను వారంవారం ఇది కట్‌చేసి ఫైలు చేసుకుంటున్నాను తెలుసా?



టుఇన్‌వన్ అని... నాకు కాలక్షేపం కోసం చదువుకునే సినిమా వారపత్రికలు అంటేనూ, మాఅక్కకి సీరియల్స్ ఇచ్చేవారపత్రికలంటేనూ మక్కువ. అయితే 'క్లైమాక్స్' Seeరియల్ మొద లైనప్పటినుంచీ మాఇద్దరికీ కూడా 'సితార' ప్రియాతిప్రియమైనది అయిపోయిందంటే నమ్మండి!

---

వ్యక్తులు వేరైనా, కారణాలు వేరైనా అందరి అభిప్రాయం ఒక్కటే! 'సితార' చేస్తున్న సరికొత్త ప్రయోగం 'క్లైమాక్స్' బావుందని!!

---

అనేక మంది తారల సహకారంతో మైనంపాటి భాస్కర్ రాస్తున్న క్లైమాక్స్ Seeరియల్ మీరూ చదువుతున్నారు కదూ?

# చతుర కథలు

## బిజినెస్

మూడవ బహుమతి
రు. 50/- పొందిన మినీకథ

సమయం ఉదయం పదిన్నర.

అప్పటికి ఆ బస్టాపులో ముగ్గురే ఉన్నారు. ఒక స్త్రీ... ఇద్దరు పురుషులు.

ఆమె చాలా అందంగా ఉంది.

సూర్యుడుకూడా తన కిరణాలతో గుచ్చుతూ ఆమె అందాన్ని ఆస్వాదిస్తున్నాడు. పాపం... ప్రభుత్వంవారి పుణ్యమా అని ఎక్కడ నిలుచున్నా ఆ బస్టాపులో వారికి ఎండనుండి తప్పుకోవడం సాధ్యంకావడంలేదు. అంత చక్కటి నీడనిస్తోంది ఆ బస్టాండ్.

ఆ మగవాళ్ళిద్దరూ తమలో తాము రాజకీయాల గురించి చర్చించుకుంటున్నారు. మధ్యమధ్యలో ఆ అమ్మాయి మీద ఒక చూపు విసురుతున్నారు.

ఆమెకు నిండా పంథొమ్మిదేళ్ళు ఉండవు. వింతగా ప్రకాశిస్తూ, ఏవో కొత్త లోకాలకు దారితీస్తున్నట్టు కనిపించే కళ్ళు, సంపెంగను ధిక్కరించే నాశిక ఆమె ముఖానికి ప్రత్యేకాకర్షణ.

"బాబయ్యా... ధర్మంచెయ్యండి బాబయ్యా!"

ఎంతో ఇంట్రస్టింగ్‌గా సాగిపోతున్న తమ రాజకీయ చర్చలో అడ్డుపడిన ఆ బిచ్చగాడిని చూసి మహా కోపం వచ్చింది వారిలో ఒకరికి.

కాని ఆమె తనువైపే చూస్తోంది. వెంటనే కోపం మింగేశాడు.

జేబులన్నీ తడుముకుని ఒక అర్ధరూపాయి తీసి బిచ్చగాడికి వేసి, గర్వంగా చూశాడు ఆమెవైపు.

దానితో రెండోవాడు సగర్వంగా రెండు అర్ధ రూపాయలు తీసి వాడికి వేశాడు.

ఇంతలో దూరంగా బస్‌రావడం కనిపించింది. అది వారికి కావలసిన బస్సే కావ



టంతో దర్జాగా ఎక్కి వెళ్ళిపోయారు.

ఇంతలో గలగల మాట్లాడుకుంటూ, ఇంగ్లీష్ పిక్చర్లో బూతు సీన్లు గుర్తుచేసుకుంటూ నలుగురు స్టూడెంట్స్ వచ్చి బస్టాండ్‌లో నిలబడ్డారు.

ప్చ్... ఇంక ఎవరూలేరు ఇక్కణ్నుంచి వెళ్ళిపోవచ్చు అనుకుంటున్న బిచ్చగాడికి పండుగే అయింది.

"బాబయ్యా ధర్మం" అంటూ ఆ స్టూడెంట్ల ముందుకొచ్చాడు.

"నువ్వే మాకు ధర్మం చెయ్యి" అని చెయ్యి జాపి, సీరియస్‌గా జోక్‌చేశాడు ఒక స్టూడెంట్.

"ఒరేయ్ ఫూల్... ఆ బ్యూటీ చూస్తోందిరా! మన పరువు తెలుగుగంగలో కలుస్తుందిరా!" అని భుజంమీద చరచి, జేబులోంచి పావలా తీసివేశాడు ఇంకో స్టూడెంట్.

"వెరీ పూర్" అని అర్ధరూపాయి తీసివేశాడు మరో స్టూడెంట్. వీళ్ళిద్దర్నీ డామినేట్ చెయ్యాలని ఏకంగా రూపాయి వేశాడు నాలుగో స్టూడెంట్. నేనేం తక్కువ తిన్నానా అన్నట్లు రెండు అర్ధరూపాయలు వేశాడు మొదటివాడు.

బిచ్చగాడు సంతృప్తిగా కదిలాడు.

ఆమె ఎక్కవలసిన బస్ ఇంకా రాలేదు.

పదిగంటలయింది. ఎవరెవరో బస్టాపుకి వస్తున్నారు... పోతున్నారు. బిచ్చగాడు వాళ్ళ ముందుకొచ్చి చెయ్యిజాపుతున్నాడు. వాళ్ళు వేస్తూనే ఉన్నారు.

పాపం... ఆమె బస్ ఇంకా రాలేదు. దాహం వేస్తుండగా కిళ్ళీకొట్టుకెళ్ళి ఒక సోడా తాగివచ్చి, బస్టాపులో అలాగే ఓపికగా నిలబడింది.

బిచ్చగాడు మెల్లిగా నడచి ఆమె దగ్గరికి వచ్చాడు.

"ఇదుగో ఇవాళ పన్నెండు రూపాయలు రాలాయి. ఇది తీసుకుని ఇంటికెళ్ళి బువ్వ ఒండు. ఏటోనమ్మా... ఈ వయసులో, నిన్నీ ఎండలో నిలపెడుతున్నాను. తప్పదమ్మా... నువ్వు లేకపోతే ఈపాటికి రూపాయి డబ్బులు కూడా రాలేవికావు" అన్నాడు డబ్బులు ఆమెకు అందిస్తూ.

**–సోమయాజుల సాయిప్రసాద్**

# గుడ్మార్నింగ్ సార్!

**మూడవ బహుమతి**
**రు. 50/- పొందిన మినీకథ**

**ఆ**ఫీసులు ప్రారంభమయ్యే వేళ కావడంతో ప్లాట్‌ఫాం రద్దీగా ఉంది. 'త్వరగా ఎక్కండహె' అన్నట్లు లోకల్ బండి కూతపెడుతోంది. ప్లాట్‌ఫాం మీదున్న జనంలో దాదాపు ముప్పాతికమంది నాకన్నాముందే బండిలోకి ఎక్కేసారు. బండి బయల్దేరి క్రమంగా వేగం పుంజుకుంది. బండి దాదాపు క్రిక్కిరిసిఉంది. అలాగే



గుమ్మంవద్ద నిలబడి ఉన్నాను.

ఇంతలో ఎవరో భుజం మీదతట్టినట్లయి వెనుదిరిగాను. వెనక నా చిన్ననాటి స్నేహితుడు 'సుధీర్'.

"ఏరా ఈ ఉద్యోగం ఎప్పటినుండీ?" అన్నాడు.

ఆరోజు నేను తెల్లటి ప్యాంటుమీద తెల్ల చొక్కా ఇన్‌షర్టుచేసి, నల్లటి కోటేసుకుని, చేతిలో చిన్న లెదర్‌బ్యాగ్‌తో ఉన్నాను. అవన్నీ

చూసి నా ఉద్యోగం టికెట్ కలెక్టర్‌గా ఊహించి నట్టున్నాడు. వాడిని కాస్త ఏడిపిద్దామని పించింది.

"రెండేళ్లయిందిరా చేరి, ఈరోజు ఈ బండిలో స్పెషల్ చెకింగ్‌కి డ్యూటీ వేసార్లే ఇంతకీ నీ టిక్కెట్ ఏది?" అన్నాను.

"వార్నీ నన్నే అనుమానిస్తున్నావురా? నాది టిక్కెట్ కాదు, పాస్. ఇదిగో చూడు" అంటూ పాస్ చూపించాడు. "నరేగానీ ఇన్నాళ్లూ ఏ బండిలోనూ కనుపించలేదేం? ఈ రూట్‌లో ఇదే మొదటిసారా?" అని అడిగాడు

పెట్టెలోని జనంలో చిన్నగా కలకలం రే గింది.

"స్పెషల్ చెక్కింగంటరో, పట్టుకుంటే పది రూపాయలన్నా ఫైనేస్తడు. గిప్పుడెట్ల, నాతాన పైసన్నదిలేదు" పక్కనున్న ఓ ఆవారాగాడి స్వగతం.

కొందరు పెద్ద మనుషులు తలలు వంచు కుని ఏదో అర్జంటు పని ఉన్నట్లు తలుపు దగ్గరకు వడివడిగా వచ్చేస్తున్నారు.

ఇవన్నీ గమనిస్తూనే ఉన్నాను. అయితే నేను చాలాకాలం తర్వాత కనబడడంతో సు ధీర్ ఉభయకుశలోపరినుండి ప్రారంభించి అనేకానేక విషయాలపై ఊకదంపు ప్రా రంభించాడు. మొహమాటానికివాణ్ణి కాదనలేక వింటున్నాను. ఈలోగా సగంపెట్టె ఖాళీ అయి పోయింది. వాళ్లు అక్కడ దిగవలసినన వాళ్లు కాదన్న సంగతి నాకు బాగా తెలుసు. రోజూ అదే బండిలో డ్యూటీకి వెళ్లే నేను వాళ్లలో చాలామందిని చూస్తూనే ఉంటాను. ఇవ్వాళ నా వేషంచూసి భయపడి దిగిపోయారు. అందులో కొందరు ఉచిత సేవాపరాయణులు మా పెట్టెలోకి ఎక్కబోతున్నవారికి హెచ్చరికలు జారీ చేస్తున్నారు. "స్పెషల్ చెక్కింగు జరుగు తుంది, భద్రం" అంటూ.

ఆ మాటవిని ఎక్కేవాళ్లల్లో సగంమంది పైగా మానేశారు.

సుధీర్ తన సోదితో చెకింగ్ మొదలుపెట్టని వ్వడంలేదు. మాట్లాడేదంతా అప్పుడే మాట్లాడ కపోతే తన ప్రాణం పోతుందన్నట్లు 'సుత్తి' కొనసాగిస్తున్నాడు.

రైలు మళ్లీ బయలుదేరింది. నేనూ మాట్లా డుతూనే ఉండిపోయాను. బండి లాలాగూడా దాటింది. సికింద్రాబాద్ కూడా వచ్చేసింది. వాడితోపాటు నేనూ దిగి ప్లాట్‌ఫాంమీద నడవ సాగాను.

"అదేమిట్రా నువ్వు చెక్ చెయ్యనవస రంలేదా?" అడిగాడు సుధీర్.

"నేను చెక్‌చెయ్యటమేమిట్రా నీ తలకాయ. నేను చేసేది బ్యాంకు ఉద్యోగం, నా గెటప్ చూసి నువ్వు పొరబడ్డం గమనించి, చిన్న నాటకమాడానంతే" అన్నాను ఉన్న నిజం బయటపెడుతూ.

"వార్నీ ఎంతపనిచేసావురా!" అంటూ గేటు దగ్గర 'టి.సి.'కి పాస్ చూపించడానికి జేబు లోంచితీసి పట్టుకున్నాడు. నేనూ నా టికెట్ తీద్దామని జేబులో చెయ్యిపెట్టాను. అప్పుడు గుర్తొచ్చింది నేను ఇవాళ టికెట్ కొనలేదన్న సంగతి. ఈ ఉత్పాతంనుండి ఎలా తప్పుకో వాలో అర్థం కాలేదు. ఏదయితే అదే అయిందని టి.సి.వైపే సూటిగా చూస్తూ ధై ర్యంగా గేటులోకి నడిచాను. టి.సి. సుధీర్ పాస్‌చూసి పంపేసి, నన్ను "గుడ్మాణింగ్ సార్" అంటూ సెల్యూట్ చేశాడు.

చిరుదరహాసం పెదవులపై చిందులా డ గా 'గుడ్' అన్నట్లు ఓసారి టి.సి. వైపు హుందాగా చూసి బయటికడుగులు వేశాను.

—జి.వి. రమణ

## తీర్పు

మూడవ బహుమతి
రు. 50/- పొందిన మినీకథ

ఉదయాన్నే పేపర్ తిరగేస్తున్న లాయర్ నాగేంద్రరావుగారి భృకుటి ముడిపడింది.

కాఫీకప్పు పక్కనపెట్టి మొదటి పేజీని మరో సారి పరీక్షగా చూశారు. దస్తగిరి, వేణుగోపాల రావు, గాయత్రిల ఫొటోలున్నాయి. అపైన ఉన్న హెడ్డింగ్‌ను చూసి ఆయన నిర్ఘాంతపో యారు. ఈ ముగ్గురు వ్యక్తులు వారివారి రంగా లలో చేసిన నిరుపమాన సేవలకు గుర్తింపుగా వీరికి 'పద్మశ్రీ' బిరుదు ప్రదానం చేయనున్న ట్లు ప్రకటించారు.





నాగేంద్రగారి మనస్సు బాధతో మూలి గింది

'పద్మశ్రీకి ఈ ముగ్గురూ అనర్హులే ఆ బిరుదు ఎంత ప్రతిష్ఠాత్మక మైంది? దానిని అందుకునే యోగ్యత వీళ్ళకె క్కడుంది' అనుకున్నారు నాగేంద్రరావుగారు.

ఈ ముగ్గురిలో దస్తగిరి ఇప్పుడు ఎం.ఎ ల్.ఎ. అయినా పూర్వాశ్రమంలో ముఠాతగాదా లకు దిగి ముగ్గుర్ని పరలోకయాత్రకు పంపా మనేది బహిరంగ రహస్యం. సాక్ష్యాల్లేక ఎవరూ ఏం చేయలేకపోయారతన్ని.

వేణుగోపాలరావు దస్తగిరికి ఏమాత్రం తీసిపోడు. ప్రస్తుతం గొప్ప విద్యాదాతగా పోజు పెడుతున్న ఇతగాడు ఎన్నెన్నో కాలేజీలు స్థా పించి డొనేషన్లపేరుతో ఎన్నిలక్షలు, కోట్లు తిన్నదీ స్టూడెంట్స్‌నీ, పేరెంట్స్‌నూ కదిలిస్తే అంకెల్తోసహా తెలుస్తుంది. అలాంటి దోపిడీదా రుకు 'పద్మశ్రీ'యా?

ఇక గాయత్రి గురించి తెలియందెవరికి? సాహిత్యరంగంలో అద్వితీయమైన సేవచేస్తు న్నానంటూ వేదికలెక్కి ఊకదంపుడు ఉపన్యా సాలు ఇవ్వడమేతప్ప ఏనాడూ పనికొచ్చే మంచి రచన చేసిన పాపానపోలేదు. ఆవిడగా రికి మంత్రుల్తో సాన్నిత్యం ఉండటంవల్లనే ఇప్పుడీ బిరుదు ఇస్తున్నారని ఎవరైనా గ్ర హించగలరు.

ఈ దురన్యాయానికి నాగేంద్రరావుగారి మనను తట్టుకోలేకపోయింది. ఈ ప్రభుత్వాధి కారులకు ఓసారి బుద్ధిచెప్పకపోతే మానవవిలు వలకే కళంకమని ఆయన నిర్ణయించుకున్నా రు.

వెంటనే న్యాయవాదులైన మిత్రులతో చర్చించారు. న్యాయశాస్త్రకోవిదులను సంప్ర దించారు. న్యాయశాస్త్రాలను తరచి తరచి పరిశీలించారు.

**ఆతర్వాత...**

ఆ ముగ్గురు వ్యక్తులకు ఏ అర్హతలను పరిగణలోకి తీసుకొని బిరుదులు ఇచ్చారో తెలి యజేయమంటూ కోర్టులో పిటీషన్ వేయించా



రు. ఈ వార్తతో అటు ప్రముఖులు, ఇటు సామాన్య ప్రజానీకం దిగ్భ్రమచెందారు. ఇలా సంజాయిషీ అడగడం ఇదే ప్రథమం.

ఈ వివాదం ఎటువైపు తిరుగుతుందోనని అందరూ ఉత్కంఠతో ఎదురుచూడసాగారు.

వారంరోజులు గడిచింది.

న్యాయస్థానానికి వివరణ పంపామంటూ ప్ర భుత్వ అధికారులు పత్రికల్లో ప్రకటించారు. న్యాయస్థానం తీర్పుకోసం ప్రజలు ఆసక్తితో చూస్తున్నారు.

న్యాయమూర్తి తీర్పు ప్రకటించారు.

"ఎంపిక విషయంలో ప్రభుత్వ నిర్ణయం సమంజసమైనదేనని కోర్టు విశ్వసిస్తోంది. సమ ర్థులైన వ్యక్తులకే బిరుదులు ప్రకటించామన్న వివరణతో కోర్టు ఏకీభవిస్తూ ఇంతటితో ఈ వివాదానికి తెరవేస్తోంది" అన్న తీర్పు విని ప్రజలు హాయిగా ఊపిరిపీల్చారు.

సరిగ్గా-

ఈ తీర్పు వెలువడిన మరుసటి సంవ త్సరం నాగేంద్రరావుగారికి బిరుదు ప్రకటించ బడింది.

—సురేష్

---

కవర్‌పేజీ ఫొటోగ్రాఫర్: కోలపల్లి ఈశ్వరరావు

# 'గ్రహణం' నవలపై చతుర సమీక్షలు

'చతుర' నవలల పోటీలో ప్రత్యేక నవలగా ఎన్నికై 'సెప్టెంబర్' సంచికలో ప్రచురితమైన వక్కలంక పద్మావతిగారి 'గ్రహణం' పై మాకు అందిన 'చతుర' సమీక్షలలో ఉత్తమంగా వున్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము.

## సాహస రచన

*(ప్రథమ బహుమతి రు: 100/- పొందిన సమీక్ష)*

**'చతుర'** మాసపత్రిక వెలువడగానే ఏకబిగిని వదలకుండా చదివి ముగించేవారిలో నేనొకర్తెను. ఈ నెల నవల 'గ్రహణం' చక్కటి భావపటిమ, కథావస్తువూ, శిల్పమూ కలిగి ఆకట్టుకొన్నది– "మాస్ మీడియా" అనబడే సినిమాలూ, టీవీలూ, పత్రికలూ ఈ కాలపు ప్రజల మీద చూపే ప్రభావం వర్ణనాతీతం. థ్రిల్‌కోసం నేటి యువత ఏమైనాచేస్తుంది. అలనాడు సాంఘిక దురన్యాయాల గురించి రాస్తే ప్రభావితమైన యువత నేడు బ్లూఫిలిమ్స్, దోపిడీలు, సెక్స్, క్రైమ్ గురించి____ రాస్తున్న రచనలను ఎంత ఆసక్తితో చదువుతున్నారో– 'మీ-మా' ఉత్తరాల, రచయితల ఉత్తరాల నుండి స్పష్టమౌతుంది. వారి తల్లిదండ్రులు భయంభయంగా బతుకుతున్నారు! హింస, అశ్లీలత, అసభ్యత, రచనలలో, చలనచిత్రాలలో ప్రబలిపోయి. యువకులు "యాంగ్రీ యంగ్‌మాన్"'గా ఊహించుకొని- ఈ నవలలోని రాజువలె అన్యాయమైపోతున్నారు. యువతులు తమనో రాధ అనీ, మీనాక్షీశేషాద్రి అనీ భావించి క్రమశిక్షణకు దూరమవుతున్నారు. ఇదంతా ఎందుకంటే రచయిత్రి ఎన్నుకున్న ఇతివృత్తం ఈ సమకాలీన సమాజపరిస్థితులనే ప్రతిబింబించింది. కానీ ఇన్ని సంఘటనల్ని ఓ చిన్న నవలలో కుదించటంతో ఈ సన్నివేశాల పటుత్వం తగ్గిపోయింది. మొదట ఎంతో ఉదాత్తమూర్తిగా చిత్రించబడిన ఎడిటర్ జయరాం, ఏ సంఘటనవలన హఠాత్తుగా ఎలా దిగజారారో రచయిత్రి వివరించలేదు. సరే... ఏ పరిష్కారాన్నాలోచించి- 'సింధు' విద్యార్థులను కూడగట్టుకొంది? వారికి సందేశాన్నిచ్చింది? అది చాలా... ఇంతేనా దీనికి సొల్యూషన్? ఆ తరువాత వారి నిరసన యుద్ధానికి ప్రాతిపదిక ఏమిటి? ఈ ఉద్యమం భావిలో ఏవిధంగా కొనసాగుతుంది? రచయిత్రి దాన్ని అలా గాలిలో వదిలేశారు! నవల రాయాలంటే ఆ విషయం గురించి, దాని

పర్యవసానం గురించి ఎంతో అవగాహన, పరిజ్ఞానం సంపాదించుకొంటేనే ఆ నవల రాణిస్తుంది. ఏదేమైనా- రచయిత్రి ఎన్నుకొన్న సమస్య- ఈనాటి సమకాలీన సమాజాన్ని పట్టి కుదిపేస్తున్న ఓ ముఖ్యసమస్య. దీని స్వభావాన్నినివారణనుఅవిడకూలంకషంగాచర్చించకపోయినా, ఈ ఇతివృత్తాన్ని ఎన్నుకొన్న సాహసానికి, రచనాశైలికి, సంఘటనల కూర్పుకు ఆమె అభినందనీయురాలు.

—వి. వసంతవల్లి
హైదరాబాద్

## కాంతిరేఖ

*(ద్వితీయ బహుమతి రు: 75/- పొందిన సమీక్ష)*

కథలూ, నవలలూ కుప్పలు తెప్పలుగా వస్తున్న ఈరోజుల్లో మంచికథకి పాఠకులు ఎంత అదృష్టం చేసుకోవాలి! సెక్స్, క్రైమ్, సైన్స్ ఫిక్షన్, సస్పెన్స్, థ్రిల్లర్స్ కథాంశాలుగా పాఠకుల బలహీనతను ఎడ్వాంటేజ్‌గా తీసుకుని వారిని దోచుకునే 'కమర్షియల్' రచయితల రోజులివి. తమకున్న సామర్థ్యంతో క్లిష్టమైన పదాలు గుప్పించి, సస్పెన్స్‌తో నడిపించి కథకు ప్రాధాన్యత తగ్గించి రాయటం నేటి రచయితల "ప్రత్యేకత'. మంచికథకు ఎప్పుడూ 'మెప్పు' వుంటుందనీ, పాఠకుల ఆదరణ వుంటుందని మర్చిపోయారు. అటువంటి దిక్కుమాలిన రోజుల్లో 'మోడువారిన తరువుకు వసంతపు చివురులా' వెలువడింది వక్కలంక పద్మావతిగారి నవల 'గ్రహణం'.

రచయితలపై గౌరవముంచే పాఠకులకు ఏదో సందేశాన్ని అందించాలని చాలా ప్రయత్నించారు రచయిత్రి. ఆమె ప్రయత్నం చాలా వరకూ సఫలమయ్యిందనే చెప్పాలి. కేవలం సొమ్ముచేసుకోవాలనుకునే సంపాదకులకు, కీర్తి కొరకు తపించే రచయిత(త్రు)లకు కనువిప్పు కల్గిస్తుంది ఈ నవల. ఏమాత్రం 'కాన్షస్'వున్నా 'కమర్షియల్ రైటర్స్, సంపాదకుల మనస్సులకు పట్టిన 'గ్రహణం'కు విడుపు ఈ నవల.

సినిమా, పుస్తకప్రభావం యంగ్‌జనరేషన్‌పై చాలావుంది. తాత్కాలికోద్రేకం కల్గించే నేటినవలకు,మంచినవలకు వుండే తేడాలు ఏమిటో పాఠకుల మనస్సులకు సూటిగా నాటేలా చేయాలని తపనపడ్డ రచయిత్రి సిన్సియారిటీ కొనియాడతగ్గది. నిజానికి "సింధుపాత్ర రచయిత్రి ఆలోచనలకు, మానసిక సంఘర్షణకూ అద్దంపట్టేలాగుంది. మంచిని మర్చిపోయి చెడువుంతలు తొక్కుతున్న పాఠకులను సరియైనదారిలో పెట్టడానికి సింధుపడిన తపన, చేసిన తపస్సు చదువరులను కదిలిస్తాయి. ముగింపు నవలను వున్నత పీఠాన్నెక్కిస్తుంది. కొన్ని కొన్ని సన్నివేశాల్లో సింధుపాత్ర విశ్వరూపాన్ని దాల్చి చదివేవారి మనస్సుల్ని చూరగొంటుంది. చిన్నలోపాల్ని వదిలేస్తే 'గ్రహణం' నవల మణిపూస.

పోతే! 'సింధు' పాత్రను మలచడంలో లీనమై రచయిత్రి మిగిలిన పాత్రల్ని కేవలం బిందువులుగా వదిలేశారు. ఉదాహరణకు హరనాథ్ పాత్రని అర్థాంతరంగా వదిలేశారు. ఆ పాత్రద్వారా రచయిత్రి ఏమిచెప్పదలచుకున్నట్లు? మంచిరచయితకు భవిష్యత్తు లేదనా? ఆలోచనాపరురాలు, వివేకవంతురాలు అయిన మమత రాజు ప్రీప్లాన్డ్‌గా కావాలని తనను మానభంగం చేశాడని ఆలోచించేలా చేసి ఆ పాత్రకున్న ఔచిత్యాన్ని కించపరిచారు రచయిత్రి. నవలమొత్తంగా బాగుంది కాబట్టి చిన్న చిన్న లోపాలు వున్నా లేనట్టే.

— సి. పతంజలిశర్మ
బొంబాయి

## మార్పు ఎలా వస్తుంది?

*(తృతీయ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

"సాహిత్యం చదివి నేర్చుకోవలసిందీ, అన్వయించుకోవలసిందీ ఏమీలేదు అనుకునే దశనుండి, మనం దాటిపోతే ఎలాంటి సాహిత్యాన్ని అయినా సృష్టించవచ్చు" అన్న రచయిత్రి మాట సాహిత్యం యువతరాన్ని పెడతోవ పట్టిస్తున్నంతకాలం అక్షరసత్యం. నేటి సాహిత్యం వేస్తున్న వెర్రితలలనూ, చేస్తున్న చెడుపులనూ చాలా చక్కగా చిత్రించారు రచయిత్రి. రాజు

లాంటి విజ్ఞానవంతుల్ని సైతం ఈ 'దుస్సాహిత్యం' చెడగొడుతుందన్న విషయాన్ని ఒక హెచ్చరికగా బాగా చెప్పారు.

తమ శైలితో పాఠకులను 'ట్రాన్స్'లోకి తీసుకుపోగలమనుకుంటున్న రచయితలను చక్కటి సబ్జెక్ట్స్ ఎన్నుకుని రాయమని చెప్పిన విధానం బాగుంది. అటు పబ్లిషర్ల దృష్టినుండీ, ఇటు పాఠకుల దృష్టినుండీ కూడా ఆలోచించి ఎన్నో విషయాలు పదునుగా రాశారు. అయితే ఈనాడు వస్తున్న సాహిత్యం వ్యక్తిగత రాజకీయాలకీ, మసాలా రచనలకీ 'పూర్తిగా' పరిమితమైపోయిందనడం పూర్తి నిజంకాదు. ఒక రచయిత రచనలను చదివి చెడిపోయేవారున్నట్టే, మరో రచయితని చదివి బాగుపడేవారూ వుండకపోరు. అటువంటివారి ప్రస్తావన నవలలో ఎక్కడా కనపడదు. తప్పు ఎవరిదో ఖచ్చితంగా చెప్పలేదు. పబ్లిషర్లదా, రచయిత(త్రు)లదా, పాఠకులదా? ఇందులో ఎవరు ఈ సాహిత్యపు దుష్టకోరలనుండి చెడిపోయే పాఠకులను కాపాడగలిగేది? 'ఫలానా' విధంగా రాస్తే తప్ప పబ్లిషర్లు తమ నవలలు ప్రచురించరు అంటారు రచయితలు. ఆ 'ఫలానా' వేస్తే తప్ప సర్క్యులేషన్ వుండదంటారు పబ్లిషర్లు. ఈ విషవలయానికి మూలం డబ్బు! డబ్బు సంపాదనే పరమావధి అయినప్పుడు, అది ఏ వ్యాపారమయినా మడి కట్టుకు కూర్చోరనే విషయం లోకవిదితం. పాఠకుల బలహీనతలమీద దాడిచేయటం అనేది పత్రికా వ్యాపారంలో నిత్యం జరిగే ప్రయోగం. ఇది సఫలీకృతమయితే డబ్బే డబ్బు!! ఈ రాక్షసప్రవృత్తిని రూపుమాపగలితేనే అది మార్పు. ఒక్క రచయితో, ఒక్క ఎడిటరో మారినంతమాత్రాన ఆ మార్పురాదు.

— జి.వి. రమణ
సికింద్రాబాద్.

## అసహజాలు

*(రు: 25/- బహుమతి పొందిన సమీక్ష)*

చెప్పాల్సిన విషయం ఒకటి తర్వాత ఒకటిగా చెప్పేనేర్పు అందరికీ వుండదు. కలగలుపుగా సమ్మిళితంచేసి చెప్పేవాళ్ళే ఎక్కువ. ఈనవల రెండోతరహాకు చెందినవారు రాసిందిలా అన్పిస్తుంది. నవల్లో ఓచోట 'సింధు'చేత రచయిత్రి అన్పించినట్టుగా - 'కథలో బలమైన సన్నివేశాలు......లేవు'. ఇది సాధారణ పద్ధతిలో మలచడానికి ప్రయత్నించిన అసాధారణ ఇతివృత్తం. కథ చెప్పడానికి వెనుకవున్న ఆవేశం, ఆవేదన తెలుస్తూనేవున్నా కథనంలో వైఫల్యం స్పష్టంగా కన్పిస్తోంది. "తిరస్కరించలేకపోవడమనేది బలహీనతేగానీ, గొప్పప్రేమకు నిదర్శనంకాదు"లాంటి వాక్యాలు నవల్లో అక్కడక్కడా మెరుపుల్లా మెరిశాయి. "ప్రేమించు. ప్రేమిస్తున్నానూ అనగానే పడకవేపు చూసే మనిషిని కాదు ప్రేమించేది" అంటూ వచ్చి నిజాన్నికూడా అలవోకగా చెప్పడం ముచ్చటగొల్పుతుంది.

ప్రస్తుతం వస్తున్న రచనలు పాఠకులమీద ఎంత తీవ్రంగా ప్రభావం చూపిస్తున్నాయో చెప్పడంలో అక్కడక్కడా సందిగ్ధత, అసహజం చోటుచేసుకున్నాయి. నవలలోని సంఘటనల కూర్పు చూస్తే 'యువతరం అంతా బలహీన మనస్కులనే రచయిత్రి భావిస్తున్నట్లన్పిస్తుంది. విషయంవెనుక సిన్సియారిటీ కన్పిస్తున్నా చెప్పేపద్ధతి కన్విన్సింగ్‌గా లేదు. రాజు ప్రవర్తన వింతగా అన్పిస్తుంది. అతనిపాత్ర సరిగ్గా ఎస్టాబ్లిష్‌కాలేదు. అవినాశ్ నవల రాతప్రతిని సింధు తగలబెట్టడం అన్నసంఘటన నవల పూర్తయిపోయినా మెదులుతూనే వుంది. ఇలాంటిచోట్ల సింధు ఆవేశం కృత్రిమంగా అన్పించింది. రచయిత్రే పాత్రలోకి బలవంతంగా చొరబడిన అనుభూతి కలిగింది. అవినాష్‌లో మార్పు మరీ సినిమాటిక్‌గా చూపించారు. మనసునుతాకే రచనలగురించి హరనాథ్‌చేత చాలా బాగా చెప్పించారు (పే. 84). అదేపేజీలో, "అన్నీ చూసేశాను. 'ప్రేమ'తప్ప మరోసమస్యగానీ, థీమ్‌గానీ లేనట్టు అన్నీ దానిచుట్టూ అల్లుకున్న కథలే" అంటూ నేటి సినిమాలపై మంచి విసురు విసిరారు. యన్.కె.మూర్తిని పరిచయం చేసినతీరు, అతనిపాత్ర స్వభావం ప్రత్యేకంగా ఆకర్షించాయి.

మాలతి గురించి చెబుతూ -- "పెళ్ళిచేయగల స్థోమత తమకులేదు" (పే. 32) అని





వాడారు. పెళ్ళి చేసేది ఎవరు? ఎవరికి? ఇలాంటి అసందిగ్ధవాక్యాలూ, అయోమయ సందర్భాలూ ఇంకా వున్నాయి. నవల చివర్లో సింధు ప్రారంభించిన 'సాహితీ సమరాలు' నిజజీవితంలో సాధ్యమా అనే విషయం పక్కన పెడితే, ఆ సందర్భంలో సింధు మాటలు సింప్లీసుపర్బ్! నవలంతా ఇదేఊపుతో, నడకతో సాగి వుంటే నాలుగు కాలాలపాటు నిలిచిపో యేది.

— వై.ఆర్.బి. సత్యమూర్తి,
హైదరాబాద్.

120

## హద్దుమీరిన ఆవేశం?

*(రు: 25/- బహుమతి పొందిన సమీక్ష)*

మన సాహిత్య స్వరూపస్వభావాలు ఏమిటి? మన సాహిత్యం ఏదిశగా పయనిస్తోంది? పాఠకులపై ఎటువంటి ప్రభావాన్ని చూపిస్తోంది? నేటి సాహితీ ప్రపంచంలో రచయిత, సంపాదకుడు, పత్రికాధిపతుల బాధ్యతలేమిటి?- మొదలైన ప్రశ్నలను పాఠకులలో రేకెత్తించి వారు ఆలోచించేవిధంగా రూపొందించిన వక్కలంక పద్మావతిగారి 'గ్రహణం'. నేటి పత్రికలలో వస్తున్న కథల వెనుక నడుస్తోన్న కథలను చక్కగా వివరించింది.

ఆవేశం వుండటం మంచిదే, కానీ హద్దులు మీరిన ఆవేశం అనర్థదాయకం. ఆవేశంకంటే ఆలోచన ముఖ్యం. ఈ నవలలో సింధు ప్రదర్శించే ఆవేశం హద్దులు దాటిందని చెప్పకతప్పదు. తనకి నచ్చనంత మాత్రాన ఒకరి నవలను కాల్చివేయడం సమర్థనీయం కాదు. రచయిత్రికి సైంటిఫిక్ ఫాంటసీలమీద సదభిప్రాయంలేదని అర్థమవుతోంది. ఒకప్పుడు మానవుడు చంద్రమండలంపై కాలుమోపడం సైంటిఫిక్ ఫాంటసీ, ఇప్పుడదే వాస్తవం. సైంటిఫిక్ ఫాంటసీలు సమాజం నిరసించదగినవి కావు. ఇవి శాస్త్రజ్ఞులలో సైతం ఆలోచనను రేకెత్తించి ఫాంటసీని 'రియాలిటీ'గా మార్చడానికి దోహదపడతాయి. అదే జరిగిననాడు ఆ రచయిత సమాజానికి ఎంతో మేలు చేసినవాడవుతాడు.

— యం.బి.జి. తిలక్
ఏలూరు

## రోగనిర్ధారణ చేశారు, కానీ...

*(రు: 25/- బహుమతి పొందిన సమీక్ష)*

నేటి సాహిత్యం గురించి సాహిత్యాభిమానులు, సాహితీవేత్తలు ఎలా ఆవేదన చెందుతున్నారో "సింధు" పాత్ర ద్వారా చక్కగా సూచించారు రచయిత్రి. పాఠకులను పేజీల వెంబడి పరుగెత్తించే శైలి కలిగిన రచయితలు సాహిత్యాన్ని తాత్కాలిక ఆనందాన్నిచ్చే వ్యభిచారపు సుఖంలా మలిచి పాఠకులను, యువతను ఎలా నిరాలోచనాపరులుగా దిగజార్చేదీ కూడా వివరించారు. చదివే రచనలకి, వాస్తవజీవితాలకు పొంతనలేక యువత సతమతమైపోతూ జీవితంలో ఏవిధంగా తప్పటడుగులు వేసేదీ వల్లి, రాజు పాత్రల ద్వారా స్పష్టపరిచారు.

అయితే, అస్తవ్యస్తమైన ప్రస్తుత వ్యవస్థలో రోజంతా సమస్యలతో సతమతమయ్యే ప్రజలకు కావలసింది సమస్యలను మరచి, తాత్కాలికానందాన్నిచ్చే మత్తు సాహిత్యంకాదని చెప్పగలిగారేగాని నిత్యజీవితంలో ఎదురయ్యే సమస్యలకు పరిష్కారాలను చూపే సాహిత్యం ఏదో చెప్పలేకపోయారు రచయిత్రి.

సింధు పాత్రద్వారా "ఒకవ్యక్తి నేరం చేశాడా లేదా అన్నదానికి అందుకు దారితీసిన పరిస్థితులు ఆలోచించాలి" అన్నారు. ఇలా అన్వేషణ సాగించినప్పుడు ప్రస్తుత వ్యవస్థ కారణమని తేలుతుంది. మరి వ్యవస్థ మార్పుకోసం ప్రజలకు కావలసింది చైతన్యాన్ని పెంచే పోరాటసాహిత్యమని రచయిత్రి ఎక్కడా వివరించలేదు.

వ్యాపార రచయితల ముప్పేట మురికిసిగల్లో ముడుచుకుపోతున్న సాహితీకుసుమం సమస్త ప్రజానీకానికీ శాశ్వతానందాన్ని పంచలేకపోతోందన్న బాధని, కసిని చక్కగా వివరించిన వక్కలంక పద్మావతిగారికి, సాహిత్యానికి పట్టిన "గ్రహణం" తెలుసుకునే అవకాశం ఇచ్చిన 'చతుర'కు అభినందనలు.

— దగ్గుమాటి పద్మాకర్
నెల్లూరు.

# చతుర

నవంబర్ 1987

సంపుటి: 10 సంచిక: 10


"ఈ పల్లెల్లో ఎందరో స్త్రీలు, గర్భవతులు, బాలింతలు సైతం తీసుకోవలసిన ఆహారం తీసుకోలేక రోగాలపాలై మృత్యురక్కసికి బలయిపోతున్నారు. పసివారు, వృద్ధుల సంగతిసరేసరి. ఇనుప గజ్జెల తల్లినట్టింట విలయతాండవం చేస్తుంటే పాలు, విటమిన్లు, పోషకాహారాలు గల పదార్థాలు వీళ్ళకెలా వస్తాయి? అవి కొనుక్కోగల స్తోమతేగనుక వారికుంటే ఈ రోగాలే వచ్చేవికావు. ఇప్పుడు ఆకలితో, గర్భదారిద్ర్యంతో వీరిలా చావవలసిందే! వీరి సమస్యలు ఏ ప్రభుత్వానికీ పట్టవు" అన్నాడు డాక్టరు.

ఓ పూటకు తిండి అయినా కావాలిగానీ ఈ మందులూ, చదువులూ మాకెందుకు— అనే అమాయకులు వారు. వారలా నిస్సహాయంగా చనిపోతున్నా కనీసం సానుభూతి చూపించే తీరికయినా లేనివారా గ్రామీణులు.

గుండెల్ని పిండే సన్నివేశాలతో కదిలించి, ఆలోచింపచేసే పల్లె ప్రజల జీవితగమనంలోని యదార్థ సంఘటనలకి సజీవరూపకల్పన 'మోహనరాగం'. 'చతుర' నవలల పోటీల్లో ప్రత్యేక బహుమతి పొందిన అక్కినేని కుటుంబరావు "మోహనరాగం" ఈ నెల 'చతుర' సమగ్ర నవల.



తొలి నవల "సొరాజ్జెం"తోనే ఆకట్టుకుని, "వేణుగానం", "కార్మికగీతం" నవలలతో స్థిరపడిన కుటుంబరావు పాతికపైగా కథలూ రచించారు. "అనుక్షణం సమస్యలతో పోరాడుతున్న ప్రజల జీవితాన్ని చిత్రించేదే మంచి సాహిత్యం. అలాంటి సాహిత్యం ప్రజలకు సమస్యలతో పోరాడటానికి కావల్సిన ధైర్యాన్నీ, వ్యక్తిత్వాన్నీ, సంస్కారాన్నీ ఇస్తుంది. అలా ఇవ్వటమే సాహిత్య ప్రయోజనం" అంటున్న కుటుంబరావుగారు ఈ "మోహనరాగం" రాయడానికి ప్రేరణ ఇచ్చిన మిత్రుడు డాక్టర్ యన్. గోపీకి కృతజ్ఞతలు చెబుతున్నారు.

# మోహనరాగం



చంద్రం!

మొన్న రాగానే ఆఫీసులో పనిచూశాం. ఈకౌన్సిల్‌వారీసారి నీకు బదులు నన్ను పిలిచారు. నిన్న అన్నాసాగర్ అనే వూరెళ్లాం. మాజీపువూళ్లోకి ప్రవేశించగానే పిల్లలు గుంపులు గుంపులుగా మాజీపువెంట పడ్డారు. దోవంతా దుమ్ము. దుమ్మంతా పైకిలేచి పిల్లలందరికీ పౌడర్లా ఒకోటా వేసింది. వాళ్లు కళ్లు నులుముకుంటూనే మాజీపు వెనకే పరిగెత్తి వస్తున్నారు. మహా సంతోషపడుతున్నారు. హుషారుగా కేకలూ, కేరింతలూను.

మాప్రోగ్రాం అసిస్టెంట్ డైరెక్టర్ సుందర్రావు. ఆయన జీపు వెనకకూచుని ఓ కర్రపుచ్చుకుని పరిగెత్తివచ్చే పిల్లల్ని అదిలిస్తూ కర్ర వూపుతుండగా జీపు వూరి మధ్యకొచ్చేసింది. అయినా పిల్లలు ఆగలా... పరుగెడుతూనే ఉన్నారు.

నేను సుందర్రావు దగ్గర కర్రతీసుకుని దాన్నికింద పడుకోబెట్టాను. దుమ్ము మేఘాల్లోంచి పిల్లలు పరుగుల్తో, నవ్వుల్తో, కేరింతల్తో వస్తుండగానే మాజీపు ఆగింది.

'మాతా శిశు సంక్షేమ విద్యా పథకం' అన్న బోర్డుకి పక్కగా ఒకావిడ నవ్వుతూ నిలబడి వుంది.

మమ్మల్ని చూసి ఓ అడుగు ముందుకేసి 'నమస్తే సార్' అంది సుందర్రావుకి నమస్కారం చేస్తూ.

"ఇక్కడ నుంచున్నావెందుకు?" అన్నాడాయన.

"జీపు సప్పుడిని వచ్చిన."

"ఓహో... సరే..." అని ముందుకి నడిచాడు సుందర్రావు.

నన్ను ఆమెకుగానీ, ఆమెను నాకుగానీ పరిచయం చెయ్యలా.

తర్వాత మాటల్ని బట్టి తెలుసుకున్నాను. ఆవిడ ఆగ్రామంలో టీచర్ అని. పేరు హేమ.

మేం లోనకెళ్లాం. పిల్లలు జీపుని వదిలి మావెంట గుమ్మందాకా వచ్చారు.

హేమగారు "సార్రి సార్రి" అని కనురుకున్నా వాళ్లు ఎడమకాలి మీది బరువు కుడికాలు మీదికి, కుడికాలిమీది బరువు ఎడమ కాలు మీదికీ మార్చుకున్నారే గాని కదల్లేదు.

చిత్రంగా మావంక చూస్తూ నిలబడ్డారు. వాళ్ల మొహాల్లో అమాయకత్వం కొట్టొచ్చినట్టు కనపడుతోంది.

"అందరూ క్లాసులకు సరిగ్గా వస్తున్నారా?" అన్నాడు సుందర్రావు.

"ఎవర్ని పిల్చినా రామంటనాని వెట్టిండ్రు సార్. పనులన్ని అయినంకైతే అంతవరదగ్గర వస్తమన్నారు"

"అప్పుడైనా వస్తున్నారా?"

"వస్తున్నారు సార్... కాని యాష్టకొస్తుంది సార్"

"ఏం?"

"నిన్ననే చూడుండ్రి సార్. అంచూయనేటామె వచ్చి గూనుందో లేదో ఆమె మగడు రానే అచ్చిండు"

"ఎందుకు?"

"ఎందుకేంది సార్... తోల్కబోనీకి. అందరంతనే. పెల్లాలొచ్చి పాఠం మొదలు పెట్టనే పెట్టరు. గంతట్లకే వస్తారు మొగుల్లు. 'ఇప్పటి దంక చదిందే చాలు' ఇగరా అంటరు.

ఒకాయనకి అన్నం పెట్టాలి. మరొకాయనకి మంచినీళ్లు ఇంగోయనకి నిద్రొస్తుందట.. మనమేం అనేట్టు లేద్సార్."

"కనీసం ఆ ఆడవాళ్లకైనా ఇంటరెస్టు పుట్టుందా?"

"ఆ... శానామంది 'మాకూ రావాల్నే వుందమ్మా కని శాతనైతలేదు?' అంటార్సర్. ఈయింట్ల గాకుండ యింకేడ బెట్టినా ముగ్గురొస్తామన్నార్సార్"

"ఏం... ఈ ఇంట్లో అయితే ఏమయింది?"

"ఈ ఇల్లంటే అల్లకు సరిపడదట సార్. ఈఇల్లుగలోల్లు అల్లకి దుష్మనులంట."

"సరే... ఏవీ ఆ పాఠాలు తియ్యి..." అని సుందర్రావు హేమపాఠాల పనిచూస్తోంటే నేను బయట నిలబడ్డాను. కొంగరాడవాళ్లు వచ్చారు. దాదాపు అందరి చంకల్లోను పసి పిల్లలు.

వాళ్లు మాట్లాడే మాటలు వింటూ కూర్చున్నాను నేనక్కడ వున్నట్టు వాళ్లకు తెలియదు.





క్లైన్ అర్థముంది.

మైడియర్ చంద్రశేఖర్‌రావ్, అయిదు కోట్ల రూపాయల గ్రాంటుతో 'మాతా శిశు సంక్షేమ విద్య' అనే పేరుతో ఇంటింటా దీపాలు వెలిగించాలనే సంకల్పంతో నడుస్తోంది ఈకౌన్సిల్.

దీనిలో నెలకి 12 వందల రూపాయల జీతంమీద ఓ సంవత్సరం పాటు నిరుద్యోగ రాకాసి నుంచీ తప్పించుకోడానికొచ్చి చేరాన్నేను.

నేనూ, ఇక్కడి టీచర్లూ మా అసిస్టెంట్ డైరెక్టర్, డైరెక్టర్ ఇంకా మరో ఇద్దరు పెద్దలూ, నాకొలీగ్స్ మరో ముగ్గురమ్మాయిలూ మేమంతా కల్సి ఈ శిశువులున్న మాతలకు 'కమలకు తొలిచూలు' లాంటి పాఠాలు నేర్పుతాం.

'దానివల్ల మాకేం లాభం' అంటున్నారు వాళ్ళు.

'మీరు చేవ్రాలు చెయ్యొచ్చు. కథలు చదువుకోవచ్చు. మీ అమ్మకి నాయనకి వుత్తరాలు రానుకోవచ్చు.' అంటాం మేము.

'మా పిలగానికి జరమొచ్చింది. చూస్తవా?' అనడుగుతారు వారు.

వాళ్లని చదువుకి రప్పించడం కోసం కొన్ని ఆకర్షణలు కావాలి. అందుకోసం మేంకొన్ని మందులు సప్లై చేస్తాం. మెడికల్ టెస్టులు కూడా చేస్తాం.

చూశావా చంద్రం మా ప్రజాసేవ. ఈమారు మూల పల్లెల్ని చూస్తోంటే గుండె బరువెక్కిపోతుంది. ఈలెక్కన మనం ఎంత సుఖంగా ఎంత విలాసవంతంగా బతుకుతున్నామా అన్పించి గిల్టీగా ఫీలయ్యాను.

వీళ్ల బ్రతుకుల్లో మార్పుకోసం నిజంగా ఆలోచించనివాళ్లు ఎంత నేరస్థులో, ఎంత స్వార్థపరులో అనిపించింది. నువ్వూ, మీ నాటక బృందమూ వూళ్లల్లో కెళ్లి మీరు ఇచ్చే ప్రదర్శనలూ అన్నీ గుర్తొచ్చాయి. ప్రతిరోజూ నీకో వుత్తరం రాయగలనేమో అని ఆలోచిస్తాను.

—నీ మోహన్.

ఉత్తరం రాయడం పూర్తి చేశాడు మోహన్. కాని మనసు నిండా ఏదో మబ్బు కమ్మినట్టుగా అలానే ఆలోచిస్తూ బద్ధకంగా కూచున్నాడు.

ఈరెండు రోజుల వుద్యోగ జీవితమే ఇన్ని పాఠాలు నేర్పిందే తనకు అనుకున్నాడు.

నిజంగా రెండు రోజులేనా తనా వుద్యోగంలో చేరి?

అవును... మొన్న హైదరాబాదులో బైల్దేరాడు. నిన్న వుద్యోగంలో చేరాడు. ఇవ్వాళంతా అన్నాసాగర్ వెళ్లొచ్చాడు.

అప్పటికప్పుడే తను రెండు రోజులజీతం సంపాదించేశాడు. ఏమిచేసి? తనేం చేశాడు? మాతా శిశు సంక్షేమ విద్యా పథకానికి ఈరెండు రోజులూ తనేంచేశాడు. ఏమీలేదు... నిన్నంతా ఆఫీసూ, అందులో పనిచేసే వాళ్లతోనే సరిపోయింది

పంకజవల్లి గుర్తొచ్చింది. తనవంక సునిశితమైన చూపుల్తో... తన మనసులో ఏముందో చదువుతున్నట్టు అలా చూస్తుందేమిటి ఆవిడ.

మనిషి హుందాగా, దర్పంగా ఉంటుంది. ఆడవాళ్లలో పంకజవల్లిలాంటివాళ్లు తక్కువమందే వుంటారు.

ఈఆఫీసులో అందరికన్నా పెద్దఅధికారి ఆమె. ఆసంగతి ఆమెని చూడగానే అర్థమయిపోతుంది. ఓ ముప్ఫయి అయిదేళ్లన్నా వుంటాయో లేదో కాని తెచ్చి పెట్టుకున్న గాంభీర్యం, పెద్దరికం ఆమెని మరో పదేళ్లన్నా పెద్దదాన్ని చేశాయి.

ఆఫీసు నుంచి తిరిగొస్తూంటే చెవిలో చెప్పన్నాడు సుందర్రావు "పంకజవల్లిగారు పెళ్లిచేసుకోలేదు తెలుసా?

"అహా" అన్నాడు మోహన్. అతనికి చంద్రం గుర్తొచ్చాడు. ఇప్పుడు చంద్రం వుంటే సుందర్రావుతో పంచాయితీ పెట్టుకునేవాడేగా.

"ఆవిడకు పెళ్లయితే మనకెందుకు? కాకపోతే మనకెందుకు. అసలావిడ వ్యక్తిగత జీవితం గురించి మాట్లాడుకోవటం ఎందుకు..." ల్తో మొదలెట్టి... "మీకు పనిలేకపోతే డప్పొకటి పుచ్చుకుని టముకేసుకుంటూ పొండి. నాట్రైం చెడగొట్టొద్దు" వరకూ నాన్‌స్టాపుగా పోయేవాడు.

ఆచంద్రం లేడుగనుక ఈ సుందర్రావు బతికిపోయాడు. మోహన్ పెదవుల మీదికి లీలగా నవ్వొకటి వచ్చింది.

అత్యధిక సంఖ్యలో పాఠకులు చదువుతున్న

సమగ్ర
సినీవార పత్రిక

# సితార




కేవలం రూపాయిన్నరతో సినీప్రపంచవిహారం!

సుందర్రావు అప్పుడే పంకజవల్లిగారి శీలం మీద తన అనుమానం కాస్త వ్యక్తంచేసి మోహన్‌వంక చూసి అతని నవ్వుని గమనించాడు.

“ఏమయ్యా... నవ్వుతున్నావ్. కుర్రాడివి. నీకేం అర్థమవుతయ్‌లే ఈగొడవలు. మీకు లోకం అంతా పంచరంగులమయంగా కన్పడుతుంది. అయినా మనకనవసరమనుకో... కాని ఒకటి గుర్తుంచుకో. మన పై ఆఫీసరని కాదుగాని పంకజవల్లిగారు వర్క్ విషయంలో చాలా స్ట్రిక్టు. తప్పుచేసి దొరికి పోయావా... నీ తాడు తెంచిందే. గుర్తుంచుకో”

“అసలింతకీ చెప్పాల్సిందదే. ఆవిడకి పెళ్లవలా. దానికి రకరకాల కారణాలు చెప్తార్లే. ఎవర్నో ప్రేమించిందనీ, ఆయన ఈమెని గాక మరొకర్ని పెళ్లి చేసుకున్నాడనీ... ఈమె అలానే వుండి పోయిందనీ... ఏదైతే మనకేంలే. ఆవిడకి పెళ్లవకపోవడం మూలాన.. ఆబాధంతా మనసులో వుండి... ఎవరన్నా నవ్వుతూ కనబడితే ఆమెకి చీమలు పారుతున్నట్టుంటుంది. ఎందుకు చెప్తున్నానంటే నువ్వు వచ్చినప్పటి నుంచి చూస్తున్నా. చిరునవ్వులు చిందిస్తూ చిద్విలాసంగా తిరుగుతున్నావు. కాస్త నవ్వులు తగ్గించు. ఆవిడకోపం రావచ్చు” అన్నాడు సుందర్రావు.

“మీరు మరీను. కాస్త ఊరుకోండి సార్” అన్నాడు మోహన్ నవ్వుతూ. అతనికి పంకజవల్లిగారు ఎవర్నో ప్రేమించడం, ఆయన ఎవర్నో పెళ్లాడ్డం, ఈవిడ అలానే ఉండిపోవడం... ఈవిషయాలన్నీ అలాగే ఆలోచిస్తూ ఆపే నవ్వు బుద్దేస్తోంది. పాపం పంకజవల్లీగారు అనుకున్నాడు.

సుందర్రావునోటికి మూతలేదు. ఆవిషయం అతనే అప్పటికి నాలుగుసార్లు స్వయంగా చెప్పుకున్నాడు.

“సరే సరే.... ఆవిడ కబుర్లతో కడుపు నిండుతుందా గానీ... మరి మధ్యాహ్నత భోజనం...” అన్నాడు చివరికి.

“ఎక్కడొక్కడ. ఏదో ఒక హోటల్... కాస్త మంచిది...”

“అయితే ఓ పని చెయ్యి నేను భోంచేసే మెస్ కొచ్చెయ్. రమణమ్మగారని కోస్తాజిల్లాల్నుంచి ఒకావిడవచ్చి ఇక్కడ మెస్ నడుపుతోంది. భోజనం చాలా బాగుంటుంది. డబ్బులు కూడా హోటల్ కంటే తక్కువ”

“మరింకేమండీ... ఎక్కడ?”

“మనం వెళ్తున్నాంగా అక్కడికే...”

రమణమ్మమెస్ ఒకరూమ్‌లో వుంది. దాన్నానుకుని మరోరూం. దాన్లో భోజనవడ్డార్గాలు. వసంతా అయ్యాక ఈమెస్సే ఆవిడ నివాస గృహం కూడా.

సుందర్రావుగార్ని చూడగానే రమణమ్మగారు నవ్వుతూ “రండి సార్. ఇవ్వాళింకా మీర్రాలేదేమా అనుకుంటున్నా” అంది.

“ఇదిగో కొత్తకుర్రాడు. ఇవ్వాళే మా ఆఫీసులో చేరాడు. మంచీ చెడ్డ మాట్లాడ్డూ తీసుకొచ్చేసరికి కాస్త లేటు. ఈయనపేరు మోహన్. ఇకనుంచి ఈయన కూడా వస్తాడు”

“మంచిదండి... తప్పకుండా రండి” అంది మోహన్‌వంకచూస్తూ.

రమణమ్మగారికి నలభై ఏళ్లు ఉంటాయి. దాదాపు మోహన్ వాళ్లమ్మవయసు. ఆవిడ మోహన్‌ని రండి, రండి అంటూంటే అతనికేదో రకంగా అన్పించింది.

రమణమ్మగారి కూడా అలానే అన్పించిందేమో, మోహన్ భోజనం చెయ్యడం పూర్తయ్యేసరికి 'అండీ'లు 'అయ్యా'ల్లోకి దిగాయి.

మోహన్‌కి కూడా చాలారోజుల తర్వాత మంచి భోజనం చేశాననిపించింది. అదేమాట ఆమెతో అన్నాడు.

ఆమె ముఖం నిండా నవ్వుతో “భలేవాడివి బాబూ” అంది.

“నిజమేనండీ” అన్నాడు మోహన్.

“సరే... అయితే ప్రతిరోజూ ఇక మంచి భోజనమే చేద్దూగాని” అంది.

రమణమ్మగారు భలేమనిషి అనుకున్నాడు మోహన్.

భోజనం చేసి వచ్చేటప్పుడు రమణమ్మగారి చరిత్ర మొదలెట్టాడు సుందర్రావు.

మోహన్‌కి వున్నట్టుండి ఒక ప్రశ్న మెదిలింది.

“అవునూ... సుందర్రావుగారూ మనం ఎవ

రిని చూస్తే వాళ్లగురించి చెప్తున్నారు. ఆ విషయాలన్నీ మీకు ఎలా తెలుస్తాయి" అని ఆశ్చర్యపోయాడు.

గర్వంగా నవ్వాడు సుందర్రావు, "భలేవాడి వయ్యే మొత్తానికి. మరి నీకు నాకూ అక్కడే వుంది తేడా" అందరి విషయాలూ ఎలా తెలుస్తాయనే ప్రశ్నకి అదే సమాధానంగా సరి పెట్టాడు.

"వాళ్ళందరి సంగతులు పోనివ్వండి. మీ సంగతులు చెప్పండి" అన్నాడు మోహన్.

సుందర్రావు నోటికి మూతపడింది.

మళ్ళీ చంద్రం గుర్తొచ్చాడు మోహన్‌కి.

అందరి గురించి మాట్లాడేవాడిని తన గురించీ, తన పెర్సనల్ విషయాలూ చెప్పమంటే ఆగిపోతాడనేవాడు చంద్రం.

"మీకు పిల్లలెంతమంది?"

"ఒక అమ్మాయి... గానీ మరి... నాక్కాస్త అటు పనుంది మళ్ళీ కలుద్దాం"

అని హడావిడిగా వెళ్ళిపోయాడు సుందర్రావు.

ఆ వెనుకే వచ్చి కలిశాడు పరమేశం.

"నేనంతా వింటూనే వున్నాను" అంటూ ప్రారంభించాడు. "సుందర్రావుకి ఒక అమ్మాయి నిజమేగాని ఇప్పుడు లేదులే. భార్యేమో ఈయన్ని వదిలేసింది. రకరకాల కారణాలు చెప్తారు..."

మోహన్ తల గిర్రున తిరిగింది. సుందర్రావు భార్య సుందర్రావుని వదిలినందుక్కాదది.

"నావుద్దేశం ప్రకారం..." చెప్తున్నాడు పరమేశం.

పరమేశానికి పెళ్ళయిందట ఇందాక సుందర్రావు చెప్పాడు. బహుశా పరమేశం భార్య పరమేశంతోనే ఇంకా కాపురం చేస్తున్నట్టుంది. అందుకే కాపురం చెయ్యని సుందర్రావు భార్య గురించి తన వుద్దేశం చెప్పాలనుకుంటున్నాడు.

లేకపోతే పరమేశం తనకీ, తన భార్యకి కూడా ద్రోహం చేసినట్టు ఫీలవుతాడు. మరి తామింకా ఆ కాపురం చేస్తునే వున్నారాయె.

వీళ్లకి ఆలోచించడానికి ఏమీ విషయాల్లేవా? చెయ్యడానికేమి పనుల్లేవా?

చంద్రం పాపం ఎంతవిసిగిపోయున్నాడో ఇటువంటివాళ్లతో.

అందుకే ఎవడన్నా నోరు మెదపగానే 'ఆ విషయాలు మన కనవసరం' అంటాడు వెంటనే.

చంద్రం దగ్గర ఇటువంటివాళ్ళు అసలు నోరు మెదపర్లే తనలాంటి వాళ్ళదగ్గరే వీళ్ళిష్టం వచ్చిందల్లా వాగుతారు.

"మీతో పాటు చేరిన ఆ ఛాయా, సుజాత మీకు తెలుసా?" ప్రారంభించాడు పరమేశం.

"మీకెంత తెలుసో నాకూ అంతే"

"అహా..." అని ఆలోచనలో పడ్డాడు పరమేశం. అంతలోనే తన వుద్దేశం చెప్పవల్సి వుందన్న సంగతి గుర్తొచ్చినట్టు- "ఈ వయసులో ఆడపిల్లలు ఇంతింత దూరాలు వంటరిగా..." అని 'చూశారా లోకం ఎంత పాడయిపోయిందో' అన్నట్టు పెదవి విరిచి చేతులు వూపాడు.

"ఏమవుతుందండీ? మనం చెయ్యటంలా దూరంగా... వంటరిగా..."

"అంటే... ఆడపిల్లలకీ మనకీ తేడాల్లేవా?"

"తేడా ఏమిటి? వాళ్ళూ వుద్యోగానికే వచ్చారు. మనమూ వుద్యోగానికే వచ్చాం"

"వుద్యోగం సరే... ఎంతయినా ఆడపిల్లలు గదా"

"అయితే ఏమిటి?"

పరమేశం వుద్దేశం ఏమిటో తెలుస్తూనే వుంది.

మోహన్ మనసు అసహ్యంతో నిండింది. మనుషులు ఎంత వున్నతులో అంతకంటే అథములు కూడా. ఎంత జ్ఞానులో అంతకంత అజ్ఞానులు కూడా.

ఆడపిల్ల అంతదూరం వచ్చి వుద్యోగం చేస్తోందంటే- ఆ పిల్లకి ఎంత ఆత్మాభిమానం, ఎంత వ్యక్తిత్వం, ఎంత అవసరం, ఎంత ధైర్యం వున్నాయో ఓ వైపున తెలుస్తూనే వున్నా తెలుసుకోరేం?

ఆ పిల్ల అంత దూరం వచ్చింది వుద్యోగం

కోసం కాక శీలం పాడుచేసుకోవటం కోసమేనన్నట్టు అంతంత అజ్ఞానంతో ఎలా ఆలోచిస్తారో ఈ మనుషులు.

సరే... ఆలోచిస్తారు. ఎంత నిర్భయంగా ఎంత నిర్లజ్జగా. ఆ విషయం బైటికి మాట్లాడ్తారు.! అకస్మాత్తుగా మోహన్‌కి ఒక విషయం తట్టింది. చంద్రం ఈ విషయాల్లో ఎదుటివాడు ఏమనుకుంటాడో అని జంకకుండా వాదిస్తాడు. తను ఆలోచిస్తున్నాడు గానీ పరమేశంతో గానీ సుందర్రావుతోగానీ వాదించటంలేదు. తన అభిప్రాయాలు, తన అసహ్యాలు మనసులోనే దాచేస్తున్నాడు.

చంద్రం అలా దాయడు.

"ఎంతయినా ఆడపిల్ల ఆడపిల్లేగదా" అన్నాడు పరమేశం.

అవును అన్నాడు మోహన్. "అయితే మగపిల్లవాడు కూడా మొగపిల్లాడే. కాని ఆడపిల్లకాదు" అన్నాడు.

పరమేశానికేమీ అర్థంకాలేదు. అలా అని బైటపడటం నామోషిగా ఫీలై వూరుకున్నాడు.

ఆఫీసు వచ్చింది. మోహన్ తన సీట్లోకెళ్ళేంటే ఛాయ అంది- "ఏమండీ మోహన్‌గారూ... మీరెళ్ళేప్పుడు మమ్మల్నీ పిలిస్తే భోజనానికి మేమూ వచ్చే వాళ్ళంగదా!"

"అరరే! పొరపాటయిపోయిందండీ..." అన్నాడు... మళ్ళీ "అదిగాక..." అని వూరుకున్నాడు.

"ఏదిగాక?" అని కళ్ళెగరేసింది ఛాయ.

"అక్కడ... మేమెళ్ళింది ఏదో చిన్నమెస్సు కండీ ఆడపిల్లలెవరూ లేరు. హొటల్‌కాదు"

"అయితే' అంది ఛాయ.

ఆమాట చురుక్కుమంది మోహన్ మనసులో. అయితే ఏం?

పరమేశానికొక లిమిట్ తనకి మరొక లిమిట్. తనూ అనుకుంటాడు ఆడపిల్ల ఆడపిల్లేగదాని. జాగ్రత్తగా వుండాలి. ఆలోచించడం నేర్చుకోవాలి. గానుగెద్దు అలవాటు ఆలోచనల్నుంచి బైటపడాలి...

"సారీ అండీ..." అన్నాడు మోహన్.

"అరే భలేవాళ్ళే... నేను సరదాకన్నాను..."

"మరి మీ భోజనం?"

"ఈ పూటకి పంకజవల్లిగారితో చేశాం. రేపట్నుంచి చూద్దాంలెండి"

"మీరెక్కడుంటున్నారు?"

"ఎవరో దూరబ్బంధువులింట్లో దిగాను. నేను, సుజాతగారూ కల్సి ఒక రూం తీసుకొని వంటమొదలెడదాం అనుకుంటున్నాం. చూడాలి."

పంకజవల్లిఅటు వచ్చి నుదురూ నొసలు చిట్లించింది. ఆమె ఛాయవైపుచూసిన చూపుల్లో కోపం కొట్టొచ్చినట్టు కన్పడుతూంది.

మిస్.ఛాయా! ఆఫీసులో ఖబుర్లు చెప్తూ ఎప్పుడూ కనపడొద్దు. పనిలేకపోతే కామ్‌గా కూర్చోండి. మిగతావారిని డిస్టర్బ్ చెయ్యొద్దు"

"అదికాదు మేడమ్..." అంటున్న ఛాయను

"ఏదీకాదు. ఎక్స్‌ప్లనేషన్సంటే నాకసహ్యం మాట్లాడొద్దు" అని వెళ్ళిపోయింది.

ఛాయ మొఖం చిన్నబుచ్చుకుని

"ఇప్పుడు మనం ఏంమాట్లాడామని?" అంది నెమ్మదిగా.

"వూరుకోండి" అన్నాడు రెండు సీట్లవతలున్న పరమేశం రహస్యంగా పంకజవల్లి వెళ్ళిన వైపు తలెగరేస్తూ.

మోహన్ ఛాయ వంకచూస్తూ అనుకున్నాడు-

'ఛాయ చాలా అందంగా వుంటుందే' అని 'అందం అనేది రెలిటివ్' అంటాడు చంద్రం.

ఛాయకన్నా అందమైన వాళ్ళని తను బైట చాలామందిని చూశాడు. నిజమే... మరి ఛాయ అందమైనదని ఎలా అనుకుంటున్నాడు.

పక్కకి చూశాడు. సుజాత పని చేసుకుంటోంది.

తన వంక మోహన్ చూసినట్టు గమనించినట్టుంది. తల ఎత్తి అతనివంక చూసింది.

సుజాత కన్నా ఛాయ చాలా అందమైంది అనుకున్నాడు మోహన్.

కాని సుజాత కళ్ళల్లో- చూపుల్లో ఏదో ఓవింత అందముంది అని కూడా అనుకున్నాడు.

'తనింత బలహీనుడేమిటి' అనుకున్నాడు మోహన్.

అమ్మాయి కనబడగానే ఆ అమ్మాయి అందం గురించి అర్జంటుగా ఒకభిప్రాయానికి రావాల్సిందేనా?

సుందర్రావు అందాన్నిగాని, పరమేశం అందాన్ని గానీ తను గుర్తించలేదే. కనీసం వారి అనాకారితనాన్నయినా.

ఆడపిల్లని ఆడపిల్లగానే చూస్తామా?

ఆడపిల్ల అనగానే అందంగా వుందాలేదా అనే చూస్తామా?

ఎందుకూ?

మనిషిగా గుర్తించమా?

పంకజవల్లిగారి క్యాబిన్‌నుంచి వస్తూనే సుందర్రావు- "రేపు మనం అన్నాసాగర్ వెళాలి. అన్నాసాగర్, దానికి సంబంధించిన ఫైల్సి

ఏగో. ఇవి చూడండి... రేపెళ్ళాలి'' అని కొన్ని ఫైల్సు చూపాడు.

మోహన్‌లేచి ఆ ఫైల్సు అందుకున్నాడు. ఒకటి సుజాతకీ, ఒకటి ఛాయకీ ఇవ్వబోతుంటే ''వాళ్ళక్కర్లా'' రేపు మనిద్దరమే వెళ్ళేది. నాల్రోజులు పోయాకవాళ్ళు వస్తారు అన్నాడు.

''మేమూ వస్తాంసార్'' అంది ఛాయ.

''తర్వాత్తర్వాత, మీకు వేరేపనుంది. మేడం చెప్తారు'' అన్నాడు సుందర్రావు.

ఛాయ మొఖం మీద డిస్సప్పాయింట్‌మెంట్. సుజాత తలదించుకుని ఏదో రికార్డు చూస్తోంది.

ఇవ్వాళ అన్నసాగర్ వెళ్లడం గుర్తొచ్చింది మోహన్‌కి.

నగర కాలుష్య వాతావరణం నుంచి పల్లెసీమల స్వచ్ఛతలోకి రాగానే...

మోహన్‌కి ఏదో కొత్త ప్రపంచంలోకి కళ్ళు తెరిచినట్లయింది. తెలుగు డిపార్టుమెంటు ఉక్కు కౌగిళ్లనుండి ఈ విశాల ప్రపంచంలోకి...

ఎకడమిక్ పొరల కింద నుండి ఈ ఆకాశపు వీధుల్లోకి...

సినిమా కృత్రిమ అందాల్నుంచి నిజమైన ప్రకృతి సౌందర్యాల్లోకి...

వూళ్ళల్లో తాండవిస్తున్న దరిద్రంలోంచి స్పీడుగా వెళ్ళాడు జీపులో.



''గాజులపేటా ఇది జాజులపేటా'' అంది సుజాత.

సుజాత మితభాషి.



''భలే అన్నారే... నేనూ నిజంగా అలానే అనుకుంటున్నా. ఏ ఇంటి ముందుచూసినా సన్నజాజులు, విరజాజులూను'' అన్నాడు మోహన్.

''కాని ఈ వూరిపేరు గాజులపేటే'' అంది ఛాయ.

''జిల్లాలో సగం మందికి ఇక్కణ్నించే గాజులు సరఫరా అవుతాయట తెలుసా?'' అన్నాడు సుందర్రావు.

''అసలందుకే ఈ వూరికీ పేరు'' అన్నాడు పరమేశం. ముందు జీపులో తాము, దానివెనుక దుమ్ములో పిల్లలూ...

కేంద్రానికొచ్చారు.

గాజులపేటలో టీచర్ రమాదేవి.

జీపులో నుంచి దిగిన అయిదుగురూ, రమాదేవీ...లోనకెళ్ళారు.

లోన ముగ్గురు తల్లులున్నారు.

''ఎవరూ ఇంకా రాలేదు'' అన్నాడు సుందర్రావు.

''ఎక్కడసార్, జర పొద్దుమూకాలే ఇప్పుడే అంత పన్లల్లకెల్లి వస్తరు. అన్నం గినవండుకోవాలె గదా. పిల్లల్కి పెట్టుకోవాలె. ఆల్లని నిద్రబుచ్చాలె. ఇంగ అప్పుడు రావల్నని పిస్తే వస్తర్రు. లేకుంటే పంటరు''

''అప్పుడైనా రావాలని చెప్పలా. శుభ్రంగా తినిపడుకుంటే చదువెట్లా వస్తుంది? ఇల్లిల్లూ తిరిగి చెప్పి తీసుకురావాలి. మీపనే అది.''

''తిరుగుతా... సార్ తిరుగుంటేనే ఈల్లంతా వస్తున్రు''

''ఓ టీచరమ్మా... నువ్వు మా ఇంటి కేడవచ్చినవ్'' అంది ఆ ముగ్గుర్లోంచి ఒకామె.

''నీ పేరేంటమ్మా?'' అన్నాడు సుందర్రావు.

''నా పేరు జాన్కి''

''మీ ఇంటికి రావాలన్నేముంది? మీరు ముగ్గురూ ఆ పోచమ్మ నల్గురూ ముందుగాల్లే వస్తరుగదా!''

''గందుకే యింగ మీ యిళ్ళకి రాను'' అంది రమాదేవి.

''మరి మీ పన్లన్నీ అయిపోయినయా?''

''అప్పుడే ఏడతయివన్లు''

''మరి...''

వాళ్లకి వాళ్లత్తమ్మలున్నారు. వాళ్లుచేస్తరు ఇంఢ్లల్లపన్లు''

''అహా... బాగుంది. మరి మిగతావాళ్ళని కూడా అలానే రమ్మంటే''

''ఏం సార్ గట్లన్నవని ఈ వూర్లె ఎరి కైందంటే మస్ల గీ వుర్లెకే అడుగెట్టనీరు గుర్తయిందా?''

అందర్కత్తమ్మలుంటరా? వున్నాగాని అందరొక్కతీర్గుంటరా?'' అంది రమాదేవి.

''అగ్గో... ఈరమ్మొచ్చింది'' అంది జాన్కి.

అందరూ ఈరమ్మని చూశారు. కొత్తగా జూస్తున్నమోహన్, ఛాయ, సుజాతలు అలానే ఈరమ్మవంక రెప్పలార్పకుండా చూస్తున్నారు.

ఈరమ్మ నడుం వరకు వంగిపోయి అలానే నడుస్తూ నెమ్మదిగా వస్తోంది. ముఖమంతా పెద్దపెద్ద ముడతలు. బక్కగా ఎముకల గూడు, గుడ్డకప్పుకుని వూగుకుంటూ నడ్చి వస్తోన్నట్టుంది.

ఈరమ్మ... ఆ వూర్లోనేకాదు ఆ చుట్టువక్కల చాలావూర్లలో అందరికన్నా పెద్దది.

పండు ముసలి.

''ఏంది ఈరవ్వా... చదువుకోనీకొచ్చినవా?'' అంది జానకి. మిగిలిన ఇద్దరూ ఇప్పటికి నోరుతెరిచి ఓ నవ్వు నవ్వారు.

''ఏందీరమ్మా... నువ్వు రాకుమని జెప్పిన గదా. ఎందుకొచ్చినవ్...'' అంది రమాదేవి.

''ఏ... ఎందుకని?'' అన్నాడు వరమేశం.

''లొల్లిజేస్తుంది సార్! పాతాలు జెప్పనీదు. ఏమన్నాపెద్దె పోతానంటుంది. అందర్తోని ముచ్చట్లు పెడ్తుంది'' అంది రమాదేవి.

''అల్లరిపిల్లన్నమాట'' అనుకున్నాడు మోహన్.

ఈరమ్మ ఏదో అంది.

ఆమె మాట్లాడిందని తెలుస్తోంది గాని ఏం మాట్లాడిందో తెలవడంలా.

''ఏమిటి అంటుంది?''

''కొత్తకొత్త పంతుల్లొచ్చిర్రే... అంటుంది సార్'' ఈరమ్మ మాట్లాడ్డానికి చాలా కష్టపడాల్సొస్తోంది.

''ఈరమ్మా బైట కూసో. పెద్ద సార్లొచ్చిన్రు'' అంది రమాదేవి. ''నాకన్నా పెద్దనా? ఎన్నేళ్లుంటయ్?'' అంది ఈరమ్మ.

ఈసారి కాస్త అర్థమైంది మిగిలినవారికి. మోహన్ ఈరమ్మ చేయిపుచ్చుకుని ''ఇక్కడికిరా'' అని బైటికి తీసుకువెళ్ళాడు. వాళ్ళతో పాటే సుజాత, ఛాయ కూడా బైటికొచ్చారు.

బైట అరుగుమీద కూర్చున్నాక– ''నీ కన్నేళ్లు'' అన్నాడు మోహన్.

''ఎవని గ్గుర్తు'' అందామె.

''మమారుగా...''

''ఆ...''

''అన్‌దాజ్‌గా...''

''మాకేం దెలుస్తది...'' అంది ఈరమ్మ.

''పెద్దోల్లు చెప్తారు గదా...'' అన్నాడు మోహన్.

''అందరికన్నా నేనే పెద్ద...'' అంది మళ్ళీ-

''ఒక వంద వుంటాయా...'' అడిగాడు.

''పట్నంకొట్కపోయినపుడు మంచిగున్న'' అంది ఈరమ్మ. ఆవిడ కళ్ళల్లో మినుకుమినుకుమనే కాంతి.

''పట్నం కొట్కపోవడం ఏమిటి?'' అంది ఛాయ.

''ఏ వందేళ్ల క్రితమో వరదలొచ్చి హైద్రాబాదు కొట్టుకు పోయుంటుంది. అప్పుడు తనకు తెలునంటుంది''

''పిల్లలున్నరా?'' అంది ఛాయ.

''ఇంకా నయం పెళ్ళయిందా అన్నారు కాదు'' అన్నాడు మోహన్.

సుజాత నవ్వింది.

''అహా... అదికాదు ఇప్పుడున్నారా అని'' అని నవ్వింది ఛాయ.

''ఆ...?'' అంది ఈరమ్మ.

''పిల్లలు ఎంతమంది?''

విని వూరుకుంది ఈరమ్మ. ముగ్గురూ చెబుతుందని చూస్తున్నారు. ఏమీ మాట్లాడలేదు ఈరమ్మ.

''పిల్లలు...'' అని ఛాయ రెట్టించి అడిగింది.

'లేరన్నట్టు' చేతులూపింది ఈరమ్మ.

''లేరా?''

''అసలు పుట్టలేదా?''

పుట్టారన్నట్టు తలూపింది ఈరమ్మ.

''ఎంతమంది?''

ఈరమ్మ చెప్పింది. మొత్తం పదమూడు మంది పిల్లల్ని కంది. పుట్టగానేనే, పుట్టి కొన్నాళ్ళు పెరిగో తొమ్మిదిమంది చచ్చిపోయారు. బాగా ఎదిగి పొల్లానికి వెళ్ళేసగా నాలుగురోజుల



ముందు చచ్చిపోయిందొక పిల్ల. ఇద్దరాడపిల్లలు. ఒక్క మగపిల్లగాడు పెళ్ళిళ్ళు చేసుకుని పిల్లల్నిగని పెద్దమనుషులయిపోయి వెళ్ళిపోయారు అని ఆకాశంలోకి చూపింది.

''మనుమలు మనుమరాళ్లూ...''

''ఉన్నారు ఎక్కడెక్కడో...''

''చూడ్డానికి రారా?''



వాళ్ళని చూడ్డానికి తనే వెళ్లాలి. చావకపో యినా ఈ ముసల్ది చచ్చినదానికిందే లెక్క. ఏ పనీ చేయని. ముసలాళ్లంటే ఎవరిక్కావాలి.

మొన్నామధ్య ఒక మనమరాలు కూతురు పెళ్ళి చేసుకుంటూ తనని పిలవలా. వెళ్ళి పోట్లాడింది ఈరమ్మ. నేను లేకపోతే మీరంతా ఎక్కడ్నించి వచ్చారు అంది.

మర్చిపోయారట.

"యాది మర్చినం" అని మూడునాలుగు సార్లు గొణిగింది.

"నువ్వేంది. ఆ దేవుడే యాది మర్చినాడు. ఈరమ్మని పిల్చుకొద్దామని ఆనికేలేదు. ఎన్న డు బంపిండు ఈ లోకంల? ఏందినమని రాశిండు? ఏంజెయమని వంపిండు? ఆని రాసే చేతికి జెట్ట పుట్ట. యాది మర్చిండు"

భారతదేశంలో ప్రతివారిలానే.

"అంశల వున్నంత వుంటది" అంది.

"ఏ బాయిలోనన్నా దూకాల్నా? నాకేల ఆ పావం? బిల్వకపోతాడా? నేనడక్కపోతానా? కడి గ్గడిగి వెత్త ఏమనుకుంటుండో..."

అని కాస్తాగి.

"అసలందు గురించే బిలిపిస్తలేడో..." అని ఆలోచనలో పడింది.

"షీ ఈజ్ వెరీ ఇంటరెస్టింగ్" అన్నాడు మోహన్. తనకుతను అనుకున్నట్టు.

"మరి ఎవరు చూస్తున్నారు నిన్ను?"

"ఎవరు జూస్తరు. వూరోల్లే ఇంత పెడ్తారు. నా సిన్న మనవడు అప్పుడొక చారాన యిప్పుడొక చారాన చేత్ల పెడ్తడు..." అని మోహన్‌వంక అతని తలవంక చూసింది. ఆ చూపులో ఏదో అర్థింపు.

"ఏమిటి?"

"నా మన్మడు మంచిగ తలలని జేస్తడు నువ్వు చేయించుకోవాలె. ఒక్కసారన్నా నువ్వు చేయించుకోవాలె"

తలూపాడు మోహన్.

"బిల్వాల్నా?"

"ఇప్పుడా? ఇప్పుడు కాదు. వచ్చేవారం. మళ్ళీవస్తూనే వుంటాంగదా అప్పుడు" "తప్ప కుంటా"

"ఆ. తప్పకుండా"

"ఆన్తోని పన్జే యించుకోవాలె. మంచిగ చేస్త డు. పెద్దపెద్దోల్లకి జేసిండు"

"సరే" అన్నాడు మోహన్. తప్పకుండా ఓసారి చేయించుకుంటానని కూడా అనుకు న్నాడు. మరీ బాగోకపోతే మహబూబ్‌నగర్‌లో మళ్ళీ చేయించుకోవచ్చు అనికూడా అనుకు న్నాడు.

"నువ్వాన్తో పనిచేయించుకో, పైనలు..." అని ఆగింది.

"నీకిస్తాలే" అన్నాడు మోహన్.

ఆ ముసలమ్మ కళ్ళల్లో ఎక్కడో అకస్మాత్తుగా వెలుతురు పొరొకటి తళుక్కుమంది.

"వంట చేసుకున్నావా?" అంది ఛాయ.

ఏమీ మాట్లాడలా.

"కూరేమి వండినావు?"

"ఎంద్లకో..."

ఆ ముగ్గురూ ఒక్కసారి నీరసపడిపోయారు. నిండా నీళ్ళున్న బోదెకి గండిపడితే కాళీ అయి పోయినట్టు మోహన్ మనసంతా కాళీ అయిపో యింది.

"ఎంద్లకు"

కూర ఎంద్లకు...?

అసలైన అన్నం వుండాలిగా... కూరొందుకో వాలంటే అసల్దేలేదు యింక కూరెందుకు..

అన్నం తిని ఎన్నాళ్ళయిందో... ఎందుకా ప్రశ్న...

ఆ ముసలి ఈరమ్మ మొఖంమీద ఏ విషా దానికీ వినోదానికి స్థానంలేదు. ముఖమంతా ముడతల మయం. ఒక్కోముడతా వేల విషా దాలకి ప్రతిబింబం.

ఎంతమంది ఈరమ్మలు ఈ పవిత్ర భారత దేశంలో...

మోహన్ మనసు బరువెక్కింది.

"మోహన్‌గారూ లోనికి రండి" అన్నాడు సుందర్రావు.

ముగ్గురూ లోనికెళ్ళారు.

ఒక్కొక్కరే తల్లులొస్తున్నారు. వచ్చినవాళ్ళు

నరాసరి వెళ్ళి కూర్చోక అటుఇటు తప్పుకుంటూ అందరికీ అందరూ అడ్డం పడ్తున్నారు.

రమాదేవి బైటికిచూసి- "గా బోతున్నది శాంతమ్మగాదూ?" అని "అవ్... అవ్" అంటున్నవారి మాటలుకూడా వినక బైటికి పరుగెత్తింది.

"షీ ఈజ్ ఏ హార్డ్ వర్కర్" సర్టిఫికేట్ ఇచ్చాడు సుందర్రావు.

"ఎక్కడికి పరిగెత్తుతోంది" అంది ఛాయ.

వాళ్ళ చేతుల్లో బొమ్మలూ, బొమ్మలకింద మాటలు వున్న అట్టలున్నయి. వాటిమీద

'కమలకు తొలిచూలు' అనో లేక అలాటి మరోటో... ఉంది.

"చూడండి" అన్నాడు పరమేశం.

"ఓ శాంతమ్మా..." అంటూ అటువెళ్తున్న ఒకామె వెంటబడింది రమాదేవి.

శాంతమ్మ ఆగింది.

ఆమె నెత్తిమీద కట్టెలమోపు.

"గిప్పుడొస్తున్నావు"

"అవ్ అమ్మా. మల్లేం జెయ్యాలే"

"ఏడ నుంచి దెస్తున్నావ్"

"ఇంకేడ్నుంచి. అడివిలకెల్లి కొట్టుకొస్తున్న"

"మల్ల గివి ఇంట్ల బడేసి వస్తవా"

"మల్ల ఇంట్ల పని నువ్వు గిన జేసి బెడ్తవా? గట్లయితే జెప్పు మల్ల... వస్త"

రమాదేవి చుట్టూ చూసింది. బైట వసారాలోంచి మోహన్ సుజాత చూస్తున్నారు. రమాదేవి సుజాతకేసి చూసి శాంతమ్మ కేసి తలూపి చూపింది.

"గిట్లున్నయ్ నా తిప్పలు" అన్నట్టు.

"మల్ల జల్దిరా పన్లన్ని జేస్కోని"

"వస్తగని..." అని ఆగింది శాంతమ్మ.

"పెయ్యంత నొప్పి లేస్తుంది. మల్ల గోలీలిస్తవా?"

"ఇస్త... రా"

"ఇగ యిస్తనంటేనే వస్త..."

"అరే రామా... ఇస్తనన్నగదా. ఇస్తనంటే ఇస్త. గంతనే. పట్నంకెల్లి అగో డాక్టరమ్మగూడ వచ్చింది. అరె. పచ్చొల్లు. వారమన్న గాలె. బిడ్డని గని. తిరగొద్దమ్మా అంటే యినకుంట అడివిలోకెల్లి కట్టెలు గొడ్తవ్. ఆటిని మోసుకొస్తవ్. అన్ల తడుస్తవ్. పెయ్యినొప్పి లేస్తుందంటే లేవదా మల్ల..."

"ఏంజెయ్యాల్నమ్మ మల్ల కట్టెలు కూడా ఇప్పియ్యి గోలీలిక్క. నీ యిస్కూలు కొచ్చి పాఠాలు సదూకుంట మంచిగా" అని వెళ్తోంది.

వెనకనుంచి రమాదేవి- "శాంతమ్మా వస్తున్నవ్‌గదా" అంది మళ్లీ.

"ఆ... వస్త" అనుకుంటూ పోయిందామె.

"గిట్లుంటయ్ సార్ మా తిప్పలు" మోహన్‌తో అంటూ లోనికెళ్ళింది రమాదేవి.

సుజాత అలానే నిలబడి శాంతమ్మ వెళ్ళిన వైపు చూస్తోంది.

లోపలినుంచి పిలుపొచ్చింది. అందరూ సీరియస్‌గా పని చూస్తున్నారు.

రమాదేవి అరుస్తూ పాఠాలు చెప్తోంది. ఎంతమంది వస్తున్నారు?

చదువెందాక వచ్చింది?

ఎన్ని కేసులు చూశారు?

ఎంతమందికి ఏం మందులిచ్చారు?

పాఠాల్లో వస్తున్న సమస్యలు? తల్లులేస్తున్న ప్రశ్నలు?

బాగా పొద్దుపోతోంది. శాంతమ్మ వచ్చింది. ఆవిడ మొఖంలో ఇంకా పచ్చితనం పోలా. రక్తంలేక మనిషి తెల్లగా పాలిపోయి వుంది.

"ఏమమ్మా బాలెంతరాలవు గదా. వానలో తడవగూడదని తెలవదూ?" అన్నాడు సుందర్రావు.

"తడవకుండా ఎలా ఎల్తాదయ్యా?" అంది.

తిరుగులేని ప్రశ్న అది!

"పచ్చి కట్టెలు మండుతయ్యా మరి!"

"మండినా వూదాలె. మండకున్నా వూదాలె."

ఆమెకేమి సమాధానం చెప్తారు ఎవరైనా?

శాంతమ్మ నడుం పడిపోతోంది.

"నేనీడ గూకుందునా" అంటూనే ఓ గోడవారగా చతికిలబడింది. గోడకానురుని "ఓ రమమ్మా. జర్ర గోలీ లిప్పిస్తవా మల్ల!" అంది.

"కూకో... పాఠాలయినంక ఇప్పిస్త" పాఠాలు చదువుకుంటే గోలీలొస్తయ్ శాంతమ్మకు. గోలీలిస్తే పాఠాలు చెప్పొచ్చు కౌన్సిల్‌కి.

పాఠాల కోసం వచ్చినవాళ్లేగాక వారితోపాటు ఇరుగూ పొరుగమ్మలొచ్చి బైట ఓ నలుగురైదుగురు కూర్చున్నారు.

ఈరమ్మనేదో వకటి అనడం, ఈరమ్మేదన్నా అంటే ఒకర్నొకరు చూసి నవ్వుకోవడం... ఇదీ వారి పని. మధ్యమధ్యలో లోన ఎవరేం చేస్తున్నారో చూస్తున్నారు.

మోహన్‌లోన కూర్చునే బైటవాళ్లు మాట్లాడకునే మాటలు వింటున్నాడు. అతనికి ఈ వూరు, ఈ వాతావరణం, ఇక్కడి వారి మాటలూ, వారి ప్రవర్తనా అన్నీ కొత్తగా వున్నాయి.



అందుకే ఈరమ్మతో బైటివారు జరిపే సంభాషణ మీదున్న శ్రద్ధ లోన జరుగుతున్న కార్యక్రమం మీదలేదు.

"ఓ ఈరమ్మా... నువ్వు ఏ బాయిలోనన్నా దూకుతావనే గావచ్చు మనూర్ల బాయిలన్నిట్ల నీల్లు లేకుండ జేసిండు నీ భగమంతుడు" అంది ఓ స్త్రీ.

"అవ్వవ్! మనుసుల్ని బుట్టిస్తడు. ఆల్లకు తిండిలేకుంటజేసి తమాసజేస్తడు. బాయిల్ల నీల్లుండవే! పశువులకు గడ్డిగాదం సూతలేకుండపోయే. పశువులన్నీ చావనన్న జస్తున్నయ్. బతికుంటే కటెకోనింటెకన్నా బోతున్నాయ్. మా కాలంల జమానిట్లుండకపోయే" అంది ఈరమ్మ.

"అవ్.... భగమంతుడు కూడ నీలెక్క పెద్ద మనిషయి పనిసరిగా జేస్త లేడనుకోరాదు" అంది మరో స్త్రీ.

"అవ్ బిడ్డ! అట్లనే వుంది సూడంగ. ఇన్నాల్లు నాలుగిల్లు తిరిగితే నాలుగు మెతుకులు దొరికేవి. ఇప్పుడు నాలుగిల్లు కాదు, వూరు వూరంతా దిరుగు- నాలుగు మెతుకులేసెటోల్లులేరు. ఆకలితో మాడి సచ్చేరోజు లచ్చినయ్" అంది ఈరమ్మ.

"ఈరవ్వా! నీకు బెత్తలేరని అనుకోకు. తిన నీకి ఆల్లకేలేదు"

"ఎవరికి?"

"ఎవరికేంది? వూల్ల అప్పటి లెక్కలేదు జమాన! అందరికందరూ జస్తున్నారు."

"సావరామల్లా! వానలే కురవకపోయె. మల్ల పంటలేడినుంచొస్తయ్"

"అదే మల్ల. పంటలే లేకపాయె. ఇక తిండేడకెల్లొస్తది"

"ముసల్దానికింత పెట్టకపోతే పోయింది. మీరంత ఏం తినకుండనే పంటుర్రా" అంది ఈరవ్వ.

"చెప్తె సిగ్గుబోతది. మా ఇంట్లో అన్నందిని ఎన్నాల్లయిందో ఎర్కనా" అందొకావిడ.

"మీ ఇల్లేంది... మనోల్లంతా ఇంతింత అంబలి తాక్కుంట బత్కుతుర్రు" అంది మరొకావిడ.

"నాగ్గూడ ఆ అంబలే జరంత పోయుర్రి" అంది ఈరమ్మ.

"నీకెవలూ పోయికుండనే బత్కుతున్నవా. మల్ల మేం బొయ్యకుంటే నీ పోరలు పోస్తున్నరా" అందొకావిడ కోపంగా.

"అరె... పోస్తున్నరమ్మా! పోయిలేదని నేనెట్లంటా? నా పోరలు పోసేటోల్లయితే మీతోని మాటలు బడ్తనా?" అంది ఈరమ్మ.

"అగో... ఎవలన్నారు నిన్ను మాటలు" మాట్లాడకుండా వూరుకుంది ఈరమ్మ.

"మనం రోజు అన్నం దినుకుంట ఆమెకి అంబలిపోస్తున్నం అనుకుంటదామె"

"లే...బిడ్డా... లేనేనట్టా అనుకుంటలేను గాని ఎన్నాల్లాయె అన్నందిని...." అని ఎటో చూస్తోంది ఈరమ్మ.

మోహన్‌కి గుండె పట్టేసింది.

"పోతుల మడుక్కివ్వాళెళ్తున్నామా సార్?" అన్నాడు మోహన్.

పోతులమడుగు పేరు వింటూనే పరమేశం ముఖం మీద ఒక చిత్రమైన నవ్వు మొలిచింది.

రెప్ప వెయ్యకుండా ఓ నిముషం మోహన్ వంకే చూశాడు. "ఏమిటలా చూస్తున్నారు?"

"పోతులమడుక్కి వెళ్ళడానికి తొందరపడుతున్నారెందుకా? అని" అంటూనే వెకిలిగా నవ్వాడు.

నవ్వుతూ ఛాయవైపు చూశాడు. అప్పటివరకూ పనిచేసుకుంటున్న ఛాయ వీళ్ళ సంభాషణ వింటూ ఇటు చూసింది.

పరమేశం నవ్వాపాడు.

"తొందరేముంది? మనకున్న వూళ్ళన్నీ తిరగాలిగా. పోతులమడుగు... కూడా వెళ్ళాలన్నారు గదాని"

"అవునవును. అసలు మొదటిరోజే వెళ్ళాల్సింది పోతుల మడుక్కి..."

"ఇవ్వాళెళ్తామా" అంది ఛాయ.

"ఏమోనండి... నాకు తెలియదు. అయినా ఈ ప్రోగ్రాంలన్నీ వెయ్యాల్సింది సుందర్రావు గారు... ఆయన్నే అడగండి" అని పనిలోపడ్డట్టు నటించాడు పరమేశం.




పోతుల మడుగుకేదో కథ వున్నట్టుంది అనుకున్నాడు మోహన్.

ఇవ్వాళ పోతులమడుక్కెళ్ళాలి అనేది మధ్యాహ్నానికి సెటిల్ అయింది.

మధ్యాహ్నం నుంచి ఆఫీసులో ఒకరకమైన వాతావరణం నెలకొంది.

పంకజవల్లి రుసరుసలాడుతూ తిరిగింది.

సుందర్రావు అనవసరంగా ముఖం గంభీరంగా పెట్టుకున్నాడు.

పరమేశం అటుఇటు చూసి మోహన్‌కేసి చూసి కన్నుకొట్టడం, చిరునవ్వులు వలికించడం.

మోహన్‌కిగాని, ఛాయ, సుజాతలగ్గానీ ఈ వరసేమీ అంతుబట్టలేదు. సరే... చూడబోతూ ఆతురత ఎందుకు అని వూరుకున్నారు.

ఇక బైల్దేరతారనగా పంకజవల్లి కేబిన్ లోంచి వచ్చి అందరి వంకా సీరియస్‌గా చూసింది.

"అయితే పోతులమడుగుకి ఎవరెవరెళ్తున్నారు?" అంది. "అందరమూ వెళ్దామనుకుంటున్నామండీ. వీళ్ళు ముగ్గురూ అసలు చూడలేదుకదా" అన్నాడు సుందర్రావు.

"సరే, వెళ్ళండి గాని... ఆ..." అని మధ్యలో ఆగింది. ఏదో ఆలోచనలో పడింది.

"ఎవరి వ్యక్తిగత విషయాలూ మనకనవసరం. కాని అవి... ఆ విషయాలు... కౌన్సిల్‌కీ, కౌన్సిల్ చేసే పన్లకీ ఆటంకం అయ్యేట్టుంటే మాత్రం సహించేదిలేదు. అర్థమైందా? సుందర్రావుగారూ... ఆ పిల్ల విషయంలో మీరు సీరియస్‌గా వుండాలి. ముందు ముందు ఆ పిల్ల కౌన్సిల్‌కి పెద్ద తలనొప్పిగా మారేట్టుంది. మనం జాగ్రత్తపడాలి... గుర్తుంచుకోండి" అంది పంకజవల్లి చాలా స్పష్టంగా.

"అలాగేనండి. మొన్న వెళ్ళినప్పుడు కూడ నేను సీరియస్‌గా వున్నాను"

"మీరుండటం సరే... ఆ పిల్లకి తెలవాలి ఆ సీరియస్‌నెస్. తనకి తెలిసేలా మనం తెలపాలి... అదీ ముఖ్యం"

"అవునండీ..."

"ఊఁ... సరే! అసలా పిల్ల... సరే" అని అసంతృప్తిగా అశాంతిగా కదలి కేబిన్‌లోకి వెళ్ళింది పంకజవల్లి.

పరమేశం కిసుక్కున నవ్వాడు. అతని ముఖం బలవంతంగా చాలా పెద్ద నవ్వుని దాస్తున్నట్టు బిగదీసుకుని వుంది.

సుందర్రావు పరమేశం వంక చూస్తూ "వ్రోర్కేవయ్యా బాబూ... నువ్వొకడివి..." అంటున్నాడు.

అంతలోనే షఫీలోనికొచ్చి "జీప్ తయ్యార్ హై సాబ్" అన్నాడు.

"సుందర్రావుగారూ..." అని పిలుస్తూ పంకజవల్లి వచ్చి "సరే... ఇవ్వాళ నేనూ వస్తున్నాలెండి... చాలా రోజులైందిగదూ నేనొచ్చి" అంది.

"అయితే బైల్దేరదామా?" అన్నాడు సుందర్రావు.

"ఆ..."

అందరూ వెళ్ళి జీప్ ఎక్కి కూర్చున్నారు. జీప్ బైల్దేరింది.

పంకజవల్లికి అటు ఛాయ ఇటు సుజాత కూర్చున్నారు. ఇద్దరూ పంకజవల్లి గురించే ఆలోచిస్తున్నారు. భోజనం చేసేప్పుడు మీదేవూరు? అక్క చెల్లెళ్ళున్నారా? అన్నదమ్ములున్నారా? ఎవరెవరు ఎక్కడున్నారు? ఏం చేస్తున్నారు? --ఇలా ఎన్నో విషయాలడిగే పంకజవల్లి జీపులో ఒక్క పర్సనల్ విషయమూ అడగదేం అనుకుంటున్నారు.

పంకజవల్లి జీపులో కౌన్సిల్ పనిమీద వెళ్తోంది. పనిలో వున్నప్పుడు పర్సనల్ విషయాలు మాట్లాడదు. ఎవరన్నా మాట్లాడినా వూరుకోదు. సుందర్రావుకీ, పరమేశానికీ ఈ విషయం బాగానే తెలుసు. కాని మోహన్‌కీ, ఛాయ-- సుజాతలకీ తెలియదు. అందుకే మోహన్ అన్నాడు.

"చుట్టూ ఈ చెట్లూ, దూరంగా ఆ కొండలూ... చూట్టానికీ ప్రదేశం భలే గుందండీ" అని.

పంకజవల్లి అతని వంక చూసి అంది-- "ప్రకృతి సౌందర్యాన్నారాధించడానికో, కవిత్వాలు వల్లించడానికో, వివాహానికో కాదు మనం

వెళ్తున్నది. గుర్తుంచుకోండి మనం డ్యూటీ మీద ఉన్నాం. మనం కౌన్సిల్ పని మీద వెళ్తున్నాం. ఇలా వెళ్తున్నందుకు కౌన్సిల్ మనకి డబ్బిస్తోంది. ఆ డబ్బు తీసుకుంటున్నాం గనక కౌన్సిల్ గురించీ, దాని పని పద్ధతులు గురించీ, మనం వెళ్ళబోయే వూరు గురించీ, అక్కడి కేంద్రం గురించీ ఆలోచించండి. ప్రకృతి గురించి కావాలంటే ఏ ఆదివారమన్నా ప్రోగ్రాం వేసుకుని రండి. అప్పుడు మీరెన్ని కవితలు చదివినా వినడానికి సిద్ధంగా వుంటాం అందరమూ'' అంది.

వంకజవల్లి గొంతులో కాఠిన్యం లేదు. చెప్పే పద్ధతిలోనూలేదు. కాని... విషయం మాత్రం స్పష్టమయింది.

అప్పటివరకూ ఆమెని గూర్చే ఆలోచిస్తున్న ఛాయ, సుజాతలు బైటికి చూడటం కూడా మానేసి ఫైలుతెరచి చూడసాగారు.

"ఫైలు మూసెయ్యండి. జీపు అదురుకి ఏమీ కనవడదు. కేంద్రానికెళ్ళేసరికి తలనెప్పి వస్తుంది. సరిగ్గా పని చెయ్యలేరు."

ఫైల్సు వెంటనే మూసివేశారిద్దరూ.

ముగ్గురికీ ఏం చెయ్యాలో తోచడంలేదు.

అంతకుముందు పంకజవల్లి లేనప్పుడు జీపంతా కబుర్లతో, నవ్వుల్తో కళకళలాడింది. ప్రయాణం చేసినట్టే లేదు.

కాని ఇవ్వాళ ఆ పోతులమడుగు ఎంతకీరాదు.

"సుందర్రావుగారూ మొన్న వెళ్ళినప్పుడు ఏంగొడవల్లేవుగా" అంది పంకజవల్లి.

బతికాంరా భగవంతుడా అనుకున్నారంతా. ఏదో ఒకటి.... మాట్లాడ్తేగాని వూపిరందినట్టులేదు.

"మొన్నేంలేదండీ... కానీ ఆ .... కాంటీన్ ఎత్తించెయ్యాలండీ. అక్కణ్నుంచి అది పోతే సగం గొడవొదుల్తుంది..."

"సగం ఏంఖర్మ. పూర్తిగొడవ వదుల్తుంది... నేను కూడా సరిగ్గా అదే అనుకుంటున్నా. వూళ్లో పనిలేని ప్రతి అడ్డగాడిదా ఆ వసారాలోనే చేరడం... అయినా మనబంగారం మంచిదైతే... ఈ గొలేలేకపోను"

"పోనీ రమాదేవినన్నా హేమనన్నా ఇక్కడేసి ఈ విణ్ణి అక్కడెక్కడన్నా వేస్తే" అన్నాడు పరమేశం.

"ఆలోచించాలి. అవసరమైతే ఏదోటి చెయ్యాలి. ఇక లాభంలేదు" అంది వంకజవల్లి.

"వేళ్ళినచోట మళ్ళీ గొడవలవ్వవనేముంది" అన్నాడు సుందర్రావు.

"అదీ పాయింటే. ఇప్పుడైతే ఈ వక్కవూరే మనకి హెడేక్. అప్పుడు ప్రతివూరూ" అని ఆగింది పంకజవల్లి.

"అమ్మాయి మంచిదేనండీ" అన్నాడు సుందర్రావు.

"అటువంటి మాటలు నాకు పడవని మీకు తెలును. మంచంటే! ఈమంచి- చెడ్డ ఈ మాటలంత యూజ్‌లెస్‌వర్డ్స్ మరింకేమీ లేవు. అవి మన కనవసరం కూడ. కౌన్సిల్‌కి హెడేక్‌గా వుండే పిల్ల బంగారమైతే మాత్రం కౌన్సిల్‌కెందుకు?" కోపంగా అని చిరాగ్గా ముఖంపెట్టుకుని కూర్చుంది పంకజవల్లి.

మోహన్‌కి ఎప్పుడెప్పుడు ఆ పిల్లను చూద్దామా అని ఆతురతగా వుంది.

ఛాయ, సుజాతలు కూడా ఆపిల్ల కౌన్సిల్‌కెందుకు అంత హెడేక్‌గా వుందా అని ఆలోచనలో పడ్డారు. వీళ్ళ మాటల్ని బట్టి ఆ పిల్ల మంచిదేగాని ఏదోగొడవ... ఏమిటాగొడవ... చేస్తోందని... కేంద్రం పక్కనే కాంటీన్ వుంది. అక్కడ కొందరు మగవాళ్లుచేరి స్కూలుని సరిగ్గా నడవనివ్వడంలేదు... బహుశా...

వూళ్ళోకొచ్చేసింది జీపు. పిల్లలు వెంటబడ్డారు. వూరు పెద్దదే. పాడుగోడల గుడిసెలు. పాకలు. అక్కడక్కడ అసందర్భంగా మొలిచిన రాతి మిద్దెలు. సాయంత్రం అయిదు గంటలయింది. వలుచని సీరెండ వూరంతా పరుచుకుంటోంది.

అక్కడక్కడ వీధుల్లో అరుగులమీద కొంద రాడవాళ్లు కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. జీపుని చూడగానే వీళ్ళగురించే ఏదో మాట్లాడుకుంటున్నట్టుగా వున్నారు. చిన్నచిన్న పిల్లలు జీపుని చూసి తల్లుల్ని కావులించుకుంటున్నారు. ముందుకు వూగిపోతూ కొందరు పరుగెత్తుకొస్తున్నారు.




విశిష్ఠ సుగంధం
మైమరపించే తాజాదనం

క్రొత్త

ప్రేమ్

మీకోసమే




ఇప్పుడు అనువైన ఆకారంలో క్రొత్త పరిమళంతో వస్తోంది.

Imageads 2418 Tel

జీపు కేంద్రం దగ్గరకొచ్చి ఆగింది. జీపుమో తకి పిల్లలూ, ఇద్దరు తల్లులూ బైటికొచ్చారు.

జీపులోంచి దిగుతూనే ఆపిల్లకోసం అనుకో కుండానే మోహన్‌కళ్లు వెతికాయి.

ఛాయ, సుజాతలు కూడా ఆ పిల్లను చూడా లని త్వరపడ్తున్నారు.

"గుడ్‌విసింగమ్మ" అంటూ వచ్చింది ఓ పందొమ్మిదేళ్ళ పిల్ల. నల్లగా వుంది. యవ్వ నంలో వున్న అందరు ఆడపిల్లల్లాగే మంచి ఆకర్షణీయంగా వుంది.

చివరికి మోహన్‌బకూడా వంక చూసి 'గుడీ వినింగ్ సార్' అంది.

మోహన్ పెదాలు తడారిపోయినై.

పిల్ల మామూలుగానే వుంది. కళ్ళు చెదరగొ ట్టె అందమూ లేదు. కానీ ఏదో ఆకర్షణ. బహుశా ఆ చురుకుదనమా. పెద్దపెద్ద కళ్ళు. మాట్లాడేప్పుడు ఎదుటి వాళ్ళ గుండెల్ని తవ్వే ఆ చూపులు - మోహన్ గమనిస్తున్నాడు.

పంకజవల్లిగారి మాటలవల్ల ఆ పిల్లపేరు సబిత అని తెలిసింది.

కేంద్రానికి అనుకునే వున్న వసారనే కాంటీన్. దానిలో వూరికూర్రకారు చేరి ఈ మాతాశిశు సంక్షేమకేంద్రంలోకి సబిత కోసం చూపులు పరుస్తున్నట్టున్నారు.

ఆ చూపులకు సబిత ఏమన్నా ఉత్తేజాన్ని యిస్తోందా?

అదీ పంకజవల్లిగారి ప్రశ్న.

"నేనిక్కడ అడుగుతుంటే నువ్వక్కడ చూ స్తావేందుకు?" అంటోంది పంకజవల్లి.

"లేదమ్మా ... నువ్వడిగిందానికి జెప్దామని జూస్తున్న"

"అయిందానికీ కాందానికీ అట్లా నవ్వొద్దని చెప్పానా?"

"చెప్పావమ్మా" సబిత నవ్వడం లేదు. కనీసం ప్రయత్నపూర్వకంగా నవ్వకుండా ఉండటానికి చూస్తోంది. అయినా సబిత మొ ఖంలో నవ్వు విరబూస్తూనే వుంది. సబిత కనులు నవ్వుల గనులు.

"ఏంచెప్పాను"

"నవ్వొద్దని"

"నవ్వొద్దని చెప్పానా? ఏడవమని చెప్పానా! అయిందానికీ కానిదానికీ నవ్వొద్దని చెప్పాను. నీనవ్వే కౌన్సిల్‌కి పెద్ద సవాలయిపోయింది తెలుసా?"

"తెలుసమ్మా"

సబిత మాట్లాడిన నాలుగు మాటలకే సబిత చాలా అమాయకురాలు అనే విషయం తెలిసిపోతుంది.

"ఇదిగో సబితా ... ఈ కేంద్రం మొత్తం మన కౌన్సిల్‌కే పెద్ద ప్రెస్టైజ్ కొశ్చన్ అయిపో యింది. గుర్తుంచుకో ... మనం వరసగా కొన్ని గ్రామాలు చూసి సెలెక్టు చేసుకుని వాటిల్లో కేంద్రాలు పెడతాం. పెట్టాక వాటిని ఎత్తేయ్యా ల్సిన పరిస్థితి రాగూడదు. ఎందుకు ఎత్తేశామో లక్షాతొంబై నాలుగు కారణాలు చెప్పాలి హైద రాబాదుకీ, ఢిల్లీను. అందువల్ల ఈ కేంద్రం ఎత్తేయ్యాల్సిన పరిస్థితి ఎప్పుడూ తీసుకు రాకు. నీలో తప్పులేదు. నాకు తెలుసు. కాని నీవల్ల కౌన్సిల్‌కి బాడ్‌నేమ్ రాగూడదు గు ర్తుంచుకో".

"గుర్తుంచుకుంటానమ్మా"

"విను... ముందు నేను చెప్పేది విను. నువిక్కడెందుకున్నావు?"

"పాఠాలు జెప్పనీకి"

"ఎవరికి?"

"వూళ్లో పిల్లలుగన్న తల్లుల్కి"

"అదీ, అంతే... ఆ విషయంలో నీకవసర మైన సహాయమంతా మేమందరమూ అంది స్తాం. ఆ పని తప్ప నువ్వు మరొకటి చూడగూడ దు. అటూ ఇటూ చూసి నవ్వడం..."

"నవ్వను" అంటున్న సబిత ముఖం నవ్వు తూనే ఆ మాటన్నట్టుంది.

"నీవల్ల మన మొత్తం కౌన్సిల్‌కే చెడ్డపేరొ స్తుందనుకో. నీకు సంతోషమా?"

"కాదు"

"ఆ... అదీ. అందువల్ల నువ్వు సీరియస్‌గా వుండాలి. అర్థమైందా?"

"అర్థమైందమ్మా"

"ఊ మంచిది.. అందరూ వస్తున్నారా?"

"లే... రాటల్లేదమ్మా"

"ఎందుకు?"

"ఎందుకో? నేను పిలవటానికిపోతే అందరూ నన్ను దుష్మన్ లెక్క జూస్తున్నారమ్మా. ఈవూరి ఆడోళ్లందర్కి నేనంటే కోపమమ్మా మగాళ్లు మాత్రం మంచిగుంటరు"

"అదే వద్దన్నా. మన పనే ఆడాళ్లతో. నువ్వేమో ఆడాళ్లకి కోపం వచ్చేట్టు బిహేవ్ చేస్తున్నావు. మొగాళ్లెట్లా వున్నా మనకొకటే. వాళ్లతో అసలు మాట్లాడొద్దని చెప్పానా పోయిన్సారి వచ్చినప్పుడు"

"చెప్పినవమ్మా. నేను మాట్లాడక పోయినా అల్లే మాటా ముచ్చట పెట్టుకుంటరు"

పంకజవల్లి ముఖం కోపంతో వుబ్బరించింది. ఆమె కళ్లు ఎర్రగా మండుతున్నాయి.

"వాళ్లతో నీకేం పని" అరిచినంత పని చేసింది.

"నాకేంపన్లేదమ్మా. ఆడామెని పిల్వనీకి పోతే మగాయన బల్కుతాడు. నీ భార్యుందా అంటే ఉంది అంటడు. బిలు అంటే లోన్కిరా అంటడు. ఆమెనే బయటకు రమ్మంటా. ఆయన బిల్వడు. నేనిగ వస్తాంటే 'యిస్కూలికి నాభార్య రావాల్నా వద్దా' అంటడు. 'రావాలె' అంటే 'ఆమె రాకుంటే నేను రావాల్నా' అంటాడమ్మా. అమ్మా... ఈవూర్లె అందరు రవుడీలున్నరమ్మ. అందరికందరు నన్ను జూడగనె నగుకుంట దగ్గరకొస్తరు. నేను నగకపోయినా మాటాముచ్చట పెడ్తమని జూస్తరు. నేను మాట్లాడక పోయినాగని నా ఎంట తగుల్తరు. ఎట్లెట్లనో జూస్తరు. నేనేం చెయ్యాల్నమ్మా. ఎవరిళ్లకీ పోవ్వుడు బంద్ జేసిన్నమ్మా. ఎవరూ రావట్లేదమ్మా" సబిత కళ్లంట నీళ్లు కారుతున్నయ్.

సబిత పరిస్థితికి మోహన్, ఛాయ, సుజాతల మనసులు బరువెక్కాయి. ముగ్గురూ దీనంగా సబితనే చూస్తున్నారు.

పంకజవల్లి వెనగ్గావున్న పరమేశం మాత్రం సుందర్రావు వంక చూసి కళ్లెగరేసి నవ్వుతున్నాడు.

పంకజవల్లికేమనాలో తోచినట్టు లేదు. కొంచెం సేపు సబిత కేసే చూసింది. సబిత చెప్పేదానిలో కొంచెం కూడా కల్పన లేదనేది స్పష్టమే.

ఈ పరిస్థితి ఇలా తయారవ్వడానికి సబిత నిస్సహాయత, ఒక రకమైన తెలివితక్కువతనం, అమాయకత, యవ్వనం, బహుశా కళ్లూ, చూపులూ, నవ్వులూ కారణాలేమో.

"ఎవ్వరూ రావడం లేదా?"

"ఇద్దరు ముగ్గురొస్తున్రమ్మా"

తీవ్రంగా ఆలోచనల్లో పడింది పంకజవల్లి.

"నీకిక్కడ బాగా లేదా?" అంది.

"బాగానే వుందమ్మా. అల్లొస్తే పాఠాలు జెప్తం మంచిగ"

"వుద్యోగం మానేసి వెళ్లిపోతావా?"

"నేబోను" అని ఏడుపు మొదలెట్టింది.

"వూరుకో సబితా... ఏడవకు"

"సబితా వూరుకో" అన్నాడు సుందర్రావు కూడా.

"నన్ను బంపెయ్యకుర్రి సార్. నన్ను బంపొద్దమ్మా. ఈ కొల్వుల జేరనీకి మా నాయన ఇష్టపడకపోతే నేను పంచాయితి పెట్టుకొని వచ్చి జేరిన. వచ్చేప్పుడే జెప్పిండు నేను జచ్చిపోయిన్దానికిందే లెక్కని. మల్ల ఇంటికి రాకుమన్నాడు. నాకు అమ్మ లేదు. అన్నలు జంపుతమన్నారు. అయినాగాని వచ్చి దీన్ల జేరిన. గిప్పుడు నన్ను బొమ్మంటే యాడికి బోదు"

వెక్కివెక్కి ఏడుస్తోన్న సబితను చూస్తుంటే మోహన్ కళ్లు అప్రయత్నంగా తడి అయినాయి. ఛాయ, సుజాత ఇద్దరూ దీనంగా చూస్తుండిపోయారు. వాళ్ల కళ్లల్లో కూడా నీళ్లు.

పంకజవల్లి కాస్సేపలానే వుండి "ఏం చేద్దామంటారు?" అంది.

ఎవర్నీ వుద్దేశించకుండానే.

"ట్రాన్స్‌ఫర్" అన్నాడు పరమేశం.

"అక్కడ కూడా మగాళ్లుంటారు గదూ" అంది పంకజవల్లి. ఆ మాటలకేగాని తగిన శక్తి వుంటే వూళ్లల్లో వుండే ఈ రకపు మగాళ్లంతా మసి అయి వుండేవాళ్లు.

"ఏమండీ" అని మోహన్‌కేసి తలెగరే



సింది.... ''ఈ వూళ్లో పెద్దవాళ్లు వుంటారు గదా. వాళ్లని కలిసి పరిస్థితి వివరిస్తే'' అన్నాడు మోహన్.

పంకజవల్లి చురుగ్గా అతని వంక చూసింది. సంతోషంగా ''దేర్ యు ఆర్'' అంది.

''సుందర్రావుగారూ! మనకి తట్టనే లేదు. ఈ కేంద్రం పెట్టడానికొచ్చినప్పుడు మనం సర్పంచ్‌గార్ని కలిశాం. ఆయన మంచివాడిలానే వున్నాడు. పదండి... ఆయన్ని కలిసి మాట్లాడదాం'' అని లేచింది.

పంకజవల్లీ, అందరూ బైటకొచ్చారు సవిత కూడా.

''నువ్విక్కడే వుండు'' అంది పంకజవల్లి.

''మంచిదమ్మా'' ఆగింది సవిత.

వర్షం కురిసి వెలిసిన తర్వాత ఆకాశంలా నిర్మలంగా వున్నాయామె కళ్లు.

జీపులో అందరూ ఎక్కాక అందరివంకా నవ్వుతూ చూసింది.

'భలే చిత్రమైన పిల్ల' అనుకున్నాడు మోహన్ ఆమె కళ్లవంక మరొక్కసారి చూస్తూ.

జీపు సర్పంచ్ వెంకటరెడ్డి ఇంటి ముందు ఆగింది.

డ్రైవర్ వెళ్లి కనుక్కొచ్చాడు.

"రెడ్డిసాబ్ ఇంట్లో లేడంట"

"ఎక్కడికెళ్ళాడో కనుక్కురా"

వెళ్ళి మళ్ళీ వచ్చాడు. "పొలానికెళ్లిండు"

"ఆయన పొలం ఎక్కడో..." అని ఆలోచన లోపడ్తుండగానే ఇంట్లోంచి వాళ్ళ పిల్లాడు పన్నెండేళ్ళ వాను వచ్చాడు.

"బాబూ... మీనాన్నగారి దగ్గరకు మీ పొలానికి తీసుకెళ్తావా మమ్మల్ని?"

"జీపులో వెళ్దాంరా"

కుర్రాడు పరుగెత్తుకొచ్చి జీపులో కూచున్నాడు ముందుసీటులో.

చేలల్లోంచి అందరూ ఇళ్ళకొచ్చేస్తున్నారు. రెడ్డిగారు పొలంలోంచి గట్టెక్కి నడుస్తూ కనబడ్డారు.

జీపు రోడ్డుమీద ఆగడం చూసి ఇటుకేసి వచ్చాడు.

"నమస్కారం సార్... బాగున్నారా?" అంది పంకజవల్లి.

"ఆ... మంచిగున్నమమ్మ. మీరంతా మంచిగున్నరా?" అని కుశల ప్రశ్నలు వేశాడాయన.

వీళ్ళంతా జీపు దిగారు.

అందర్నీ పరిచయం చేసింది పంకజవల్లి.

"ఆఁ... వీళ్ళిద్దరూ నాకెరికేనాయె. వీళ్ళు ముగ్గురు కొత్తోల్లెక్కొడుతుర్రు".

"అవున్సార్... మీతో పనుండి వచ్చాం"

"ఆ... చెప్పుర్రి, మా బాయిదిక్కుగూ నుందాం రాంర్డి ఈడేనాయే" అనుకుంటూ పొలంలో బావి దగ్గరకు తీసుకెళ్ళాడు.

అందరూ బావి గట్టున చెట్టుకింద కూర్చున్నారు.

"మీరంతా ఏడినుంచో ఈడిదంక వచ్చి మా ఆడోల్లకింత అచ్చరంముక్క దానం జేస్తుర్రంటే అది మావూరి అదృష్టం. మీకేం గావాలన్నా జెప్పుర్రి... నా శాతనైనంతా సాయం చేస్తా" అన్నాడు.

పంకజవల్లి ముఖాన ఇంత నవ్వు మొలిచింది.

"మాదేముందండీ... పని చేసినందుకు మా అందరికీ ఎంతోకొంత జీతం వస్తోంది. ఏ జీతానికీ ఆశించకుండా మీబోటి పెద్దలు చేస్తారు ఏమి చేసినా...."

"అహ్హహ్హ..." అని బావి ప్రతిధ్వనించేట్టూ, పొలాలన్నీ మారుమోగేట్టూ దిక్కులు పిక్కటిల్లేట్టూ ఓ నవ్వు నవ్వాడు వెంకటరెడ్డి.

పంకజవల్లితోసహా అందరూ నిరుత్తరులైపోయారు.

నవ్వు తగ్గాక- "ఏమనుకోకుర్రి, ఏదైనా పట్టగల్గుతగని నవ్వును పట్టుడు నాశాతగాదు" అన్నాడు.

మొహమాటపు నవ్వు నవ్వింది పంకజవల్లి.

"విషయమేమంటే మీకు తెలిసే వుండొచ్చు..."

"ఏందది?"

"అదే మీవూర్లో వున్న స్కూలుకి ఆడవాళ్ళు రావటం లేదు. మేము మీ అందరితో మాట్లాడాకే ఈ సెంటరు సెలెక్టు చేసిపెట్టాం. మొదట్లో బాగానే వచ్చారు అరవైదెబ్బై మందివరకూ. కాని ఈమధ్య దాదాపు ఎవరూ రావటం లేదు. ఈ విషయంలో మీతో మాట్లాడాకే ఏం చేయాలో నిర్ణయించాలనుకున్నాం. కేంద్రాన్ని ఎత్తెయ్యాలా అని ఆలోచించాల్సి వస్తోంది.... మీరేమన్నా సలహా చెప్తారా? ఏమన్నా సహాయపడతారా?" నెమ్మదిగా ఆగింది.

"ఆఁ... " అని దీర్ఘం తీసి ఆలోచనలోపడి "అవ్ నేను భీ యిన్న. జర్ర అక్కడో ముక్క ఇక్కడో ముక్క నాచెవిలోపడింది. చేలల్లో పన్లు చేయనీకొస్తరు గదా. అల్లనుకుంటుంటే యిన్న. ఏందంటే... జూడుండ్రి మీరంతా బస్తీవోల్లు. నేనన్నా ఎప్పుడన్నా పాలమూరెల్త. వస్త... హైద్రాబాద్గూడ నాలుగు సుట్లెల్లి వచ్చిన. ఎల్ల లేదన్నట్టు గాదు. కాని వూర్లల్ల అందరైతే ఎల్లరుగదా. ఈల్లకి ఆ బాయిలో

కప్పు లెక్క ఈ ఊర్లో బుట్టుడు ఈ ఊర్లనే జచ్చుడు... అంతా వూర్లనే. అందరికందరు జంగ్లిగాల్లు. అయినగాని ఆల్లది తప్పని చెప్ప లేమనుకోర్రి. ఇగ ఆల్లు గూడా ఏమనుగుంటు ర్రంటే! ఆ... మీ పంతులమ్మ... మంచిదిగా దని గాదుగాని... అందర్కి జూసి నవ్వు తుందంట... జనం అనుకోంగ యిన్న సంగతే. ఆమెని నేనయితే ఒక్కమారు గూడ జూల్లే. ఇగ ఈల్లేమనుకుంటుర్రుగదాంటే తమ భార్యలు గూడ ఇగ ఆమె లెక్క గినవుతరా ఏందని పరేశాన్ పడింర్రు. వూర్లల్ల యిసుమంటియ్ జర్ర ఎక్కువే... మీకు తెల్సు... గందుగూర్చే ఆడోల్లను ఆ యిస్కూలుకి బంపుడు బంద్ జేసిర్నో యేందో. మల్లి అర్సుకుందాం. గని... మీరు గూడ జర... ఆమెతో జెప్పుర్రి''

"అదే అదే... ఆ విషయంలోనే మీ సహా యంగావాలని...''

"ఏంది జెప్పుర్రి?''

"మా టీచరు సబిత మంచిపిల్లే. కాకపోతే కాస్త అమాయకురాలు. ఇంతకు ముందే ఆమెతో మాట్లాడాం. మగాళ్లు తనని సతాయి స్తున్నారని'' ఆమె అంటోంది.

"అదేమల్ల ఆమె ఒక్కామెనే ఎందుకు సతాయిస్తుర్రు. గది మనం సోంచాయించాలె''

"ఆమె కంటికి కాస్త నదురుగా కన్ప డ్తుంది... యవ్వనంలో వుంది. అమాయకురా ల్లా వుంది'' అన్నాడు సుందర్రావు.

"ఆ... అదీ! మల్లవూర్ల యవ్వనంలో వున్న ఆడపిల్లలే లేరంటుర్రా మీరు. ఆమెకన్నా మాగనం అందమైన పిల్లలే వున్రుగాని మీకె ర్కలే''

"అవున్సార్... వాళ్ళంతా బైటికిరారుగదా. పదిమందితో మాట్లాడేపని వుండదు''

"ఆ... గద్గదీ ముచ్చట! పదిమందితోని పనున్నప్పుడు జర్ర తెలివితోని వుండాలె. ఆమె కాసంగతి మంచిగ జెప్పుర్రి''

"చెప్తాం సార్... మీరు కాస్త మగవాళ్ళతో...''

"ఆ... నేన్జెప్తా''

"అక్కడ... ఆ స్కూలు దగ్గర కేంటీన్ తీయించేయ్యాలిసార్! అప్పుడుగాని అసలుగొ డవలేకుండా పోదు''

"ఆ కేంటీన్ మన ఎగస్పార్టీవాల్లు పెట్టిర్రు. గావాల్నంటే యిస్కూల్ మరోచోట బెట్టుక్ నాలె...''

"పోనీ అదైనా ఫర్వాలేదు సార్''

"అది జూజ్దాం గని మీరు ఆమెకి జర్ర...''

"మేం చాలా సీరియస్‌గా చెప్తాం సార్...''

"ఆ గదీ''

"ఇళ్ళకి వెళ్ళి చెప్దామంటారా లేక...''

"చెప్తాం... ఏముంది మంచిగ అందరిల్లకి పోయి చెప్దం. నేను కూడ వస్త. రేపొస్తారా మీరు?''

"మీర్రమ్మంటే రేపొస్తాం''

"రాంర్రి... రేపో ఎల్లుండో ఒక్కటి రొండ్రోజు లురండి. అందరిల్లకుపోయి చెప్దం గాని మీ రు ఈ వూర్లెకెల్లి కేంద్రం దియ్యొద్దు. గిట్ల గీ సర్పంచ్ వుండగ గూడ వూర్లె కేంద్రం మూ సిర్రు అంటరు. మన్కి ప్రిస్టేజ్ పోతది''

"అవున్సార్... తీసే సమస్యే లేదు''

"మరి వెళ్తాం సార్'' అని లేచారు. రెడ్డిగారినీ చిన్నరెడ్డిగార్నీ వాళ్ళింట్లోదించి కేంద్రానికొచ్చేటప్పటికి కేంద్రం ముందు అటూఇటూ పచార్లు చేస్తున్న ఇద్దరు కుర్ర కుంకల్ని చూసింది పంకజవల్లి. కోపంగా లోప లికి వెళ్ళే సరికి సబిత అదృష్టవంతురాలు. ఎవరో ఓ తల్లి తీసుకొచ్చిన చిన్నకుర్రాడి కాలికే దో మందేసి కట్టుకడుతోంది.

ఏమాటకామాటే చెప్పుకోవాలంటే సబిత ఆ కుర్రాడికి ఎంత శ్రద్ధగా కట్టు కడుతోందంటే పనిలో లీనమైపోయి జీపు మోతగానీ, వీళ్ళు రావడంగానీ గమనించనేలేదు.

పంకజవల్లి అలా సబితని చూశాక మరేం మాట్లాడలేక పోయింది.

చాలా తక్కువమంది తల్లులే వున్నారు. వాళ్ళు కూడా గోళీలో, మందులో కావాలని వచ్చినవాళ్ళు.

వాళ్ళని పంపాక మరొకసారి సబిత ఎటు వంటి పరిస్థితుల్లోనూ నవ్వగూడదనీ, ఈసారి నవ్వినట్టు తెలిస్తే వుద్యోగం వూడబీకుతామనీ- ఇలా రకరకాల వార్నింగులు ఇచ్చింది పంకజ

వల్లి.

అన్నిటికీ 'మంచిదమ్మా', 'గట్లనేనమ్మా' అంటూ తలూపింది సబిత.

"గుడ్ నైటమ్మా"

"గుడ్ నైట్సార్"

అని అందరికీ గుడ్‌నైటులు చెబుతోంది సబిత. 'నవ్వుతూ వీడ్కోలివ్వడం కూడా నేర మేనా?'

జీపు బైల్దేరాక...

"వెంకటరెడ్డిగారు..." అని తలూపి "హీ ఈజ్ ఎ జెంటిల్‌మేన్" అంది వంకజవల్లి.

"అవునండీ" అన్నారు సుందర్రావు, పర మేశంలు.

"మోహన్ మాత్రం వెంకటరెడ్డిమీద సదభి ప్రాయంతో లేడు. వెంకటరెడ్డి మనసులో ఏదో వుందని అతను అనుమానిస్తున్నాడు.

గత పది పన్నెండు సంవత్సరాలుగా ఈ వూరికీ, పక్కూరికీ కూడా వెంకటరెడ్డే సర్పంచట. ఇవ్వాల్టి రాజకీయాల్లో అంతకాలం నెగ్గుకొస్తున్నాడంటే అతని శీలాన్ని శంకించ కుండా వుండగలమా? అనుకుంటున్నాడు మోహన్.

సబిత గుర్తొచ్చింది.

కొందరాడపిల్లలుంటారు. ఏతప్పూ చేయ కుండానే చాలా శిక్షలు అనుభవించవల్సి వుంటుంది. సబిత అంతే అనుకున్నాడు మోహన్.




జీపు పట్నం చేరేసరికి దగ్గరదగ్గర పదిగావ స్తోంది.

వంకజవల్లినీ, ఛాయనీ, సుజాతనీ వాళ్ళ ఇళ్ళ దగ్గర దింపేసి సుందర్రావు, పరమేశం, మోహన్ ఆఫీసుకొచ్చారు. జీపు షెడ్డులోపల పెట్టాక సుందర్రావు అన్నాడు- "మోహన్... మెస్‌కి పోయి భోంచేసి గూళ్ళకి చేరుకుంటే బాగుంటుంది కదూ" అని.

"అబ్బబ్బ... వళ్ళంతా జిడ్డుగా వుందండీ! రూంకిపోయి స్నానంచేసి బట్టలు మార్చు కుంటేగాని భోజనం చెయ్యలేమనిపిస్తోంది" అన్నాడు మోహన్.

"నేను పోతున్నా" అని వెళ్ళిపోయాడు పరమేశం.

"ఆకలి దంచుతోందోయ్"

"అయితే మీరు భోజనానికి వెళ్ళండి, రమ ణమ్మగారితో చెప్పండి, నేనూ వస్తున్నానని"

"ఓకే"

మోహన్ రూంకెళ్ళి మెస్ కొచ్చేసరికి రమ ణమ్మగారు వాకిట్లో కుర్చీలు వేసి ఓ దానిలో తనూ కూర్చుని వుంది. మోహన్‌ని చూడగానే- "రాబాబూ! నీ కోసమే చూస్తున్నా" అంటూ లేచింది.

"అందరూ అయిపోయారా?" అన్నాడు మోహన్.

"ఇప్పటివరకూనా.... తొమ్మిదీ తొమ్మిదిన్నరక ల్లా అందరూ వెళ్ళిపోతారు. నువ్వు, సుందర్రా వుగారూ రోజూ ఏ పదింటికో...." అని "ఇవ్వాళ ఆయనగారు కూడా భోంచేసి వెళ్ళిపోయారు" అంది.

"నాకు వళ్ళంతా చిరాగ్గా వుంటేనూ..." అని ఆగాడు మోహన్.

"కాదుమరీ, రోజూ తిరుగుడేనాయె. కష్టమే రోజూ తిరుగుతోంటే" అంటూ మోహన్ లోనికి రాబోతుంటే "లేవద్దులే నాయనా, అక్కడే కూర్చో. నువ్వు ఒక్కడివేగదా తీసుకొచ్చి అక్కడే పెడతాను. బైట వెన్నెల బాగుందిగదూ" అంది.

"బతుకుజీవుడా అనుకున్నాడు మోహన్ బైట చక్కని చల్లని వెన్నెల. కుర్చీలో కూర్చుంటే దగ్గర్లోనే వున్న రేరాణి పువ్వుల ఘుమఘుమల్తో హాయిగా వుంది వాతావరణం.

అక్కడే కూర్చొని భోంచేశాడు. అంతా

# అందం – ఆరోగ్యం

## JEEVANTONE

బల హీనమైన కణాలకు మంచి రక్త ప్రసరణను అందజేస్తుంది. ఇదికాక ఆరోగ్యాన్ని, బలాన్ని కండరాలకు దారుఢ్యాన్ని ప్రసాదిస్తుంది.



ఒక సీసా తాగింతర్వాత
ఇంకా ఎన్ని సీసాలు తాగాలో
మీరే నిర్ణయిం చేసుకోగలరు

ఆరోగ్యంగా లేకపోతే
రోగాలపాలవుతారు

మంచి ఆరోగ్యం, బలం, శక్తి
పుష్టిగా కండరాలు పొందిన తర్వాత
ఈ మందును ఆపివేయడం మంచిది

'' MFG. LICENEENO. AUS 59/75''

Contact our new sole Distributors

**M/S. New Shakti Pharma,**
No. XXV/475, Havanapet,
Adoni-518 301,
Kurnool Dist., A.P.
**Phone: 2866**




450 Grams Rs. 40/-



వి.పి.పి
కొరకు

జీవన్‌టోన్ ప్రొడక్ట్స్
పి.బి.నం. 880 17/2
కేంబ్రిడ్జి రోడ్
బెంగుళూర్-580 008

SINDU

అయ్యాక "మీరు భోంచేశారా?" అన్నాడు.

"లేదయ్యా... ఇప్పుడు నేను తింటాను" అంది.

" అయితే మీరు కూడా ఇందాకే తెచ్చుకుంటే బాగుండేదిగదా. నాగ్గుర్తేలేదు ఆకలి మీదున్నాను" అన్నాడు.

"భలేవాడివే..." అంది నవ్వుతూ.

"ఇప్పుడైనా తెచ్చుకోండి. మీ భోజనం అయ్యే వరకూ నేనూ వుంటాను" అన్నాడు.

"నీకెందుకులే నాయనా శ్రమ" అంది.

"శ్రమేముంది! వూరికే కూర్చోడానికి... పనమ్మాయుందా?"

"లేదు... లక్ష్మి పనయిపోయింది. అది కాస్త తిని, కాస్త పట్టుకుని వెళ్ళిపోయింది. నీకూ, నాకూ తీసి పక్కనపెట్టి అన్ని అంట్లూ అవీ కడిగేసుక్కూర్చున్నాం" అంది.

"మరింకే. మీరూ తెచ్చుకోండి. ఇక్కడ పూలూ, వెన్నెలా నన్ను కదల్నిచ్చేలా లేవు" అన్నాడు.

"అలా చెప్పు..." అని నవ్వుతూ లోనికెళ్ళి తనూ అన్నం పెట్టుకుని తెచ్చుకుంది.

"ఈవారం పదిరోజుల్లోనే మోహన్ అంటే రమణమ్మగారికీ, రమణమ్మగారంటే మోహన్‌కీ పరస్పరం ఒకరిపై ఒకరికి అభిమానాలు పెరిగాయి.

"ఇవ్వాళ మీ ,టూర్ విశేషాలేమిటి?" అని అడిగింది రమణమ్మగారు.

"చెప్తానుగాని.... మీ విషయాలసలేమీ చెప్పలేదు నాకు" అన్నాడు మోహన్.

"నువ్వడిగావా?" అంది నవ్వుతూ.

"ఇప్పుడడుగుతున్నాగదా"

"అయితే చెప్తున్నాగదా" అని మొదలుపెట్టి తన సంగతులు చెప్పుకొచ్చింది. రమణమ్మ బియస్సీ చదివిందని తెలియగానే నివ్వెరపోయాడు మోహన్.

రమణమ్మ చౌదరిని ప్రేమించింది. సనాతనమైనవాళ్ళింట్లో వాళ్ళకిష్టం లేకపోతే ఇంట్లోంచి ఎవరికీ చెప్పకుండా వెళ్ళిపోయి అతన్తో వుండిపోయింది.

ఆశ్చర్యపోయాడు మోహన్.

ఎంతో ప్రేమగా జీవితం గడుపుతుండగా చౌదరికి యాక్సిడెంటు అయింది. తను వంటరిదైపోయింది. తననెవరూ కనీసం కన్నెత్తి చూసిన పాపాన, పన్నెత్తి పలకరించిన పాపాన పోనప్పుడు... తనేం చెయ్యాలో దిక్కుతోచని స్థితిలో ఈ ఆలోచన వచ్చింది. ఉన్న వూరొదిలి ఇక్కడికొచ్చి ఈ మెస్ పెట్టింది... అవన్నీ రమణమ్మగారు నెమ్మదిగా చెప్తోంటే వింటున్న మోహన్ "రమణమ్మగారూ, మీరూ..." అని ఆరాధనగా ఆగిపోయాడు.

"ఏమిటో... నా బాధలన్నీ చెప్పి నిన్ను భయపెట్టినట్టున్నాను. నువ్వసలే పిచ్చిపిల్లడివి" అని లేచి లోనికెళ్ళింది. చేతులు తుడుచుకుంటూ వచ్చి, "ఇప్పుడు చెప్పు... ఇవ్వాల్టి మీ టూర్ విషయాలు" అంది.

"మీరిన్ని కష్టాలుపడి ఎవరి విషయాలో చెబుతున్నట్టు ఎలా వుండగల్గుతున్నారు?" అన్నాడు మోహన్.

"చౌదరీ, నేనూ కలసి జీవితాంతమూ కల్సి బతుకుదామనుకున్నాం. అతని బతుకలా అయిపోయింది. నేనిలా మిగిలిపోయాను. ఇదే జీవితం అంటే అన్పించింది. అతనికోసం నేనూ, నాకోసం అతనూ ఎన్ని సమస్యల్నెదుర్కున్నాం? ఎంత తపించిపోయాం. ఎందర్ని ఎదిరించాం... బాధించాం.... అన్నీ అయ్యాక మా జీవితాలిలా! జీవితంలో ఏది శాశ్వతం? కష్టాలా... కన్నీళ్ళా... నవ్వులా... ఆనందాలా... ధనమా.. ఏదీ కాదు జీవితం అశాశ్వతం.... చంచలం. ఏరోజూ ఈరోజు లాటిది కాదు. దీనికోసం దిగులుపడటం అనవసరం. నా దిగులూ బాధ, జ్ఞాపకాలు అన్నీ చౌదరి. మిగిలిన దేనికీ నన్ను బాధించగల శక్తి లేదు..." అని ఆగిపోయింది రమణమ్మగారు.

రోజూ అందరికీ అన్నంపెట్టే రమణమ్మగారేనా ఈమె?

"ఈ వెన్నెలా, ఈ రేరాణి పరిమళంతో నిండిన ఈ రాత్రి రమణమ్మ ఓ దేవతలా మారి తనకివన్నీ చెప్తోందా?

"మీ టూర్ సంగతులు చెప్పు నాయనా?"

"ఏమున్నాయ్...!" అని సవిత గురించి

చెప్పాడు మోహన్.

"అయ్యో... పిచ్చిపిల్ల! ఆ పిల్ల గురించి కాస్త నువ్వు శ్రద్ధతీసుకో బాబూ ఎప్పుడైనా సరే, తనకి అవసరమనుకుంటే ఇక్కడికి తీసుకురా" అంది రమణమ్మగారు.

'కష్టాలు తెలిసినవారు... తెలిసి నిలదొక్కుకు నిలబడ్డవారు... ఎవరైనా కష్టపడుతుంటే ఆదుకోవాలని చూస్తారేమో' అనుకున్నాడు మోహన్.

★ ★ ★

"శాంతమ్మ సావుబత్కుల్లుంది సార్" అంది రమాదేవి.

"శాంతమ్మా?" అన్నాడు మోహన్.

"అవ్‌సార్!" అంది రమాదేవి.

"నేనప్పుడే అనుకున్నాలే. ఆవిడెక్కువరోజులు బతకదని" అన్నాడు సుందర్రావు.

"ఎందుకని?" అన్నాడు మోహన్

అతనికి శాంతమ్మ ముఖం బాగా గుర్తుంది— రక్తంలేక తెల్లగా పాలిపోయిన మొహంతో కట్టెలు మోసుకెళ్తున్న బాలింత.

"పెయ్యంత నెప్పిలేస్తుంది. గోలీలిస్తనంటేనే వస్త" అని కండిషన్ పెడ్తున్న శాంతమ్మ.

"కట్టెలుగూడ యిప్పియ్యి గోలీల్లెక్క. నీ యిన్కాలు బర్లకొచ్చి పాఠాలు సదుకుంట మంచిగ" అంటున్న శాంతమ్మ గుర్తొచ్చింది.

"ఎందుకనేమిటి? నేను డాక్టర్నిగద. అందుకని!" అన్నాడు నవ్వుతూ సుందర్రావు.

శాంతమ్మ చనిపోబోతోందనేమాట వినికూడా మామూలుగా నవ్వగల్గుతున్న సుందర్రావు వంక ఆశ్చర్యంగా చూస్తూ-

"మరి ముందే తెలిస్తే తగినజాగ్రత్త ఎందుకు తీసుకోలేదు?" అన్నాడు మోహన్. అతని కంఠంలో కాస్తంత అసహనం చోటుచేసుకుంది. "ఏం జాగ్రత్త తీసుకోమంటావు మోహన్? ఆవిడ బాలింత... అవునా. నీకు తెలియదుగాని నాకిక్కడవాళ్లంతా తెలుసుగదా! శాంతమ్మ గర్భవతిగా వున్నప్పుడే నెత్తిన్నోరు పెట్టుకుని మొత్తుకున్నా! నామొర వినేవాడెవడు. అమ్మా... నువ్వు పోషకాహారం తీసుకోవాలి అని ఎన్నిసార్లు చెప్పానో. నేనెన్నిసార్లు చెప్తే అన్నిసార్లూ ఆవిడ ఒకటేమాట చెప్పింది. ఏమిటో తెలుసా— కడుపునిండా తాగనీకి అంబలన్నాలేదు. అన్నం యేడికెల్లొస్తది అని. నేననేది అన్నంతోపాటు గుడ్లూ, పాలూ, పళ్లూ కూడా తీసుకోవాలని!

ఆవిడ అంబలికూడా కడుపునిండా తాగలేని పరిస్థితిలోవుంది. గర్భవతిగా వున్నప్పుడు మంచిఆహారం లేకపోతే పుట్టేబిడ్డ బలహీనంగా పుట్టడమేగాక రోగనిరోధకశక్తి తక్కువగా వుంటుంది. అందువల్ల పుట్టినప్పట్నుంచీ బిడ్డకి రోగాలు. దానికితోడు తల్లికి సరైన ఆహారం వుండకపోవడంమూలాన పాలుపడవు. బిడ్డకి తల్లిపాలుకూడా దొరకవు.

ప్రసవమప్పుడే శాంతమ్మ పోతుందనుకున్నా కాని గండం గడిచి పిండం బైటపడ్డట్టు నానాయాతనాపడి ప్రసవించింది. బాలింత కడుపుకైనా సరైన పోషకాహారం వుందా? లేదు. మళ్లీ చాలీచాలని అంబలి. ఆ అంబలికూడా రెండుపూటలా దొరకదు. దొరికినప్పుడుకూడా కడుపునిండా దొరకదు... పస్తులు. పైనుంచి అడవికి నడిచివెళ్ళి నడిచిరావడం. మధ్యలో నాలుగు చినుకులురాలి ఈవిణ్ని తడవడం. రోగనిరోధకశక్తిలేదు. రోగాల నిలయం ఆ శరీరం. బీకాంప్లెక్స్ లోపంవల్ల చెలోసిస్ సోకింది. స్పృహతప్పిపోయుంటుంది. అవునా?" అని రమాదేవినడిగాడు సుంద్రరావు.

"అవున్సార్! మూడుదినాల్నుంచి స్పృహవస్తది, పోతది" అంది రమాదేవి.

"అంతే! ఇకా ప్రాణంపోవడమే ఆ శరీరానికి విముక్తి. పోషకాహార లోపం...." అంటూ సుందర్రావు తన మాట లెక్కచెయ్యకపోవడంమూలాన్నే శాంతమ్మకీగతి పట్టిందని తేల్చేశాడు.

"సుందర్రావుగారూ... మీరెంతచెప్పినా మీ మాట శాంతమ్మ వినలేదనేగాని పోషకాహారం తీసుకోగలశక్తి వాళ్లకుందో లేదో అనేది ఆలోచించరేం?" అన్నాడు మోహన్.

"మోహన్! నేను డాక్టర్ని. రోగికి ఏ ఆహారం అవసరమో నేను చెప్పగలను. అంతేగానీ వాళ్ల పరిస్థితులు గమనించి ఏంచెయ్యాలని

నీవుద్దేశం?'' అన్నాడు కోపంగా సుందర్రావు.

"అదికాదండీ! మీరు చెప్పారు నిజమే. పోషకాహారం తీసుకోవాలని. కాని ఆవిడ తీసు కునే పరిస్థితిలోలేదు"

"లేకపోతే ఇదిగో... ఇలాగే అవుతుంది"

"మనం ఏమీచెయ్యలేమా? ఈ పరిస్థితి మార్చ లేమా?" తనలో తను అనుకుంటున్నట్టుగా అన్నాడు మోహన్.

"అది మన పనికాదు" అన్నాడు సుంద ర్రావు దురుసుగా.

"మరెవరిపని?"

"అది ప్రభుత్వం పని"

"ఒక డాక్టర్‌గా మీరు ప్రభుత్వానికి ఈ విషయం తెలపలేదా?"

"అది నాపనికాదు"

"మీ కళ్లముందు ఒక మనిషి..." అంటున్న






మోహన్ మాటలు పూర్తికాకుండానే,

"అహ్హహ్హ....." అని పెద్దగా నవ్వాడు సుందర్రావు.

"ఏమిటి?" నివ్వెరపోయాడు మోహన్.

మోహన్‌కి మొన్న తాను చూసిన శాంతమ్మ తిండిలేక శవమైపోవడం తలుచుకుంటూంటే మనసంతా బాధతో, సిగ్గుతో నిండిపోతోంది. సుందర్రావు నవ్వు అతనికి చాలా ఆశ్చర్యాన్ని కలగచేసింది.

"ఒక మనిషేమిటయ్యా బాబూ! ఏవూరెళ్తే ఆవూళ్లో లెక్కకుమించి పోషకాహారలోపంవల్ల రకరకాల జబ్బుల్తో నిండివున్న మనుషులు కనవడ్తారు. నువ్వు ఇవ్వాళే ఒక వూరెళ్లొచ్చి ఆవూళ్లో ఒక మనిషిని చూసి 'అయ్యో' అని ఏడుపుముఖంపెట్టావు. నేను రోజూ చూస్తూనే వుంటాను. శాంతమ్మ ఒక్కావిడేమిటి? ఎన్ని వందలమంది స్త్రీలు గర్భవతులుగా, బాలింతలుగా తీసుకోవల్సిన ఆహారం తీసుకోక రోగాల్తో నిండి చచ్చిపోతున్నారో. ఎంతమంది పసిగుడ్డులు వారం, పదిరోజులు, పదిహేనురోజులు, నెలతిరక్కుండా పాలులేక రోగాల్తో చచ్చిపోతున్నారో. అవన్నీ నాకు తెలుసుకాబట్టే శాంతమ్మని చూసి నీలాగా నేను కన్నీళ్లు కార్చలేను. ఒక్కరో నలుగురో అయితే అది వేరేమాట! వందలకి వందల స్త్రీలు, పిల్లలు, వృద్ధులు మరణిస్తున్నారు... ఇంకా మరణిస్తారు. వాళ్లందరికీ కావల్సింది పోషకాహారం. అది దొరకడం ఈదేశంలో అంత సులభంకాదు. గవర్నమెంటుకీసంగతి తెలియదనుకోకు. తెలియకపోతే ఓట్లకోసం వచ్చిన ప్రతిసారీ మీకు కాల్వలు తెప్పిస్తాం, మీకు ప్రాజెక్టులు కట్టిస్తాం, మీ పొలాలన్నీ సాగుచేసుకునేలా అభివృద్ధి కార్యకలాపాలు మొదలెట్టబోతున్నాం అని అన్నివాగ్దానాలెందుకు కురిపిస్తారు? అందువల్ల గీతలో చెప్పినట్టు 'నువ్వు చెయ్యవల్సింది నువ్వు చెయ్యి— ఫలితం గురించి ఆలోచించకు, నీపనేమిటి? ఆడవాళ్లకి, ముఖ్యంగా తల్లులకి నాలుగక్షరం ముక్కలు నేర్పడం. నీపని నువ్వు చూసుకో'

సుందర్రావు ఇంకా చాలా చెప్పాడు.

కాని మోహన్‌కి మెదడు పనిచెయ్యడంలేదు. వందలకొలదీ స్త్రీలూ పిల్లలూ ఆహారంలేక అకాలమృత్యువుపాలవుతున్నారా? శాంతమ్మ చచ్చిపోతోందంటే సానుభూతి చూపించేంత తీరికకూడా వీళ్లకిలేదా?

"రమాదేవిగారూ! ఓసారి శాంతమ్మని చూసొద్దామా" అన్నాడు మోహన్.

"ఇల్లుదగ్గరేసార్! ఇంకెవరూ రాలేదుగదా! పోదాం" అంది రమాదేవి.

మోహన్‌ని బాధపెట్టడం ఇష్టంలేదేమో సుందర్రావుకూడా పదండని బైల్దేరాడు.

సుందర్రావు, మోహన్, రమాదేవి శాంతమ్మ ఇంటికి రావడంచూసి ఆ ఇంటిచుట్టుపక్కలున్నవాళ్లుకూడా వీరితోపాటు శాంతమ్మ ఇంటికొచ్చారు.

శాంతమ్మ ఇంటిముందు కట్టెలపొయ్యి మండుతోంది. పొయ్యిమీద కుండలో నీళ్లు మరగబెడ్తోంది అయిలవ్వ. శాంతమ్మకి అత్తమ్మ.

వీళ్లనిచూసి లేచింది అయిలవ్వ.

"సిన్న సిన్న పోరలు. పోరలందర్కి ఏంజేసిపోతదో మాశాంతమ్మ. శాంతమ్మా... శాంతమ్మా... నీగురించెవలెవలొచ్చిర్రో ఒక్కసారి కన్నుతెరిచి చూడవ్వా! బిడ్డే శాంతమ్మా!" అంది కన్నీళ్లు తుడుచుకుంటూ.

శాంతమ్మ స్పృహలోలేదు. నేలమీద పరిచివున్న చిరుగుల చాపమీద పడివుంది ఇరవై సంవత్సరాలు కూడా దాటని శాంతమ్మ. నాలుగురోజులకే అలా అయిన ఆమెని చూస్తోంటే కళ్లనీళ్లు తిరిగాయి మోహన్‌కి.

సుందర్రావు శాంతమ్మ నాడిచూశాడు. సుందర్రావువంక అందరూ చూస్తున్నారు. పెదవి విరిచిలేచి నిలబడ్డాడు సుందర్రావు.

ఆయనేమీ మాట్లాడకపోవడం చూసి "ఏంసారూ... ఏం చెప్పకపోతివి?" అన్నాడు శాంతమ్మ మామ ఈరేశం.

"ఏంజెప్పాలయ్యా! మళ్లీ స్పృహరాదు! అర్థమయిందా? పిల్లడెక్కడ?" అన్నాడు సుందర్రావు.

"ఏమంటాండు?" అన్నారు ఒకరిద్దరు.

వారికి చెప్తున్నారు వేరేవాళ్లు "బతకదంటుండు"

"ఆ... అది బత్కుతదనుకున్నామా?"

"అదే. అది పోరన్ని కనకండనే పోవాల్సిన మాట"

"అప్పుడైతేమైంది. ఇప్పుడైతేమైంది"

"ఇంక పోరదేడున్నడుసార్! ఆ పోరడూ నిన్న పొద్మూకేపాయె!

"నిన్నేపోయాడా?"

"అవ్మల్ల! ఆనికి నూకలేడున్నయ్ ఈడ!"

"ఆ పోరడు పోతడని ఆడుపుట్టకముందే గుర్తు తియ్"

"అంతే అంతే! అంశలున్నంతయితది"

"శాంతమ్మ భర్తేడి?" అన్నాడు మోహన్. "ఆయన కూలికి పోయిండు. ఇంక రాలే"

"అరే... పెళ్లాం చస్తాందంటే..."

"చస్తే? చచ్చేవాల్లతోని బతికినోల్లని చంపుతాడా? పెల్లాం చస్తదని కూలికెళ్లకుంటే యింటెల్లపాది ఏంతాగి బత్కాలే"

"అరే, నీ అన్నాలంపాడుగాను. ఏంరోజులొచ్చినయ్‌ర దేవుడా!"

"ఆ దేవుడు. ఆ దేవుడేవుంటే ఈ గరీబోల్లందర్నీ ఇట్టచంపుతాడా?"

"ఆ మంచిగ... దేవుడు గరీబోల్లనే సంపుతాడు. దొరలకిట్టాంటి సావొస్తదా ఒక్కనాడన్న! ఆల్లకొచ్చే రోగాలన్ని తిండెక్కువయిన రోగాలయ్యె"

"వెళ్దామా?" అన్నాడు సుందర్రావు.

శాంతమ్మనాస్థితిలో వుంచి ఎవరికి వాళ్లు తమకవసరంలేనట్టు వెళ్ళిపోవడాన్ని చూసిన మోహన్‌కి ఊపిరాడలేదు.

ఏమిటీ జీవితం?

★ ★ ★

మోహన్ ఆ వచ్చిన మనిషి వంక తేరిపార చూశాడు. పంచెకట్టుకుని పైన చొక్కా వేసుకుని వున్నాడు. కోరమీసాలు. కళ్ళు తీక్షణంగా వున్నాయి. ముఖంలో పట్టుదల...

"నేను రాంచెంద్రారెడ్డి అన్నను" అన్నాడు వచ్చిన మనిషి.

'రాంచెంద్రారెడ్డెవరు?' పైకి అనకుండా ఆలోచనలోపడ్డాడు మోహన్.

"నేను వోదునా సార్" అన్నాడు పోచయ్య. కౌన్సిల్‌లో వాచ్‌మెన్

"ఒక్క నిముషం..." అని వచ్చినతన్ని కూర్చోమని బైటికెళ్ళాడు మోహన్.

పోచయ్య చెప్పాడు. "పోతులమడుక్కెల్లి వచ్చిండట. ఎట్లనన్న ఆఫీసోల్లని గలవాల్నంటే నీ ఇల్లుజర్ర దగ్గరుందని ఈడికి దెచ్చిన. నన్ను గూసోమంటే గూసుంట"

"ఫర్వాలేదులే, నువ్వెళ్ళు"అని లోపలికొచ్చాడు మోహన్.

ముళ్ళమీద కూచున్నట్టు ఇబ్బందివడ్తున్నాడు రాంచెంద్రారెడ్డి అన్న.

"మీ పేరు?"

"నా పేరేందైతే ఏంగాని... కిష్ణారెడ్డి"

"క్రిష్ణారెడ్డిగారూ... మీరేం పనిమీద వచ్చారు? పగలయినట్టయితే ఆఫీసులో..." "మరేం జెయ్యాలె. మా బతుకులిట్ల జేసిర్రు. అద్దమ రాత్తిరి అందరిల్లనుట్టూ తిరిగేట్టు జేసిర్రు."

"ఎవరు... అసలేమిటి విషయం?"

"ఎవరేంది? మీరు... మీరే"

"ఏమయింది.?"

"ఆ మనిషిని మా వుల్లెఎందుకు వెట్టింర్రు? ఎన్ని కొంపలు ముంచనీకి. తీసెయ్యండి వూళ్లెకెళ్ళి"

"అసలేమయింది?"

"నీతోనయితుందా? మేమే..."

"అదిగాదండీ... అసలేమయిందని"

"ఏం గావాలె! ఆ మనిషి దిక్కెల్లి యియ్యాల మా అన్నదమ్ముల ఏర్లు బడ్డం! ఎరికైందా? ఏర్లు బడ్డాం. మా నాయన గుండెపగిలి జస్తున్నాడు. మా అమ్మ... బాయిలపడింది. నా బిడ్డకి పెల్లయితందా. చిన్నాయన యిట్ట జేసిండంటే. నాకు ముగ్గురు చెల్లెండ్లు. అందరు అత్తమ్మోళ్ళిళ్లకెల్లి వురికొస్తరిగ! నా కుటింబం కుటింబం సత్తెనాష్ అయిందిగదా. పరువు మర్యాద మంటగల్సినయ్"

"ఏమయిందండీ?"

"ఇంకేం గావాలె? ఆ మనిషి మావోనిమీద మందు జల్లింది. వచ్చి మావోని కమ్మల్లదూరింది. ఎంతమంది పిల్చినా రాదు. మా ఆడోల్లు లోనికెల్లకుంట మా తమ్ముడు అడ్డం పడ్డాడు. మేమెల్లాలంటే పంచాయితు. మూడ్డి

నాల్సంది అది ఆ కమ్రల్లనే తీసుడు. నా తమ్ముని వక్క మంచిగ పండుడు. ఇయ్యాల పొద్దాకి మావోన్ని బిల్చి యిది సంసార్లయిల్లేనా అన్నా. నీక్కష్టమైతే నా భాగం నాకు బంచు. నేను-- ఆమె పెండ్లి చేసుకుంటున్నాం అన్నాడు. ఇంతన్నాలవా పయి? బజారుమనిషిని తెచ్చి మీరు వూల్లెబెట్టుడు. దాన్నిదెచ్చి మావోడు యింట్లబెట్టుడు. అదేమంటే పెళ్ళాడుతానంటడు. ఎన్ని మాల్రాత్తాడు పెళ్ళి. మల్ల ముందుగాల పెళ్ళాడిన దాన్నేం జేస్తడు. అదే అడిగిన. నేనూ-- ఆమె పెండ్లాడెడ్డి పెండ్లాడెడ్డే. ఇష్టమున్నోల్లు వుండుండ్రి. కష్టమయినోల్లు పోండ్రి అంటాడా ఆడు? నా యెన్కబుట్టి ఇంత పెద్దగెప్పుడైండు. ఎంత బుదగరిచ్చినం. ఎన్నడూ లేంది నాయన కల్లనీళ్ళొట్టుకున్నాడు. పేరు పెట్టుకున్నందుకైనా రాంచెంద్రారెడ్డీ ఈ పని చెయ్యకు మన్నాడు. మా ఏడుపులు. మా మొత్తుకోల్లు మాయెగాని ఆనికి చీమగుట్టలే''

కృష్ణారెడ్డి చాలా కష్టంలో వున్నాడు. చాలా బాధపడుతున్నాడు. చిన్నప్పట్నుంచి నమ్మిన నీతి నట్టింట్లో నాశనమవుతోంటే అర్థంకాక సతమత మవుతున్నాడు.

''అసలు వాళ్ళిద్దరికీ ఎప్పుడు కలిసింది?''

''ఎవనిగ్గుర్తు''

''మీ తమ్ముడి భార్య... అదే మీ మరదలు ఇంట్లలేదా?''

''ఏడ... సంసారానికే రాలే. పెళ్ళయి ఆర్నెల్లేనాయె. పిల్ల చిన్నది. అల్లూకుంటరా? అల్లు మా లెక్కగాదు. మావోని కాల్లు చేతులు చూర చూర జేస్తరు ఎరికైందంటే. మీ ఆ మనిషినైతే నర్కి పోగులువెత్తారు. ఏమనుకుంటుర్రో. ఇంగ అల్లదంక పోలె ఇసయం. బిడ్డనిచ్చినోళ్ళు ఊకుంటరా?'' అని కాస్తాగ,

''ఏదో పోరడు పోరిని జూసి ఆశ పడిండు. అంతే పర్వాలేదుగాని... దాన్తోని ఏడనన్నా నాలుగు సార్లువో... నీ తిప్పలు నువ్వుడు. ఎవలన్నా ఏమన్నా అంటరా? చూసి చూడనట్టూకుంటం. తెలిసినా తెలియనట్టు గమ్మునుంటం. అరే... నీ అన్నెలం పాడుగాను. పెళ్ళిజేసుకున్న పెళ్ళాం యింకా పెద్దమనిషికాలె. గప్పుడే నువ్వు రెండో పెళ్ళిజేసుకుంటావ్. అదిగూడ ఎవర్ని... బజారు ముండని. ఆ యిస్కూలు దగ్గర పెద్ద దుకనమే నడుపుతుండే. వూల్లె మగాల్లంతా దానివక్క బండినోల్లేనాయె. దాన్ని తీస్కవచ్చి వచ్చుని సంసారాల్లో నిప్పులు పోస్తావా? అరె... ఎన్నిజెప్పినం. దాన్నింట్లకెల్లిబంపి నీయిష్టమొచ్చినట్టు దాన్తోబండుకో మన్నాం. అహా... వినడు. ఎందుకో గుర్తా... అది ఆనికి మందు పెట్టింది. దాన్ని జంపితేగాని మావోడికి బుద్ధిరాదు''

''మేం రేపుదయం వస్తాం. మీరేం చెయ్యకండి... ఈ రాత్రికెలానో గడవనివ్వండి.

''తెల్లారేసరికి రావాలె''

''వస్తాం''

''మీరెట్లనైనా జెయ్యండ్రి. ఆ మనిషినాడికెల్లి లేపెయ్యాలె'' అంటూ వెళ్ళిపోయాడు కృష్ణారెడ్డి.

మోహన్ మనసు గంద్రగోళంతో నిండిపోయింది.

సబితా! సబితా! అనుకున్నాడు.

సబిత మంచి పిల్లలానే వుంది. ఎందుకిట్లా చేస్తుంది?

''నీకు తెల్వదు సార్... ఈ వూళ్లె అందరు రౌడీలు సార్'' అందొక రోజు.

వచ్చేప్పుడు పరమేశం అంటున్నాడు, ''ఈ వక్కవూళ్ళోనే రౌడీ లెందుకున్నారు?''

''ఈ వూళ్ళో సబిత వున్నందుకేనేమో!'' అన్నాడు సుందర్రావు.

''సుంద్రర్రావుగారూ... ఒక రెస్పాన్సిబుల్ పొజిషన్‌లో వుండి మీరు అలా మాట్లాడవచ్చా?'' అన్నాడు మోహన్.

''నేనేమన్నానయ్యా బాబూ! సబిత వచ్చేకే ఈ వూళ్లో కుర్రకారంతా రౌడీలయ్యారని ఆ సర్పంచ్ స్వయంగా నాతో చెప్పాడు'' అన్నాడు సుందర్రావు. ''అవ్వక చస్తారండీ! అవసరమైనా కాకున్నా కులుకులొలికిస్తుంది. ఆ కులుకు చూసే ప్రతివాడికీ ఆశపుడ్తుంది. పైగా పనీపాటు లేనివాళ్ళు... పైసా ఖర్చుకాకుండా సరదాగా కాలక్షేపం అవుతుంది. ఎవడు మాత్రం కేంటీన్‌కి రాకుండ వుంటాడు. వీళ్లందర్ని చూసే రైతు వీరులందరికీ వాళ్ల పెళ్లాల పాతివ్రత్యాల్ని పంతులమ్మ ఏ పాఠాలుచెప్పి సడలి

స్తుందోనని భయంతో హడలిచచ్చారు. ఈ విషయాలన్నీ మనకు తెలుసు. అయినా ఆవి ణ్నే పట్టుకుని వేలాడుతున్నాం. అంటే కేంద్రా న్ని ముయ్యడానికి తప్ప మరొకందుకుగాదు'' అన్నాడు పరమేశం.

''మీరు చాలా అన్యాయంగా మాట్లాడుతు న్నారు'' అన్నాడు మోహన్.

''నేను మాట్లాడేదేమీ లేదు బాబూ! అదీవు న్న విషయం... జరుగుతున్న విషయమూను'' అన్నాడు పరమేశం.

''మీరు నమ్ముతారా సబిత అలాటి మని షని?'' అడిగాడు మోహన్.

''సబిత శీలం కోల్పోయిందా, లేదా? సబిత ఎవరితోనన్నా పోతోందా లేదా ఇది నాకనవ సరం. మీ అందరూ అనుకునేట్టే ఆమె పవి త్రురాలే అని నమ్మడానికి నాకేం అభ్యంతరం లేదు''

కాని ప్రతివాడికీ సబిత మీద ఆశపుడు తుంది. పుడుతుందా లేదా... ఇదీ తేలాల్సిన విషయం. కేవలం ఆవిడ అందం గురించి కాదు... నిజమే. మనిషి కారునలుపయినా యమ ఆకర్షణుంది! పెద్దపెద్ద కళ్లూ... ప్రతివా డినీ పిలుస్తూన్నట్టుండే చూపులు... ఇంతే.. ఆ కులుకు'' అన్నాడు పరమేశం.

''అబ్బ అబ్బ! ఆపండి పరమేశంగారూ... మరీ అన్యాయంగా...''

''ఏమిటన్యాయం? నేను చెప్పినవాటిల్లో ఏదబద్ధం? ప్రతి మగాడి గుండెల్లోనూ నొప్పె ట్టుంది... అవునా కాదా?''

''ఆమాట నిజమే'' అన్నాడు సుందర్రావు.

''మనమీ విషయాన్ని ఇలాగాక మరొకవైపు నుంచి ఆలోచిద్దాం'' అన్నాడు మోహన్.

''అలా అన్నావు బాగుంది''

''ఆ అమ్మాయికి తెలుసా? తనిలా వుండ టంవల్ల జనం ఇలా అర్థంచేసుకుంటున్నా రని''

''బహుశా తెలవదు''

''చెప్తే...?''

''ఎవరు చెప్తారు. చెప్పవల్సిందేదో చెప్పవ ల్సిన పద్ధతిలో మేడంగారు చెప్తూనే వున్నారు''

''అది కాదులెండి... మనకికూడా ఆ పిల్ల అలా నవ్వుతూ, కులుకుతూ మనతో మన లడం బాగుంది'' అన్నాడు మోహన్.

ఇద్దరూ మాట్లాడలేదు. ''మన కేంద్రం ఎదుర్కొంటున్న సమస్యకి పరిష్కారం ఆ పిల్ల ప్రవర్తన సరిచెయ్యడం... పంకజవల్లిగారుత ప్ప మనం ఎవరమూ సిన్సియర్‌గా సబితని మార్చడానికి ప్రయత్నించడంలా. ఒప్పు కోండి''

వాళ్లు మాట్లాడలేదు. కాని ముఖాలు చిట్లించారు.

''ఎందుకనంటే ఆ పిల్ల చిన్నదీ... పిచ్చిదీ. మనతో సార్ సార్ అని నవ్వుతూ రాసుకుపూ సుకు తిరుగుతుంది. అది మనకు ఎంతో కొంత సంతోషంగా వుంది''

''బహుశా నువ్వలాగే అనుకుంటున్నావను కుంటాను... నాకు పనుంది...'' అని లేవబో యిన సుందర్రావుని ''కూర్చోండి, వెళ్దాం'' అని లాగబోయాడు పరమేశం.

''కాదులే. ఇవ్వాళ మా అమ్మాయి వస్తోంది. బస్టాండుకెళ్తా'' అని లేచి వెళ్ళిపోయే సుంద ర్రావుతోపాటు లేస్తూ, ''నమ్మత్సరాల తరబడి సంసారాలు చేస్తూన్నాం. ఆడదాని ముఖం తెలవనివాళ్లంకాదు లేవయ్యా! కుర్రాడివి... నువ్వనేవన్నీ నీ అనుభవాలేననుకుంటున్నా నేనయితే'' అంటూ వెళ్ళిపోయాడు.

ఆరోజు నుంచి వాళ్ళిద్దరూ తననికాస్త వేరుగా చూడ్డం గమనించాడు మోహన్. వాళ్లు తనని వేరుగా చూడటం... నిజానికి తను వాళ్లకి దూరంగా వుండవల్సినవాడు . ఎందు కిలా జరుగుతోంది. మూర్ఖులో హీనులో అయి వుండికూడా వాళ్లు వాళ్ల పద్ధతిలో ఖచ్చితంగా వుంటున్నారు.

మనమే... ఇలా తగలడుతున్నాం.

ఒకరోజు పంకజవల్లితో కూడా సబిత విషయం మాట్లాడాడు మోహన్. ఛాయ-- సుజా తలుకూడా వున్నారక్కడ.

పంకజవల్లి తన అభిప్రాయం చెప్పి ''స బిత నవ్వు మనకింత సమస్య అవ్వగూడదు. కాని విషయం అదిగాదు. ఆ అమ్మాయి ఎంత నవ్వినా ఎలా నవ్వినా మనకనవసరమే... క్లాసు లు సరిగ్గా నడిస్తే. క్లాసులు నడవకపోవడం

మూలానే ఇవన్నీ ఆలోచించాల్సొస్తోంది.

క్లాసులకెందుకు రారు?

మగాళ్లొద్దంటున్నారు.

ఎందుకంటున్నారు?

తమ భార్యల్ని చెడగొడ్తుందేమోనని!

సబిత మంచిపిల్లేనని మనకు తెలుసు. కాని రైతులు, గ్రామస్తులు నమ్మడంలా.

ఈ నైతిక ప్రవర్తనకి వూళ్లల్లో ఇచ్చినంత విలువ పట్నాల్లో వుండదు.

అసలిది నైతిక సమస్య కూడా కాదు. ప్రవర్తన... అదీ తెలిసీతెలియని ప్రవర్తనవల్ల... ఎందరో ఎందుకూ...

"సబిత తన తల్లిదండ్రుల్తోనో, లేదా పెళ్ళయివుండి భర్తతోనో అక్కడుండివుంటే ఈ సమస్య ఇంత తీవ్రంగా వుండేదికాదు. అవునా?"

అందరూ ఆలోచనల్లోపడ్డారు.

"అమ్మాయిలూ... మీరయినా గుర్తుంచుకోవాల్సిందేమిటంటే... మగవాళ్లతో మరీ అంత సోషల్‌గా కూడా తిరక్కూడదు. అది చూసిఎవరో ఏదో అనుకోవడం, అనడం సంగతలావుంచి ఆ మగాడే తనకోసం వీళ్లంతా ఎగబడుతున్నారనుకుంటాడు. ఒక్కోసారి వినేవాడుంటే ప్రచారం కూడా చేస్తాడు"

ఛాయ-- సుజాతలిద్దరూ నవ్వారు.

"నిజమే మేడం" అన్నాడు మోహన్.

"వీళ్లనాల్సిన మాట మీరంటున్నారు" అంది పంకజవల్లి.

"వాళ్లకి తెలుసోతెలవదో నాకు తెలియదు గాని... మీరన్నట్టు సబిత గురించి మన కొలీగ్సే అనుకోవడం నాకు తెలుసు" అన్నాడు.

"అవును. ఆ విషయం నాకు తెలును" అంది మోహన్ వంక సునిశితంగా చూస్తూ.

కొంచెంసేపాగి, "మోహన్... ఎలాగైనా ఆ సబితనో దారికి తేవాలి. చూడండి... ఇటువంటప్పుడు ఒక్కొక్కసారి ఫిజికల్ ఎటాక్స్ కూడా జరుగుతాయి. నాకది భయంగా వుంటుంది" అంది పంకజవల్లి.

ఛాయ-- సుజాతలిద్దరూ మేడంవంక నిర్ఘాంతపోయి చూశారు.

మోహన్‌కి ఈ విషయం ఇప్పుడే తెల్సినట్ట స్పించింది. 'నిజం' అనుకున్నాడు.

కాని ....

ఇప్పుడు ?

ఏంచెయ్యాలి ? లేచి అటూఇటూ పచార్లు చేశాడు. టైంచూస్తే పదకొండున్నర! అందరూ సగం సగం నిద్దర్లలో వున్న ఈ రాత్రి తన కొక్కడికే ఎందుకీ అవస్త అనుకున్నాడు.

కాని తన కొక్కడికేకాదు.

ఈ ఒక్క విషయమే తీసుకున్నా సబితకీ, రాంచెంద్రారెడ్డికీ, క్రిష్ణారెడ్డికీ వాళ్లమ్మనాన్నలకీ, ఇంట్లో వాళ్లందరికీ కూడా నిద్రలుండవు. రకరకాలుగా అందరూ అశాంతి పాలవుతూనే వుంటారు.

ఇదంత ఒక్క సబిత మూలాన్నేనా? ఆ సబిత నవ్వులూ... కులుకులూ.... మగవాళ్ళ గుండెల్లో నిప్పుపెడతాయి...

ఛీ ఛీ... తనుకూడా ఎంత నీచంగా ఆలోచిస్తాడు.

అయినా రాంచెంద్రారెడ్డి ప్రోద్బలం లేకుండా సబితేం చెయ్యగల్గుతుంది. రాంచెంద్రారెడ్డిని ఎవరూ ఏమీ అనరు. ఎవరిదాకానో ఎందుకు అతనివల్లనే ఇదంత అని యిప్పటివరకూ తనే అనుకోలేదు. పెళ్లయిన రాంచెంద్రారెడ్డి దగ్గరకెందుకెళ్ళిందీ పిచ్చిది? అసలు వీళ్లకెలా పరిచయం కల్గింది? ఆ కేంటీన్ రవుడీల్లో రాంచెంద్రారెడ్డి కూడా ఒకడా?

సమయం చూసి సబితని మాయ చేశాడా? మభ్యపెట్టాడా? ఆశపెట్టాడా?

అతని సంగతులవతలఉంచినా.

సబిత ఏమిటి?

సబిత ఎందుకిలా చేసింది.

ప్రేమా?

దీన్ని ప్రేమనుకోవచ్చా? అసలు ప్రేమంటే ఏమిటి?

మోహన్ పెదవుల మీదికి లీలగా నవ్వొకటి వచ్చింది.

ఎక్కడో అరుస్తున్న కుక్కల అరుపులూ... రోడ్డుమీద నుంచీ వెళ్తున్న మోటార్ వాహనాల మోతలూ... పక్కింటాయన ఫుల్ వాల్యూంలో

పెడుతున్న గురక....

అటూఇటూ తిరుగుతూ ఆగుతున్న మోహన్‌కి అసలు ప్రేమంటే ఏమిటీ? అనే సమస్యతో నిద్రరావడంలేదు.

ఛాయ గుర్తొచ్చింది.

ఛాయ ఎంత చక్కగా వుంటుందీ. ఆమె కళ్ళు, ముక్కు, చెక్కిళ్ళు.... ముఖ్యంగా ఆ చిన్ని నోరు.... అరవిరిసిన పూలలాంటి ఆ పెదవులు.... ఛాయ నవ్వుతోంటే భలే బాగుంటుంది! తనంటే ఆమెక్కూడా ఏదో యింటరెస్టున్నట్లే వుంది అనుకోగానే మోహన్‌కి కొన్త శ్వాస భారంగా తోచింది.

కొంపదీసి తనామెను ప్రేమించడంలేదు గదా! ప్రేమిస్తున్నట్లేవున్నాడు. లేకపోతే ఆవిణ్ని పదేపదే చూడాలని.... ఆవిడతో ప్రతివిషయమూ షేర్‌చేసుకోవాలని, ఆవిడ సాన్నిధ్యా



న్ని కోరుకోవడం— ఇవన్నీ దేనిని తెలుపుతాయి....

ఇంత వరకూ అసలీ విషయమే తట్టలేదే!

అవును... ఛాయా, తనూ పెళ్ళిచేసుకోవచ్చు! ఇద్దరూ పోస్ట్‌గ్రాడ్యుయేట్స్. ఇద్దరికీ ఉద్యోగాలున్నాయి. ఇది అ్రీయిపోయాక కూడా ఎక్కడోచోట దొరుకుతాయి. తనుకూడా సోషల్‌గా వుంటుంది. బాగా మాట్లాడ్తుంది. మంచి మనిషిలాగే వుంది.

ఇంకేం కావాలి!

పన్నెండవుతుండగా గబగబా పేంటూ, షర్టూ వేసుకుని మోహన్ ఛాయవుండే ఇంటికి బైల్దేరాడు.

ఇప్పుడెళ్తే ఏమీ అనుకోదు గదా! ఏముంది అనుకోడానికి? సబిత విషయం మాట్లాడాలిగా! అందుకైతే పంకజవల్లిగారి దగ్గరకెళ్తే బాగుంటుందేమో!

నరే... ఛాయని చూసి మాట్లాడాలి.

అదీ అసలు సంగతి.

పన్నెండుగంటల ఈ అర్థరాత్రి ఛాయని అర్జంటుగా చూడాలన్పించింది. పాతికేళ్ళ మోహన్‌కి. దానిలో తప్పేం వుంది.

కాని ఈ అర్ధరాత్రి వచ్చినందుకు అన్యథా భావించవద్దనీ, అపార్థం చేసుకోవద్దనీ ఛాయతో చెప్పాలని ఎన్ని ఎక్స్‌ప్లనేషన్స్ ఇవ్వాలనుకున్నాడంటే అలా అర్ధరాత్రి ఛాయఇంటికి వెళ్లడం తప్పని మోహనే అనుకున్నాడు.

అయినా వెళ్లకుండా వుండలేకపోయాడు.

"ఛాయగారూ" అని మోహన్ పిలవగానే లోన్నుంచి "ఎవరూ?" అంది సుజాత!

"నేను... మోహన్ని"

బైట లైటువేసి తలుపుతీసి— "రండి... ఇప్పుడొచ్చారేమిటి?" అంది సుజాత!

"మీరు నిద్రపోలేదా?" అన్నాడు మోహన్.

"లేదండీ... ఇప్పటిదాకా చదువుతూ పడుకున్నా! అది పూర్తయ్యేసరికి నిద్ర మాయమయ్యింది. మీకు తెలపందేముంది. చదివితే నిద్రలా పడుతుంది?" అందీ నవ్వుతూ సుజాత!

ముందు గదిలో నాలుగు కుర్చీలువేసి వున్నాయి. వాటిమీద కూర్చున్నారు ఇద్దరూ!

మోహన్ సుజాత మొహంలోకి చూశాడు. సుజాత కళ్ళు వింతకాంతితో మెరుస్తున్నాయి. సుజాతనిలా తనెప్పుడూ చూడలేదు.

సుజాత కూడా ఇంత అందంగా వుందేమిటి? అనుకున్నాడు మోహన్.

అర్ధరాత్రుళ్ళు అమ్మాయిలందరూ అమృతాలు తాగి దేవతల్లా వుంటారా ఏమిటి అనుకుని ఆ ఆలోచనకి నవ్వుకున్నాడు.

"ఈవేళప్పుడూ...." అంది సుజాత.

"ఆ... అర్జంటుగా మీతో మాట్లాడాలని...."

"నాతోనా?..."

"ఆ... మీతోనూ... మీ ఇద్దరితోనూ. ఛాయగారు..."

"నిద్ర. ఆవిడ తొమ్మిదిన్నరకల్లా నిద్రాదేవితో చెలిమిచేస్తుంది. ఇప్పుడు లేపినా లేవదు. లేచినా లేచినట్లు తనకి తెలియదు. తనేం మాట్లాడుతుందో తనకే తెలియదు. అయినా లేపుతాను...." అని రెండో రూంలోకెళ్ళింది. ఓ అయిదు నిముషాలు ఛాయతో కుస్తీ పట్టింది.

సుజాత ఛాయని లేపి కూర్చోబెట్టడం. ఛాయ కూర్చున్నదల్లా పడిపోవడం చివరికెలాగైతేనేం కూర్చోపెట్టిన ఛాయను నుంచోపెట్టింది సుజాత. "మోహన్‌గారొచ్చారు! మోహన్‌గారు..." చెవుల్లో అరిచింది.

సుజాతతోపాటు ముందు గదిలోకొచ్చింది ఛాయ!

ఛాయ నైటీలో వుంది. అలానే వచ్చి మోహన్‌కెదురుగా కుర్చీలో కూర్చుంది! నిద్రాభారంతో నిండిన కళ్ళు బలవంతంగా లేపి "ఏమిటిప్పుడొచ్చారు?" అంది!

"నైటీలో ఛాయ" అనే టైటిల్‌తో ఓ కవిత రాస్తే ఎలా వుంటుందనే ఆలోచనలో పడ్డాడు మోహన్. అతనింతవరకూ కైతలరాణి చెయ్యి పట్టుకోలేదు. కాని ఛాయ సహాయంతో ఆ పని కాస్తా చేద్దామా అన్పించింది. ఈ ఆలోచనలో వున్న మోహన్ ఛాయ మూడోసారి అదే ప్రశ్నని మొదటిసారెలా అడిగిందో అలానే అడుగుతున్నప్పుడు 'ఆ...' అని తేరుకున్నాడు.

సుజాత వాళ్ళిద్దర్నీ ఆ స్థితిలో చూసి నవ్వా

పుకుంటూ-- "ఛాయనరే, నిద్రలో వుంది. మీకే మయింది. మీకూ నిద్రొస్తోందా?" అంది.

"నిద్రా పాడా... ఈ రాత్రి నిద్రపడితే అదృష్టమే" అని అసలుసంగతి మొదలుపెట్టాడు. సబిత విషయం, తనఫీలింగ్సూ. రాంచెంద్రారెడ్డికి ముందే పెళ్లయిందనీ, క్రిష్ణారెడ్డివాళ్ళు సబితని వదిలినా రాంచెంద్రారెడ్డి మామావాళ్ళు సబితని చంపుతారనీ.... వరసగా చెప్పుకొచ్చాడు.

ఛాయ సగంసగం విని "ఆ సబితని చంపేస్తే పీడా వదుల్తుంది. నేను పోతున్నా. నిద్ర...." అని లేచి వెళ్ళిపోయింది.

ఛాయ వెళ్ళిన వైపే చూస్తూ చిన్నగా నవ్వింది సుజాత.

ఛాయ అలా వెళ్ళిపోతుందనుకోని మోహన్ అలానే చూస్తుండిపోయాడు.

"రేపుదయం మనిద్దరం కల్సి చెప్పి కూడా నమ్మించలేం ఛాయని...." అంది మోహన్ ఆశ్చర్యాన్ని గమనించిన సుజాత.

"ఏమిటి?"

"మీరిలా వచ్చారనీ.... తనులేచివచ్చి కూర్చుని వెళ్ళిపోయిందని. ఇదేమీ తనకి తెలియదు... నిద్రలోనే వుంది" అని నవ్వింది సుజాత.

"ఆశ్చర్యమే" అన్నాడు మోహన్ ఇంకా ఆశ్చర్యంగా.

"అదృష్టం అనండి" అంది సుజాత.

"ఎందుకు?"

"ఎందుకేమిటి? అలా వళ్ళుమరిచి నిద్రోవడం ఎంత మందికి సాధ్యం?"

"అదీ నిజమేలెండి...."

"మరిప్పుడేం చేద్దామంటారు?" అంది సుజాత విషయంలోకి వస్తూ.

"మీయిద్దరితో మాట్లాడి అవసరమనుకుంటే పంకజవల్లిగారింటికెళ్దాం అనుకున్నాను. తెల్లారేసరికన్నా మనం ఆ పోతులమడుగు వెళ్లగలిగితే బాగుంటుందని...." ఆగాడు మోహన్.

"అవును... ఏదోఒకటి చేసి ఆ సబితను ఆ బురదనించి ఇవతలపడెయ్యాలి"

"తను రానంటే?"

"అనదు"

"తనంతటతాను... అతని దగ్గరకెళ్ళింది. బహుశా అతన్ని ప్రేమించానంటుందేమో కూడా!"

"అనొచ్చు... ప్రేమించివుండొచ్చు కూడా!"

"దాన్ని మీరు ప్రేమంటారా?" అన్నాడు ఆశ్చర్యంగా మోహన్.

మోహన్ వంక నిశితంగా చూస్తూ-- "మీరు దేన్ని ప్రేమంటారు?" అంది సుజాత.

"ఆ...?"

"అర్థంగాలేదా? ప్రేమ అని మీరు దేనిని అంటారు, అంటున్నాను"

"అంటే సబిత వ్యవహారాన్ని ప్రేమని మీరు వప్పుకుంటున్నారు... అవునా?" అన్నాడు మోహన్.

"అసలు గొడవెక్కడొస్తోందంటే మనకనవసరమైన విషయం మీద కూడా మన అభిప్రాయం చెప్పాల్సొందనుకోవడం వలన"

"సబిత అతన్ని ప్రేమించానను కుంటుంది... ప్రేమించానంటుంది. మనం ఏమంటాం? ఇది ప్రేమగాదు. దీనిని ప్రేమ అనరు అని. సబితకు సంబంధించినంతవరకు అదే ప్రేమ. చెప్పాలంటే అదే నిజంకూడాను. వాళ్లది ప్రేమో కాదో నిర్ణయించడానికి మనమెవరం"?

అసలు ప్రేమంటే ఏమిటి?

దానికి ఆకారం వుందా?

కొలతలేమన్నా వున్నాయా? రంగూ రుచీ... ఏమన్నా వున్నాయా? ఇదీ అని ఏప్రమాణాలూ స్పష్టంగా లేనిదాన్ని పట్టుకుని మనకు తెల్సిందే నిజం అంటే ఎలా? మనకన్నా తక్కువ తెల్సినవాళ్ళు వుంటారుగదా. ఎంతో ఎక్కువ తెల్సినవాళ్ళు మనకన్నా ఎంతోమంది వుండనే వున్నారుగదా! మనం దేనిని ప్రేమంటామో దానిని వాళ్ళు ప్రేమ కాదంటారనుకోండి వాళ్ళదృష్టితో చూసి? మీ నమ్మకాన్ని వదులుకుంటారా? కాదు... నాదే అసలైన ప్రేమ అంటారు! అందువల్ల ఇటువంటి విషయాల్లో ఎవరికి వారే నిర్ణేతలు

సుజాత వంక చాలా కొత్తమనిషిని చూసిన

ట్లు చూస్తున్నాడు మోహన్.

సుజాత మాట్లాడుతోంటే ఆ ముఖం ఎంతో చక్కగావుంది. ఆ కళ్ళు కాంతులు వెదజల్లుతున్నాయ్. స్పష్టమైన భావాల్తో ఆ మాటలు ఆమె హృదయాన్ని తెలుపుతున్నాయి.

ఆమె వంక అలానే చూసిచూసి, "అదంతా సరే... నిజమే. సబిత ఏమంటుందనేది వదిలేద్దాం. సబితది ప్రేమేనంటారా?" అన్నాడు.

"అది నిర్ణయించడానికి మనమెవరం అంటున్నాను" స్థిరంగా అంది.

"అవును... మనం నిర్ణయించొద్దు! ఇన్‌యువర్ ఒపీనియన్... మీ వుద్దేశంప్రకారం..."

"సబిత విషయం పక్కన పెట్టండి. నా సంస్కారం ప్రకారం ప్రేమంటే ఏమిటో లేదా అది ఎలావుంటుందో చెప్పమంటారు... అంతేనా?"

"ఆఁ..."

"లవ్ ఎట్‌ఫస్ట్ సైట్ అంటారే, తొలిచూపులో ప్రేమ. దాన్ని నేను నమ్మను. ఉదయం విత్తబడి, మధ్యాహ్నం చిగిర్చి, సాయంత్రం పూలుపూసి, రాత్రికి ఫలించే ప్రేమలు మర్నాడుదయానికి తప్పనిసరిగా రాలిపోతాయి అని నమ్మేవాళ్ళల్లో నేనొకర్తిని. అసలిది ప్రేమకాదు. చూడగానే ప్రేమించడానికి అసలు నీకు కనపడేదేమిటి? మనిషిపైపై ఆకారం. అది అందం అనండి. అందంమీద ఆధారపడ్డ ప్రేమంత భ్రమ మరొకటి లేదు.

ప్రేమనేది ఇద్దరుమనుషుల మధ్య అవగాహన నుంచి, స్నేహంనుంచి వారి విలువల ఆధారంగా వారి అభిరుచులు కలవగా పుట్టే వాళ్ళ సంస్కారాల్నిబట్టి పెరుగుతుంది! ఆయా వ్యక్తుల జీవనవిధానాన్నిబట్టి జీవితంపట్ల వారికుండే దృష్టినిబట్టి అది నిలబడుతుంది" అంది సుజాత.

"ఇవన్నీ సబిత గమనించి వుండదనే విషయంమీద మనకి కొంచెంకూడా సందేహం వుండదుగదా"

"సబితేకాదు... ఎవరూ అన్ని విషయాలనూ శ్రద్ధగా గమనించరు. ఒకరు అందాన్ని చూసి, మరొకరు ఆస్తినిచూసి, ఇంకొకరు మాటనీ, మాట్లాడేతీరునీ, ప్రవర్తననీ- ఇలా ఏవోఒకటి రెండు యాస్పెక్ట్సు చూస్తారు. వాటి నుంచి మిగిలిన వాటిని వీళ్ళే కల్పించుకుని తృప్తిపడి 'ప్రేమించటం' అంటారు... అనుకుంటారు. పెళ్ళయినదగ్గర్నుంచి డిఫరెన్సెస్... నన్ను మోసం చేశావంటే, నేను మోసపోయానని... వారివారి శక్తినిబట్టి రాజీపడటమో, పోరాటం మళ్ళీ మొదలుపెట్టడమో..."

"అంటే"

"పోనివ్వండి! ఏమిటి మీరు? అసలీ టైంలో మనకీ చర్చేమిటి?" అందామె విసుగ్గా.

"అవునవును. మనం ఏంచేద్దాం?" అన్నాడు మోహన్.

"మేడంగారిదగ్గరకు ఇప్పుడెళ్ళడం అనవసరమేమో! ఎలానూ వుదయమేగా ఏంచేసినా?"

"అసలేం చేస్తే బాగుంటుందంటారు?"

"మనకెందుకండీ! మేడం నిర్ణయిస్తారుగదా. మేడంగారి నిర్ణయంమీద మీకేమైనా అభ్యంతరాలుంటాయా?" అంది సుజాత.

"అదేంగాదు. ఒకవేళ వున్నా ఆవిడ తీర్పే ఫైనల్ గదా!"

"మీరేమనుకుంటున్నారోగాని మేడంగారికి డెప్త్‌వుంది. ఆవిడ ఆఫీసు టైంలో అనవసరంగా మాటల్తో నడిపితే వూరుకోరుగాని, కమిటెడ్ వర్కర్. మనిషిగా కూడ చాలామందికన్నాపెర్‌ఫెక్ట్! అన్నట్టు మీమీద ఆవిడకి చాలా మంచి అభిప్రాయంవుంది" అంది నవ్వుతూ సుజాత.

సంతోషంతో వుబ్బితబ్బిబ్బయ్యాడు మోహన్- "పోనీయండిగానీ... సబిత క్షేమంకోసం మనం ఆలోచించొద్దా?"

"మీ ఆలోచన ఆమెకి నష్టం కల్గిస్తే. ఆమె జీవితం అంతా మీరు దిద్దగలరా? మీరు బాధ్యత వహించగలరా?"

"అదిగాదు. రేపు ఏంచేద్దామని మేడం అడిగితే ఏంచెప్దాం?" "మీరేం చేద్దామనుకుంటున్నారో అదే చెప్పండి"

నవ్వాడు మోహన్.

సుజాత కూడా నవ్వి అంది "రేపుదయం




నీ ఇల్లు చిన్నదైనా దాని మీద
యింతపెద్ద మొత్తం అప్పుగా ఎందుకిచ్చానో
తెలుసా? నీ ఇంటిని నాగార్జున సిమెంటు
తో కట్టావు గనక!!
MAM 75


అక్కడికెళ్ళి ఆ పరిస్థితులేమిటో స్వయంగా చూశాక ఆలోచించి నిర్ణయించండి. బాగుంటుంది. అంతేగాని..."

"అవును... నిజమే" అని ఆలోచిస్తూ కూర్చుండిపోయాడు మోహన్.

"సబితమీద కోపంగా వుందిగదూ?" అంది సుజాత.

"నాకెందుకు కోపం?"

"పరకజవల్లిగారు పోతులమడుగునీ, సబితనీ బాగుపర్చమని మీకప్పగించారుగదా... సబితేమో..."

"ఏమోనండీ... నాకదంతా పట్టలేదుగాని... సబిత పాపం... పిచ్చిదండీ... ఏమవుతుందో ననే..." అన్నాడు జాలిపడుతూ.

"అవును... అమాయకురాలే. కాని మీరను కుంటున్నంత పిచ్చిదికాదు"

"మన ఆఫీసులో సబిత పిచ్చిది అనే విషయంమీద ఎవరికీ ఏమాత్రం సందేహంలేదు" అన్నాడు మళ్ళీ.

"కావచ్చు"

"మరి మీరు..."

"నేనిప్పుడు చెప్పన్లెండి." అంది తన అభిప్రాయం దాటవేస్తూ.

"కాదు, చెప్పాలి"

"చెప్తాను... తర్వాతెప్పుడన్నా సబిత విషయం పూర్తిగా సెటిల్ అయ్యాక చెప్తాను" అంది సుజాత.

"సరే... కానివ్వండి"

"ఈమధ్య మీరేం పుస్తకాలు చదివారు?" అడిగిందతన్ని.

"ఎక్కడండీ! హైదరాబాద్‌లో వున్నప్పుడు దాదాపు రోజుకోనవల చదివేవాణ్ని. ఇప్పుడు పొద్దున వెళ్తే రాత్రి గూటికి చేరేసరికి ఏ పదకొండో అవుతోంది. మీరు ఆడపిల్లలై బతికి పోయారు. వారంలో ఏరెండోమూడో టూర్లకెళ్తే చాలు. నాకు దాదాపు ప్రతిరోజూ టూరేనాయె... ఇంకేం చదవను"

"నిజమే. ప్రతిరోజూ టూరంటేకష్టం కూడా."

"మేడం లేకుండా వుంటే మొదట్లో కాస్త బెటర్‌గా వుండేది. ఆవిడుంటే ఏం మాట్లాడితే ఏమంటుందో అని భయం. అయినా ఇప్పుడిప్పుడు మాట్లాడక పోవడమే నయమని పిస్తోందిలెండి!"

"అదేమిటి?"

"ఆ సుందర్రావుగారు... పరమేశాల్తో ఏం మాట్లాడ్తామండీ. ఇద్దరికిద్దరే... మహా మురికి మనుషులు?" అన్నాడు అసహ్యంగా.

"ఏం... స్నానం చెయ్యరా?"

నవ్వింది సుజాత. "ఆ పరమేశం బుర్ర యితే కుళ్ళిపోయినట్టుంది పూర్తిగా..." అంది.

"బాగా చెప్పారు. ఇప్పుడు సబిత విషయం తెలిస్తే వాళ్ళు పండగ చేసుకుంటారు తెలుసా? ఒకరోజు వాళ్ళు ఎంత ఛండాలంగా మాట్లాడారో ఆ సబిత గురించి... అప్పట్నుంచి నేను వాళ్ళతో సరిగ్గా మాట్లాడ్డంలేదు"

ఇద్దరూ అలానే ఉండిపోయారు కొంచెంసేపు.

"మీకు నిద్రరావటంలేదా?"

"మీకొస్తోందా?" అంది.

"అనికాదు... మీకు..."

"చెప్పానుగా... నిద్ర పీడగొట్టుకోదలిస్తేనే చదవాలని! నిద్రాకావాలి, పుస్తకాలూ కావాలంటే కుదరదు"

"చలాన్ని చదువుతున్నానని చెప్పుకోడానికి చాలా సాహసం కావాలి... ముఖ్యం స్త్రీలకి!" అన్నాడు మోహన్.

ఏదో గుర్తొచ్చినట్టు నవ్వింది సుజాత.

"ఎందుకు నవ్వుతున్నారు?"

"ఏదో గుర్తొచ్చింది"

"ఏమిటి?"

"చలాన్ని చదవటం ఇప్పుడొక క్వాలిఫికేషన్, తెలుసా?" అంది.

"ఫాషన్ అని తెలుసుగానీ..."

"ఆ...అదే. నేను బియ్యే సెకండియర్‌లో వున్నా. మాఫ్రెండు రాజీ అని వుండేది. దాని అక్క సుధకొక పెళ్ళి సంబంధంవచ్చింది. కుర్రాడు ఆమెతో మాట్లాడాలన్నాడు. పెద్దలు సంశయిస్తోంటే సుధ మాట్లాడనంది. ఆవిడ చలం పుస్తకాలు బాగా చదివేది. అతను




మొదట వేసిన ప్రశ్న "మీకు పుస్తకాలు చదవే అలవాటుందా?" అని.

'ఉంది' అందీవిడ.

"ఏరచయితంటే ఇష్టం" అన్నాడతను.

"చలం అంటే ప్రాణం అందిట"

"మీతో యింకా మాట్లాడేదేమీలేదు" అని వెళ్ళిపోయాడతను.

"జరిగింది విని ఇంట్లో వొకటే గొడవ. ఆ చలాన్ని చదవద్దంటే వినకపోగా వచ్చిన పెళ్ళి కొడుక్కి ఆ సంగతి చెబుతావా- నీకు జన్మలో పెళ్ళవుతుందా అని"

కానీ...

"రెండోరోజునే కబురొచ్చింది. మీ అమ్మాయి కిష్టమైన పద్ధతిలో పెళ్ళికి నేను సిద్ధంగా వున్నానని"

"అప్పట్లో ఈవిషయం కథలుగా చెప్పుకునే వాళ్ళం. అప్పట్నుంచి మా సర్కిల్స్‌లో- చలం పుస్తకాలన్నా చదవ్వే పెళ్ళవుతుందనేది పెద్ద జోక్!"

సుజాత చెప్తున్నంతసేపూ నవ్వుతూ సరదాగా విన్నాడు మోహన్.

"వాళ్ళిద్దరూ ఇప్పుడెక్కడున్నారు?"

"బెజవాడలో! శుభ్రంగా వున్నారు. ఇద్దరూ ఉద్యోగాలు చేసుకుంటున్నారు. చిన్నవే అయినా హాయిగా వున్నారని తెలుసు" అంటూండగానే సుజాతకి చిన్న ఆవలింత వచ్చింది.

నవ్వుతూ- "ఏమండోయ్! మీతో మాటలప్రభావమేమోగాని నిద్రాదేవి వేంచేస్తున్న చిహ్నాలు కనపడుతున్నాయ్" అంది.

"రోజూ వచ్చి మిమ్మల్ని నిద్రబుచ్చిపొమ్మన్నారుగాదు!" అని పెద్దగా నవ్వాడు మోహన్

కిలకిల నవ్వింది సుజాత.

"నాకూ నిద్రొస్తోందిలెండి! పొద్దునే మళ్ళి సబిత విషయం చూడాలి వెళ్తాను అని లేచాడు మోహన్.

"చాలా థాంక్సండీ! చాలాసేపు నాకోసం కూర్చున్నారు" అంది సుజాత.

"అంతేగదా... థాంక్సండీ అంటే వెళ్తున్నందుకనుకున్నా" అని నవ్వాడు మోహన్.

సుజాత పకపకమని నవ్వింది.

"గుడ్‌నైట్" అన్నాడు... నవ్వే సుజాతని చూస్తూ

"గుడ్‌నైట్" అంది.

నడుస్తూన్న అతని మనసు నిర్మలంగా హాయిగా వుంది.

గబుక్కున అతనికి ఒక విషయం గుర్తొచ్చింది!

సుజాత ఇన్ని మాటలు ఎన్నడూ మాట్లాడ లేదు.




నువ్వు రాత్రే నా దగ్గరికి రావల్సింది మోహన్" అంది పంకజవల్లి. ఆమె కంఠంలో కాస్త విసుగూ, కాస్త కోపం కూడా వున్నాయి.

"అతనొచ్చేసరికే పన్నెండవుతోంది మేడం. ఇకప్పుడు.... మిమ్మల్ని డిస్టర్బ్..."

"అదే నాకు చిరాకు. అవతల కొంపలంటుకుపోతోంటే... నా డిస్టర్బెన్సేమిటి? తెల్లారే వరకు విషయాలు ఆగుతయా? వెంటనే ఆ సుందర్రావుగారినీ, పరమేశంగారినీ తీసుకుని వది నిముషాల్లో రండి. మనం అర్జెంటుగా వెళ్లాలి"

విషయం వినగానే సుందర్రావూ, పరమేశంకూడా ముందు నవ్వారు. 'నిజమా?' అని సంతోషపడ్డారు. వాళ్లను చూస్తే మోహన్‌కి అసహ్యమేసింది. ఏ రకంగా చూసినా వాళ్ల ప్రవర్తన అర్థంగా లేదు. కౌన్సిల్ దృష్ట్యా అది గొప్ప అపజయం. సబితవైపు నుంచి చూస్తే అదొక పెద్ద ఆపద. ఏమిటీ వీళ్ల సంతోషానికి కారణం....

జీవులో మాత్రం కౌన్సిల్‌కి చాలా చెర్ల

పేరొచ్చేస్తుందని పోతుల మడుగులోనేగాక మి గిలిన చోట్ల కూడా ఈ ఎఫెక్టుంటుందని ఏమేమో మాట్లాడారు వాళ్లిద్దరూ.

"అనలు నాకు ముందునించీ ఆ పిల్లమీద నదభిప్రాయంలేదు." అన్నాడు పరమేశం.

"మనమావిషయం అనుకుంటూనే వున్నాంగా..." అని ఏదో ఆలోచనలో పడ్డట్టుగా అన్నాడు సుందర్రావు.

"ఇక మనం పోతులమడుగు గురించి మర్చిపోవడం మంచిది" అన్నాడు పరమేశం.

"మీరిద్దరూ కాసేపు ఆపండి' అంది పంకజవల్లి.

ఆమె చాలా సీరియస్‌గా వుందనేది స్పష్టమే.

'ఇప్పుడేమవుతుంది' అనే ఆలోచనతో



మోహన్ బుర్ర వేడెక్కుతోంది.

కాని పంకజవల్లి ఆలోచించేది- "ఇప్పటికే ఏమన్నా అయింటుందా?" అని.

అందుకే ఆవిడకు చాలా ఆవేదనగా వుంది.

అందరూ రకరకాల ఆలోచనల్లో వుండగానే వూళ్లోకొచ్చేసింది జీపు. అందరూ బైటకొచ్చి జీపు వంక చూస్తున్నారు వింతగా...

"సర్పంచ్‌గారింటికి పోనీ" అంది పంకజవల్లి.

సెంటర్‌వైపు పోబోతున్న షఫీ జీపును పక్కకి తిప్పాడు.

ఆమె సమయస్ఫూర్తికి ఆశ్చర్యపోయాడు మోహన్. సెంటర్‌కెళ్లి ఏం చేస్తారింక? అక్కడె వరున్నారు...

ఏడెనిమిది మందితో మాట్లాడ్తున్న సర్పంచ్ గారు జీపుని చూసి మాటలాపి జీపుకెదురొచ్చాడు.

పంకజవల్లి "నమస్కారంసార్" అంటూ జీపు దిగింది.

"నమస్కారమమ్మా. మంచిగున్రా" అన్నాడు వెంకటరెడ్డి.

"ఈ విషయం విన్న దగ్గర్నుంచీ పిచ్చెక్కుతోందండీ..." అంది పంకజవల్లి.

"మీకేంది... వూర్లె అందర్కి పిచ్చిలేచింది. అందరు నాతాన కొచ్చి ఏందిది? అని అడిగేటోల్లే. ఎవన్కి ఏం జెప్పాల్నో తెల్వకనే జస్తున్న. రండి... లోపట్కి బోదం. ఇంగ అంత జర ఆలోచన జేసి సెటిల్ జేస్కోవలె... రండ్రి..." అంటూ లోనికి తీసుకెళ్లాడు.

లోని గది చీకటిగా వుంది. అంతేగాక ఉక్కగా కూడా వుంది.

"కొంచెం ఆ కిటికీ తలుపులు తీయించండి సార్. గాలీ వెల్తురు..." అన్నాడు సుందర్రావు.

"ఆ.. గిప్పుడే.." అని ఎవర్నో తెలియకుండా ఓ గావుకేక వేశాడు వెంకటరెడ్డి.

పంచె పైకెగకట్టినతనొచ్చి రెడ్డిగారు చెప్పిన కిటికీలు తెరిచి వెళ్లాడు.

అందరికీ కాఫీలొచ్చినయ్.

"ఇప్పుడివన్నీ ఎందుకండీ" అంటూనే అందరూ అవి తీసుకున్నారు.

పంకజవల్లి త్వరత్వరగా కాఫీ తాగేసి- "చెప్పండి సార్" అంది.

"మేం ఏంజెప్పాలె. అనుకున్నంత జేసింది. ఇగ నిప్పు రాజుకునేదే వుండె.."

"ఇప్పుడెక్కడుంది సబిత?"

"జెప్త... గనీ ఏం జేస్తరు"

"పిలిపించండి లేదా నన్ను ఆమె దగ్గరకు పంపించండి"

బంపుతలేగనీ... మీరేం జేస్తరూ అని..." సబితనేం చేస్తారో చెప్తేగాని సబిత కనపడదు అనే మాటలు వెంకటరెడ్డి అనలేదు కాని విషయం అదే...

పంకజవల్లి ఓ అరనిమిషం ఆలోచించి- "సబితని ఈ వూళ్లోనించి తీసుకెళ్లిపోతాం."

"వెంటనే" అన్నాడు. అతని నొసలు ముడిపడ్డాయ్.

"ఆ... వెంటనే"

"నా సలా ఏందంటే, ఆమెని వాల్లూరు బంపుండ్రి. మీ సంటర్లల్ల యెయ్యొద్దు..."

"అది నేను చూస్తాను. యిక్కడ్నుంచైతే తీసికెళ్లిపోతాం."

"అచ్చ. మంచిది... మల్ల సంటర్ ఏంజేస్తరు. మూస్తరా?"

"లేదు లేదు.. మీరు మరొకయిల్లు మాట్లాడి పెట్టండి. వెంటనే తెరుద్దాం. మరొక టీచర్ని బంపుతాం"

"ఈసారన్నా జర..."

"సరే" అంది పంకజవల్లి. అవమానంతో ఆమె మొఖం కందింది.

"అదుగో... ఆ కమ్రల్ల వుంది మీ టీచరు" అన్నాడు వెంకటరెడ్డి. టీచర్ అనే పదానికి ఎంత వ్యంగ్యం వీలయితే అంతా పెట్టి.

'ఇక్కడా?' అని అందరూ ఆశ్చర్యపోయారు.

"అవ్... రాత్రి పెద్ద పంచాయితి జర్గింది. రాంచెంద్రారెడ్డి నా మేనల్లుడేగద. మా చెల్లె మల్ల బాయిలో దూకిందని తెల్సినా పిల్లలంత అని కమ్రలకల్లి లొల్లి జేసిన్రు. అదు... అనికి పిచ్చిలేచిందో ఏందో.. ఎందుకు దీని గురించి అంత జస్తుండో.. గని... అది బావలమీదికే..





అంటే నాపిల్లలే గద.. కత్తి దీన్కుని మీదకురి కిందు.. ఇగ ఈల్లు ముగ్గురు నల్గురున్నరేమో.. అన్ని దమ్మడదిమ్మడ బాదిర్రు. దెబ్బతో పిచ్చి బోయుండాలె... ఇగ దీన్ని ఎంజేసినారోగని.. నేంబోయి దీస్కొచ్చి ఈ కమ్రల్లపెట్టిన. అని తాళం చెవి తీసి వంకజవల్లి కిచ్చాడు.

వంకజవల్లి తాళం తీసి లోనికెళ్లింది. నబిత ఓమూల పడి నిద్రోతోంది. గదినిండా ఏవో దుంపలూ, వుల్లిపాయలూ రాసులుగా పోసున్నారు.

వంకజవల్లి "మోహన్" అని పిలిచింది.

మోహన్ రాగానే "జీపు స్టార్ట్ చేసి గుమ్మం దగ్గర పెట్టించు వెంటనే..."అంది.

మోహన్ బైటకు పరుగెత్తాడు.

"రెడ్డిగారూ... మీరు కాస్త గుమ్మం దగ్గిర నిలబడండి" అంది.

నబితని లేపింది. నబిత లేచీలేవగానే 'అమ్మగార్ని' చూసి 'నమస్తే అమ్మా' అనడం గూడా మానేసి ఏదో చెప్పబోయింది.

"మాట్లాడద్దు. అంతా తర్వాత మాట్లాడు కుందం. లే... లేచి నా వెంటరా" అంది వంకజవల్లి.

ఇద్దరూ చకచకా నడుచుకుంటూ వచ్చి జీప్ ఎక్కారు.

"షఫీ... ఎక్కడ ఆపకుండా త్వరగా పోనీ"

జీపు బైల్దేరి వచ్చేస్తుంటే "టీచరమ్మని తీస్కపోతున్నారు" అని తెల్సినట్టుంది. అంద రూ ఇళ్లబైట నిలబడ్డారు నబితకు సానుభూతి తెలుపుతున్నట్టు.

మోహన్ మాత్రం నబిత ముఖంవంక జా లిగా చూశాడు. 'పాపం తన ప్రియుడికెలా వుందో కూడా తెలియదు. కనీసం చివరిసారిగా వీడ్కోలు కూడా ఇచ్చుకోలేదే. మళ్లీ వీళ్లిద్దరూ కలుస్తారా? అసలు కలవాలా?"

"మేడం నబిత బట్టలూ అవీ... " అన్నాడు మోహన్.

"అవన్నీ తర్వాత వస్తాయే... మీకు సిట్యు యేషన్ అర్థంగాలేదా లేక కానట్టు నటిస్తారా?" అంది.

తన తెలివితక్కువ తనానికి సిగ్గుపడ్డాడు మోహన్.

"ముందు వూరు దాటితే... తర్వాత... ఇక ఏమిటీ అనేది?" అన్నాడు సుందర్రావు.

అంత తెలివి ప్రదర్శించినందుకు పాపం అతనికి ఏమీ ప్రశంస లభించలేదు.

జీపు రావడం రావడమే ఆఫీసు కొచ్చే సింది.

వంకజవల్లి తన రూంలోకెళ్తూ- "నబితా నాతోపాటు రా" అంది.

నబిత భయంభయంగా మోహన్ వంక చూసి లోనికెళ్లింది.

తను వెళ్లాలా వద్దా అనుకుని పిలవనప్పు డెందుకు? అని తన సీటులో కెళ్లి కూర్చున్నా డు మోహన్.

సుందర్రావు లోనికి రాబోతేంటే "మిమ్మల్ని కాస్తాగి పిలుస్తాను" అంది వంకజవల్లి.

"చెప్పు" అంది వంకజవల్లి నబితని చూ స్తూ.

మాట్లాడకుండా వూరుకుంది నబిత. అస లు తను ఏం చెప్పాలో తెలియడంలా నబితకి.

"ఏమిటిదంతా?

నీకు నేనేం చెప్పాను?

అసలెందుకు జరిగిందిదంతా... ఏమిటి ఏమీ మాట్లాడవే. వాగి వాగి నోరు నెప్పెట్టి వూరుకుంటాననుకుంటున్నావా?"

"అదిగాదమ్మా..."

"ఏదిగాదు?"

"ఇదంత గిట్లెందుక్క జర్గిందో నాకే గుర్తయి తలేదు"

కోపంగా నబితని అలాగే చూసింది పంకజ వల్లి. నబిత ఆ మాటల్ని మనస్ఫూర్తిగా నమ్మి అంది. దానిలో ఏమీ సందేహం లేదు. పంకజ వల్లి చూస్తోంటే భయంతో బిక్కచచ్చిపోయింది నబిత.

అలానే చూస్తూ చూస్తుండగా పంకజవల్లికి నవ్వు తన్నుకొచ్చింది. ఈ ఆఫీసులో చేరింత ర్వాత మొదటిసారి పంకజవల్లి రూంలోనుంచి పంకజవల్లి నవ్వు విన్నారు బైటి ఆఫీసు స్టా ఫంతా.

అగిఅగి తెరలుతెరలుగా పంకజవల్లి నవ్వింది. నబితకేం చెయ్యాలో తెలియక నవ్వు

తున్న పంకజవల్లిని చూస్తూ చిరునవ్వు లొలి కించింది.

సుందర్రావు, పరమేశం లోన నుంచీ పంక జవల్లి అరుపులకు బదులు నవ్వులు విన్పించే సరికి గొప్ప సస్పెన్సులో పడ్డారు.

"ఏమిటి... ఎందుకు?' అనే సమస్యతో సత మతమయ్యారు.

మోహన్, సుజాతలు పకర్నొకరు ఆశ్చ ర్యంగా చూసుకున్నారు.

ఛాయకు చిరాకొచ్చింది.

కాని పంకజవల్లి నవ్వు ఆపలేదు.

ఏమాటకామాట చెప్పుకోవాలంటే పంకజవ ల్లి ఎంత చక్కగా నవ్వుతోందో. ఆవిడ నవ్వు తాలూకు కిల కిల ధ్వనులు ఆఫీసంతా మారు మ్రోగాయి.

నెమ్మదిగా తగ్గింది.

పంకజవల్లి ప్రశ్నలకు జవాబులిచ్చింది సబిత.

ఎక్కువరోజులు వుద్యోగం వుండేట్టు లేదు. పెళ్లి చేసుకుంటానన్నాడు రాంచెంద్రారెడ్డి. సరే అనుకుంది. ఓరాత్రి తనే స్వయంగా వెంట బెట్టుకుని తన గదికి తీసుకెళ్లాడు. అందరూ నిద్రల్లో వున్నారు. ఆ రాత్రంతా అతను తనని ప్రేమించాడు. తెల్లారుతూనే అడిగింది పెళ్లెప్పుడు చేసుకుందామని. పెద్ద వాళ్లతో మాట్లాడాక అని చెప్పాడు. తను బైటికొ ద్దామనుకుంటుండగా పెద్దవాళ్లు చూశారు. గొ డవ మొదలైంది. రాంచెంద్రారెడ్డి మంచివాడే. తనని బాగా ప్రేమించాడు. సెంటర్‌వాళ్లు తనని వుద్యోగంలోంచి తీసేస్తే తను ఏమ వ్వాలి. తండ్రిదగ్గరకెళ్లదు. మరెక్కడికిపోవాలి. అప్పుడే తెల్సింది రాంచెంద్రారెడ్డికి పెళ్లి అయిందని. అతన్తో ఆ మాటంటే, అయితే ఏమయితది? అన్నాడు. ఏమయితది అను కుంది సబిత. భార్యని కూడా తెచ్చుకుంటాడు. ఇద్దరితోను మంచిగుంటాడు. అదే అతను అన్నాడు. కాని 'లొల్లి లొల్లి జేసిర్రు. గీపెద్దో ల్లంత బద్మాషులెవలుండరు. అల్లకేమైంది? ప్రేమించుకునుడు తప్పయితదా? రాత్రి నల్గు రు మగోల్లు కమ్రలకి గుసాయించిర్రు. రాంచెంద్రారెడ్డి కత్తి పుచ్చుకుని అల్లమీద పడిండు గని నల్గురు అంబోతుల్లెక్కున్రు. రాంచెంద్రారెడ్డిని కొట్టి బేహోష్ చేసిర్రు. నన్ను అటు లాగిర్రు. ఇటు లాగిర్రు. అల్లంతా ఎప్ప ట్కి నన్ను జూసి నగేవాళ్లు. యిస్కూలు దగ్గర కొచ్చి సీటిలు గొట్టేటోళ్లు. మల్ల యిప్పుడేమ యిందో ఆనగుడు. బాగా కోపం గైనరు. అల్లు నన్ను ఏందేందోజేద్దమని జూసిర్రు. గని నేను బైటికురికొచ్చిన. బైటంత పెద్దోళ్లు. రాంచెంద్రా రెడ్డి నాయిన, అమ్మ, వదినె... వాల్లంతా. ఇగ ఇంటి ఎనక్కి వురికిన. ఆ నల్గుట్లో ఒక్కాయన నా ఎంటురికిండు. నన్ను గట్టిగా పట్టుకుని ఏడికో లాక్కుపోయిండు. ఆడయితే నన్ను గొట్టేటట్లు లేడుగని అని దమాకుల ఏదో వుంది. అప్పుడు సర్పంచ్ తగిలుండు మాకు. అన్ని గదమయించిండు. ఆడు పోయిండు. ఇగ సర్పంచి నన్ను నడుంచుట్టు చెయ్యేసి నొక్కుకుంట తీస్కపోతుండు. అంతట్లనే మంది పోగయితుర్రు. ఇగ అప్పుడు నా చె య్యి పట్టుకుని ఇంటికి గుంజుకపోయిండు. కమ్రల్లయేసి 'చస్తవే' అని గట్టిగ అదుము కుండు. అంతట్ల ఆయన భార్యవస్తున్న చప్పు డయింది. యిక బైటికురికి తాళం ఏసిండు. నేన్నిద్ర బోయిన. లేచేపాటల్లకు మీరొచ్చిర్రు"

ఒక్కరాత్రిలో ఎన్ని ఘోరమైన సంగతులు జరిగినాయి. ఒక్క సంగతి కూడా తనకు సంబంధంలేనట్లు చెప్పింది సబిత. ఎంతెంత ఘోరాలు తప్పాయి. అవేమీ తనకు తెలి యవా? జరగలేదు కాబట్టి పట్టవా?

అంతా అయినాక సబిత పంకజవల్లి ముందు తనకు సంబంధించి రెండు ప్రపోజ ల్సుంచింది.

"రాంచెంద్రారెడ్డితో మాట్లాడి..."

"అతని సంగతి మర్చిపో" అంది పంకజవ ల్లి.

"నాకొల్వు నాగ్గావాలె. నన్ను ఈడికెళ్లి బై టకు నూకొద్దు"

"సరే" అంది పంకజవల్లి.

ఆఫీసులోనే ఓ చిన్న పోస్ట్ ఖాళీగా వుంటే సబితని తన కళ్లముందు పని చేసేలా వేసే సింది పంకజవల్లి.

సబిత బుద్ధిగా పని చేస్తూపోతోంది. కాని నవ్వులు మానలేదు. ఆ కళ్లు కూడా విశాలంగా

అలానే వున్నాయి. ఎన్ని విషాదాలు జరిగినా కళ్ళు చిన్నవవలా!

★ ★ ★

బైటకెళ్ళిన మోహన్ లోనికొస్తూ "మార్చి ఇంకా మొదలవ్వలేదు ఎండలు దంచుతు న్నాయ్. ఇక ఏప్రిల్, మే నెలలెలా వుంటాయో?" అన్నాడు.

"అవును... నాలుగవుతున్నా ఇంకా ఎండ ఎంతగా వుందో?" అంది ఛాయ.

"ఇవ్వాళ ఎవరెవరు వెళ్తున్నారు?" అంది సుజాత.

"ఎవ్వరూ లేరు. నేనూ, షఫీ. పని కూడ పెద్దగా లేదు లెండి. పెందలకాడే వచ్చెయ్యొ చ్చు.... పోతులమడుగు" అని చెప్పి తన బీరువాలోనుంచి ఏవో ఫైళ్ళు తీసుకున్నాడు.

ఆఫీసు బాయ్‌ని పిలిచి మంచి నీళ్ళిమ్మ న్నాడు. అతను మంచినీళ్ళిచ్చేలోపు ఛాయనీ, సుజాతనీ చూస్తూ ఏవో ఆలోచనల్లోపడ్డాడు.

నైటీలో ఛాయ అందం, ఆరోజు రాత్రి ఎన్ని విషయాల గురించో చకచక మాట్లాడిన సు జాత.... సుజాత కూడా అందంగా వుందే అని తననుకోవడం గుర్తొచ్చి లీలగా పెదవులమీదకి నవ్వు పాకింది. సుజాత వంక చూశాడు. అప్పు డే నవ్వుతూ సుజాత కూడా మోహన్‌వంకే చూస్తూ, "మీరు పోతులమడుగులో ఏంచేస్తా రు?" అంది.

"వెంకటరెడ్డిగార్ని కలిసి స్కూలుపెట్టడాని కి ఇల్లు..... అవన్నీ మాట్లాడాలి" అని "ఏమిటి నవ్వుతున్నారు?" అన్నాడు.

"ఏమీలేదు" అంది సుజాత నవ్వుతూనే.

"ఏదో వుందిలే... చెప్పండి"

"పోతులమడుగులో మిమ్మల్ని ఎవరన్నా ఏమన్నాచేస్తే మీరేంచేస్తారా అని...."

"అంటే.... పోతులమడుగులో రెడ్లందరూ కర్రలూ కత్తులూ పుచ్చుకుని నావెంట బడట మూ, నేను పిక్కబలం చూపుతూ పరుగెత్తడ మూ.... ఇదంతా ఊహిస్తున్నారా?" అని నవ్వా డు మోహన్.

ఇప్పుడు కాస్త పెద్దగా నవ్వింది సుజాత మోహన్ మాటలు విని ఛాయ కూడా నవ్వింది.

"ఏమైనా ఆడపిల్లల్ని నవ్వించేలా మాట్లా డ్డం మనకి కుదరదయ్యా" అన్నాడు సుంద ర్రావు పరమేశంతో.

"ఆ మాటకొస్తే మనకసలు ఏదీ కుదరదు" అన్నాడు పరమేశం. 'ఏదీ' అనే పదానికి ఏవో అర్థాల్నిస్తూ.

"సరే... నే వెళ్తున్నా" అని లేచి మోహన్ వెళ్ళిపోయాడు.

వాళ్ళా ఆ మాటలనగానే ఫక్కున నవ్వుమా నేసింది ఛాయ. కోపంగా వాళ్ళకేసిచూసి పనిలో పడింది సుజాత.

సబిత ఏదో ఫైలుకోసం అటొచ్చింది. పర మేశం, సుందర్రావులు సబిత వంకే ఎలా చూస్తున్నారో చూడమని సైగచేసింది ఛాయ.

సుజాత వాళ్ళవంక చూసింది. చొంగకార్చు కుంటూ ఆడది కనపడగానే చూసే మగజాతి చూపది.

వీళ్ళు ఇంతింత చదివారు. కాస్త కూడా సంస్కారం అబ్బలేదే- అని బుర్రపగలగొట్టుకో వడంలోపడింది సుజాత.

సబిత రికార్డు రూంలోకెళ్లడం చూసి సుంద ర్రావు కూడా "నాకూ.... ఏదో ఫైలు...." అని గొణుగుతూ రికార్డురూంలోకెళ్లాడు.

ఛాయ, సుజాత ఒకలా - పరమేశం మరొ కలా గమనిస్తున్నారు.

సుందర్రావు సబితతో ఏదో గుసగుసలుపో తున్నాడు.

సబిత "నాక్కుదర్దు! అమ్మనస్నేడికి ఎల్లా ద్దంది. అమ్మసడుగుర్రి... వస్త!" అంటూ వచ్చింది.

"ఎక్కడికి?" అన్నాడు పరమేశం.

"సార్ బిడ్డెకి మంచిగలేదంట. జరవచ్చి జర్రసేపుండి పోతవా? అంటుండు. నాకైతే ఎల్లాల్నే వుండెగాని.... అమ్మ ఊకోదు. ఆఫీస యినంక యింటి కుర్కిపోవాలె. ఏడికన్న బోవా ల్నన్న అమ్మనడ్గిపోవాలె! మల్లసారే అమ్మన డ్గితె మంచిగ యిగ!..." అనుకుంటూ వెళ్తోంది.

"సరే సరే... సబిత, ఇదిగో నేనడుగుతాలే. నువ్వు ఆమెతో ఏమీ చెప్పకు" అంటూ వచ్చా డు సుందర్రావు.

"ఏమవుతుందండీ చెప్తే" అంది సుజాత.

"ఏమవుతుంది... ఏమీ అవదు. కాని ఈ సబిత అమాయకురాలుగదా.... ఒకటి చెప్పబోయి ఒకటి చెప్తే అనవసరంగా లేనిపోని అపార్థాలు..." అంటూ తడబడ్తూ పంకజవల్లి రూంలోకెళ్లాడు సుందర్రావు.

అతను వెళ్లినవైపు తలెగరేసి "అన్నీ అబద్ధాలే. వీళ్లమ్మాయి పొద్దున కాలేజీకెళ్తూ నాక్కనపడింది" అన్నాడు పరమేశం.

"ఏం చదువుతోంది?"

"ఇంటర్ అనుకుంట..."

"మరి సబితని రమ్మనడం ఎందుకు?" అంది ఛాయ. పరమేశం ఏంచెప్తాడో విందామని.

"ఎందుకంటే.... ఆయనే అంటున్నాడుగా అమాయకురాలని.... ఏదో కాస్త మాయచేద్దామని...." అని వెకిలిగా నవ్వాడు.

అంతలోనే లోపల్నుంచి సుందర్రావు వచ్చాడు. అతని ముఖం బాగా వుబ్బిపుంది. అది అవమానంతోనే అని అందరికీ తెలుసు.

అందరూ పనుల్లో మునిగివున్నారు. ఛాయ సుజాతతో నెమ్మదిగా అంది-

"మా కజిన్ ఫోన్‌చేసింది ఇందాక! సినిమాకి రమ్మని... వస్తానని చెప్పా. నువ్వుకూడా రారాదూ"

"ఏం సినిమా?"

"ఏదో పాతదే...."

"పాతదయితే రావచ్చులే. వస్తాలే... ఒక్కదాన్నీ ఏంచెయ్యాలి ఇంటికెళ్లి"

"టికెట్లు తను తీసుకుని ఎదురుచూస్తానంది. మనం ఇంటికిపోయి కాస్త ముఖం, కాళ్ళూచేతులూ కడుక్కుని వెళ్దాం" అంది ఛాయ.

"సరే" అంది సుజాత.

"ఏదో సినిమా కంటున్నారు? మేమూ రావచ్చా?" అన్నాడు పరమేశం.

"మీకేం ఖర్మండీ మాతో సినిమాకి రావడానికి! మీ ఆవిడని తీసుకెళ్లండి" అంది సుజాత.

"ఆవిడలా ఏమీ అనుకోదులెండి. ఆవిడ చూసే సినిమాలు ఆవిడ చూస్తుంది. నేను చూసే సినిమాలు నేనూ... ఎవరి దోవ వాళ్లదే" అన్నాడు వీళ్లతో సినిమాకి సిద్ధమయిపోతూ పరమేశం.

సుందర్రావు తనుకూడా వీళ్ళతో కల్సిపోదామని చూస్తున్నాడు.

"సర్లెండి... మీదోవ మీదే, మాదోవ మాదే" అంది సుజాత.

కోపంగా ఓ చూపుచూసి తల దించుకున్నాడు పరమేశం.

ఇందాక తనకి జరిగిన అవమానం గ్రహించి నవ్విన పరమేశానికి ఇంత జరిగాక సంతోషంతో తలమున్కలవ్వక ఏంజేస్తాడు సుందర్రావు.

పంకజవల్లిగారి రూంలో ఫోన్ మోగింది.

"బహుశా మాకజినే అయుండొచ్చు" అని లేస్తూ టైంచూసి "టైమవుతోంది. లే... వెళ్దాం" అంది ఛాయ.

"ఆ..." అని పెద్దకేక వినబడింది.

అందరూ పంకజవల్లిగారి రూంలోకి పరిగెత్తారు.

ఆవిడ ముఖం నిండా చెమటలు పట్టివున్నాయ్.

"ఇప్పుడే వస్తున్నాం... ఎక్కడున్నారూ?"

"ఆ... అహ.. అహ... ఫర్వాలేదంటారా! ఏమీ తగల్లేదా? సరే... వస్తాం లెండి. జాగ్రత్త... అలాగే...." అని ఫోన్‌పెట్టేసి వీళ్లవంక తిరిగి "మన జీప్‌కి యాక్సిడెంటయిందట..." అని పంకజవల్లి చెప్తుండగానే "ఆ" అని అరిచింది సుజాత.

"ఊరుకోమ్మాయ్... ఎవరికీ ఏమీ అవలా! మోహన్‌కి నుదుటిమీద చిన్నగాయం. అంతే! వట్టి లక్కీగా బతికాడండీ! ఎదురుగా లారీ వచ్చి గుద్దేసిందట. వాడిదే అదృష్టం అంటున్నారు పోలీసులు. మోహన్‌కి ముఖంవెళ్లి రాడ్‌కు గుద్దుకుందట. చిన్నదెబ్బ అంటున్నారు. జీప్ మాత్రం బాగా దెబ్బతిందట" అని చెప్పింది పంకజవల్లి.

"యాక్సిడెంటనగానే గుండెలదిరిపోయాయ్- ఏమయిందోనని. ఏమీ కాలేదంటున్నారు. అయినా నాదడ తగ్గలా... సబితా, కాసిని మంచినీళ్ళు తెప్పించు...." అంటోంది

పంకజవల్లి.

సుజాత ముఖంనిండా చెమటలు పట్టేసినాయ్. "దెబ్బ బాగా తగిలిందా మేడం?" అంది... గొంతు పెగలడంలా.

"లేదంట. నువ్వేంటి అంత ఇదయిపోతున్నావ్! ఏమీకాలేదు... ఖంగారుపడకు. మళ్ళీ నిన్ను ఆస్పత్రికి తీసుకెళ్లాల్సొస్తుంది" అని నవ్వింది పంకజవల్లి.

ఆఫీస్‌బాయ్ నీళ్ళు తెచ్చాడు. "ముందా పిల్లకివ్వు" అంది పంకజవల్లి.

సుజాత మంచినీళ్ళు తాగింది.

ఛాయ "పెద్ద దెబ్బలేంతగల్లేదుగా మేడం?" అంది.

"లేదమ్మాయ్! పోలీసులంటున్నారు... పెద్ద గాయాలేమీలేవు. ఎందుకయినా మంచిదని హాస్పిటల్‌కి తీసుకెళ్తున్నారట. నన్ను



కూడా రమ్మన్నారు. నేను వెళ్తున్నాను'' అంది పంకజవల్లి.

''ఇంకా నయం. ఇవ్వాళ లేచిన వేళావిశేషం. నేను కూడా వెళ్లాల్సిన వాడిని! ఆ భగవంతుడు మేడంగారినోట నన్ను వెళ్ళొద్దని పలికించాడు. ఏముంది... కాస్తుంటే హరీమనే వాడిని'' అని తను హరీమన్నట్టు... తనని చూసి తనే ఏడుస్తున్నట్టు ఊహించుకుని భయపడిపోయాడు సుందర్రావు.

''సర్లే... వూర్కోండి. యాక్సిడెంటవుతుందని నాకు తెలిసి మిమ్మల్ని ఆపి ఆ పిల్లాణ్ని పంపానా ఏమిటి? పిచ్చిమాటలూ మీరూనూ?'' అని విసుక్కుంది పంకజవల్లి.

''బాగా చెప్పారు. యాక్సిడెంట్ అంటే యాక్సిడెంట్. అది ఎవరమూ వూహించలేం'' అన్నాడు పరమేశం.

''సార్‌ను చూసొద్దాం పదమ్మా'' అంది సబిత.

''పద'' అని లేచింది పంకజవల్లి.

''మేంకూడా వస్తాం'' అంది సుజాత.

''రండి'' అంది పంకజవల్లి.

''ఎందుకు సుజాతా... పెద్ద దెబ్బలేం తగల్లేదటగదా! అయినా మనమెళ్ళి చేసేదేముంది. తగ్గకపోతే రేపు చూడొచ్చుగా! సినిమాకి... కజిన్....'' అంది ఛాయ.

''నేను రాన్లే... నువ్వెళ్ళు'' అని చకచకా హాస్పిటల్‌కి పరిగెత్తినట్టు వెళ్ళింది సుజాత.

పంకజవల్లి, సబిత మోహన్‌కి ధైర్యంచెప్తున్నారు.

మోహన్‌కి దెబ్బ నుదురుమీద తగిలింది. అతని తెల్లని చొక్కా రక్తపు మరకల్తో వుండి చూడ్డానికి భయంగొల్పుతోంది.

''దెబ్బ పెద్దదేంకాదులెండి... కాని కళ్లతో యాక్సిడెంటు చూశాడుగదూ, కాస్త టెన్షన్ ఫీల్ అవుతున్నాడు....'' అన్నాడు డాక్టర్.

''లేదు... లేదు'' అన్నాడు మోహన్.

''ముందా షర్టు తీసెయ్యండి. సగం టెన్షన్ తగ్గుతుంది'' అన్నాడు మరొక డాక్టర్.

పంకజవల్లి ఆఫీసర్స్‌తో మాట్లాడ్డానికెళ్లింది.

మోహన్ సుజాతనీ, సబితనీ చూసి నవ్వాడు. అతని నవ్వులో చావుని తప్పించుకుని వచ్చినధీరుడి లక్షణం వుంది.

అది చూసి సుజాత కూడా నవ్వింది. ఆ నవ్వు నిండా సానుభూతి. సబిత ''ఖంగారువద్దు సార్! ఊకె తక్కువవుతది. నాల్దినాలు. గంతనే....'' అని ధైర్యం చెప్తోంది.

ఇద్దరివంక చూసి నవ్వుతున్నాడు మోహన్. ఏమీ అనడు. ఎందుకని? సుజాతకి భయం వేసింది.

''మీరేమీ మాట్లాడరే!'' అంది హీనస్వరంతో.

''ఆ...'' అని నవ్వి ''ఛాయగారేరీ?'' అన్నాడు.

''తను సినిమాకెళ్లింది. ఎవరో కజిన్‌కొస్తానని చెప్పిందట. రేపొస్తానంది మిమ్మల్ని చూడటానికి...'' అంది సుజాత.

తనకి యాక్సిడెంట్ అయినట్లు తెల్శాక కూడా ఈ రోజు సినిమా కెళ్లిందా ఛాయ అనుకున్నాడు మోహన్.

''మరి మీరెళ్లలేదే?''

''సర్లెండి...'' అంది సుజాత.

సుజాత ఏమిటి ఇంత గిలగిల్లాడిపోతోంది తనకి దెబ్బ తగిలిందని తెలిసి.

''ఎందుకంత ఇదవుతున్నారు ఇది చాలా చిన్నదెబ్బ. రెండ్రోజుల్లో తగ్గిపోతుంది'' అన్నాడు.

''అవును... మీరు ధైర్యంగా వుండండి'' అంది సుజాత.

మోహన్ ఆమెని చూసి నవ్వాడు.

''సుజాత మేడం నీకు యాక్సిడెంటయిందనంగానే ఏడ్చింది'' అంది సబిత మోహన్‌తో.

''ఛీ... లేదు'' అంది సిగ్గుతో సుజాత.

''మల్ల అమ్మగారు తన గురించి తెప్పించుకున్న లీల్లు నీకెందుకు తాపింది?'' అంది సబిత.

''ఏంలేదులే పోనీ...'' అంది సుజాత.

మోహన్‌వంక తిరిగి తన మాటలే నమ్మమ




న్నట్టు నవ్వింది సబిత.

పంకజవల్లి వచ్చి- "గాయం లోతుదాకాకాలేదు. తగ్గిపోతుంది. వెళ్లిపోవచ్చు అన్నారు డాక్టరుగారు" అంది.

"వెళ్దాంపదండి" అని లేచాడు మోహన్.

"ఆ... నెమ్మదిగా..." అని హడావుడి పడింది సుజాత.

"వూరుకో సుజాత. నువ్వు మరీను ఇంత ఖంగారుపడుతున్నావే. ఇందాకా అలాగే స్పృహతప్పి పోతుందన్నట్లయిపోయావ్. ఇంత సున్నితంగా వుంటే ఎట్లా. కాస్త గట్టిపడాలి ఏ విషయానికైనా!" అని మందలించింది.

చౌరస్తాకొచ్చాక "ఈ పూటకి మా ఇంటిదగ్గరుంటారా?" అంది పంకజవల్లి.

"ఎందుకండీ అంత అవసరంలేదు. టైం కూడా అయిందిగా కాస్త ఆకలిగా కూడా వుంది. రమణమ్మగారి మెస్‌కెళ్లి భోంచేసి రూంకెళ్తాను" అన్నాడు మోహన్.

"అన్నట్టు షఫీ కనబడలేదే? అంది సుజాత హటాత్తుగా.

"అబ్బ... ఎంత త్వరగా గుర్తుకొచ్చాడు?" అని నవ్వింది పంకజవల్లి. తర్వాత "అతనికే మీ తగల్లా. లక్కీఫెలో. పోలీస్‌స్టేషన్‌లో సంతకాలు... తర్వాత జీపువనీ... ఆ హడావుడిలో వున్నాడు" అంది.

మళ్లీ "మేం వెళ్లమా?" అనడిగింది మోహన్ని.

"ఆ... వెళ్లండి మేడం... థాంక్స్" అన్నాడు.

"ఒకే. దట్సాల్..." అంటూ వాళ్లిద్దరూ వెళ్లిపోయారు.

"గుడ్‌నైట్ సార్... గుడ్‌నైట్ మేడం" అని చెప్పడం మరవలేదు సబిత.

రమణమ్మగారు కంగారుపడింది యాక్సిడెంటయిందని తెలిసి.

"ఏమీ వద్దు. ఈ పూట ఇక్కడ వుండిపోనాయనా! ఏ అర్ధరాత్రి కాడన్నా మంచినీళ్లయినా ఇచ్చేవాళ్లు లేకుండా... వట్టప్పుడైతే నిన్నుండమంటామా? నీవెళ్లడానికి వీల్లేదులే" అని భోజనాలయినాక మోహన్ని వెళ్లనివ్వలేదు.

★ ★ ★

"అరె... గాడ లైటుపడితే మా ఇంటిదంక ఎలుగొచ్చింది" అంటున్నాడొక పిల్లాడు.

"అరె... మా ఇంటికాడ వచ్చిందిర లైటు" అన్నాడింకొకడు.

"అరే... ఈల్లు రాత్రంత గిట్లనే లైటేసుకునుండాలె. గప్పుడు మన ఇల్లల్ల లైట్లు వెల్గుతయ్" అన్నాడింకాస్త పెద్దాడు.

వీళ్ల మాటలన్నీ వింటున్నాడు మోహన్.

అంతకు కొంచెంముందే ఒకామె ఓ పాపని తీసుకొచ్చింది. "నా బిడ్డ చెంపలుబ్బినయ్. జర చూడుండ్రి సార్! నిన్నటిదంక నవ్వేడ్సి పొద్దుగాల్నుంచి మెద్దుబారి కన్పిస్తుంది"

ఏముంది మాల్‌న్యూట్రిషన్. పోషకాహార లోపం. ఆహారమేలేదు. పోషకాహారం...

ఛాయ అంటోంది "వీళ్లకసలు నేర్చుకోవాలనుండదు"

"ఎందుకుండదు?" అన్నాడు మోహన్.

"ఏది? ఏం నేర్చుకుంటున్నారు. పరిశుభ్రంగా వుండండి. మంచి తిండి తినండి అని ఎన్నిసార్లు చెప్పాం. వుంటున్నారా. నేర్చుకుంటున్నారా?" అంది ఛాయ కోపంగా.

"అంటే మనం చెప్పకపోవడంవల్లే ఇన్నాళ్లూ వాళ్లకి తెలీదా? ఇప్పుడు మనం చెప్పాం. కాబట్టి వాళ్లుండాలా? ఎలా వుంటారు. తిండిలేక చచ్చే దేశప్రజలకి ఆమధ్య ఓ పిచ్చివాడు ఇచ్చిన సందేశం గుర్తొస్తోంది. మీరంతా ఆరోగ్యంగా వుండాలంటే రోజూ వెన్న భుజించండి అన్నాడు. గుర్తుందా సుజాత?" అన్నాడు మోహన్.

"ఆ... కనీసపు తిండిలేకుండా జనం చస్తోంటే వెన్న భుజించమని సలహాలు. పోషకాహారాలు... మంచితిండి... పరిశుభ్రంగా వుండటం... తాగడానికి నీళ్లులేక చచ్చే జనాలకి రోజూ రెండుసార్లు స్నానం చెయ్యమనీ చెప్పడం... ఇవన్నీ హాస్యాస్పదంగాదా ఛాయా...?" అంది సుజాత.

"అయితే ఏమిటి? మనం ఏంచెప్తాం. మంచి తిండివద్దు అనీ, పరిశుభ్రంగా వుండనక్కర్లేదనీ చెప్తామా...?"

"అనవసరంగా కోపం తెచ్చుకోకోయ్! మేమ

నేది అది కాదు. వాళ్ల పరిస్థితులలా వున్నా యని గుర్తించడం, వారికి మనచేతనైన సహాయం చెయ్యడం... అంతకన్నా మనం ఏంచెయ్యలేం. కాని మనం ఏమీ చెయ్యలేమని తెల్సుకోవటంవలన వాళ్లమీద మనకి కోపం రావడం అన్యాయంకదూ?'' అంది సుజాత.

'ఆ... అదీ సంగతి' అనుకున్నాడు మోహన్.

ప్రజల పరిస్థితి అన్యాయంగా వుందని తెలిసీ మనం ఏమీ చెయ్యలేకపోతున్నామే అనే ఫీలింగే రకరకాల రూపాలు చెంది, అది వారిమీద సానుభూతిగాగానీ లేదా వారి పరిస్థితి అలా వుండటానికి వారే కారణం అని వారిమీదే కోపం రావడంగానీ జరుగుతోంది. ఇలా మారుతున్నాం అనుకున్నాడు మోహన్.

ఇందాకటావిడ తీసుకొచ్చిన పిల్ల కళ్ల ముందు కనబడింది. రోజుకెన్నివేలమంది పిల్లలు పోషకాహారం సరిగా లేక మరణిస్తున్నారు అనే ఆలోచనరాగానే... జీపు దగ్గర ఆడుకుంటున్న పిల్లలు, వీళ్లు కూడా ఆకలి రాకాసి కోరల్లో చిక్కుకుంటారా? అనుకుని వులిక్కిపడ్డాడు మోహన్.

లోన్నుంచి ఛాయా, సుజాతా, రమాదేవి బైటికొచ్చారు.

''వెళ్దామా'' అంది ఛాయ.

''ఒకే'' అన్నాడు మోహన్. జీపు వెళ్తూ అన్ని గుమ్మాల్నుంచి వెల్తురుని లోనికివంపుతోంది. జీపు చలనంతోపాటు ఆ దీపాలు కూడా ఆరుతూ మారుతూ వస్తున్నాయి.

వెలుతురు మాత్రమే చూస్తున్న ఛాయకి జీపుతోపాటే వెలుతురూ తమ వెంట వచ్చేస్తున్నట్లు తెలియడంలా.

మోహన్ ఛాయవంక చూశాడు. ఛాయలో ఇదివరకటి అందం లేదే. ఎందుకు తగ్గింది అనుకున్నాడు. పాపం తిరుగుడు కదా. ఆడపిల్లలు తోటకూర కాడల్లా వాడిపోతారు అనుకున్నాడు.

సుజాత వంక చూశాడు. ఏదో ఆలోచిస్తోంది సుజాత. మొదటికన్నా చాలా అందంగా కన్పిస్తోంది సుజాత. మరి ఈవిడా తిరుగుతోందిగా. అందం వాళ్ల మోహాలమీదగాక వాళ్లకి సంబంధించిన డేటాయిస్తున్న తన హృదయంలోంచి వస్తోందని అతనికింకా పూర్తిగా తెలియడంలా.

''సుందర్రావుగారికేమయ్యిందట... ఇవ్వాళ రాలేదు'' అంది ఛాయ.

''వంట్లో బాగోలేదని రానన్నాడు''

''ఈయనంటాడు మనం ముగ్గురమూ వచ్చాక కౌన్సిల్‌కి కౌన్సిల్ పనిగాక అందరి పర్సనల్ ఫీలింగ్సూ ముఖ్యమైపోయాయట మొన్నొకనాడు అన్నాడు''

''ఎప్పుడూ''?

''అదే... మీరిద్దరూ అన్నాసాగర్ వెళ్లారు అప్పుడు సాయంత్రం ఓ అరగంట ఆఫీసులోనే కూర్చున్నానేను. ఫీడ్‌బాక్‌పని చూసుకుంటూ

''నాకు సహాయం చేస్తానంటూ ఆయన కూర్చున్నాడు. అనవసరమైన బోల్డు మాటలు మాట్లాడాడు. చివరికీమాటన్నాడు. ''దానివల్ల కౌన్సిల్‌పని పాడవుతుందా?'' అన్నాన్నేను.

''అదేంలేదుగాని పనిలో సీరియస్‌నెస్ వుండటంలా''అంటాడు.

''మనం చేసేపనిలో మనకి విశ్వాసం వుండాలి అంటాడు''అంది ఛాయ.

''అది ఆయనభిప్రాయమేనా... నీక్కూడా వుందా?'' అంది సుజాత.

''వుంటే తప్పా?''

''మనం చేసేపనిమీద మనకి విశ్వాసమే గాక ఆ పనిమీద మనకో స్పష్టమైన అభిప్రాయం కూడా వుండటం మంచిది. మనకీ మన కౌన్సిల్‌కీ కూడా అది ఉపయోగంగా వుంటుంది'' అన్నాడు మోహన్.

''అంటే... స్పష్టమైన అభిప్రాయం లేకుండానే కౌన్సిల్ పని మొదలెట్టిందా?''

''కౌన్సిల్‌కి దాని ధ్యేయాలు, లక్ష్యాలు వంద వుంటాయి. అవి ప్రాక్టికల్‌గా వర్కవుటవుతాయా? అనేది మనం చూడాలి'' అన్నాడు మోహన్.

''కౌన్సిల్ ఒక లక్ష్యంతో, కొన్ని ధ్యేయాల్తో ముందుకొచ్చింది. వాటిని నిజం చెయ్యడానికి మనని తీసుకుంది. మనం ఎంతవరకూ ఆ పనిని నెరవేర్చగలం. ఇదీ మనముందు వున్న




ప్రశ్న. వుండవల్సిన ప్రశ్నాను'' అంది ఛాయ.

''అవును ఛాయా! నువ్వు అనుకునేది నువ్వు చెప్తున్నావు సరే. ఒక విషయం అడుగుతాను జవాబు చెప్పు'' అంది సుజాత.

''ఏమిటి?'' అంది ఛాయ.

''కొన్ని లక్ష్యాలతో కౌన్సిల్ ఒక ప్రోగ్రామ్ తీసుకుని ముందుకొచ్చింది. దానిలో పనిచెయ్యడానికి మనమొచ్చాం. అంతేకదా!''

''అవునూ''

''అంతమాత్రాన కౌన్సిల్ లక్ష్యమేదో మనమే నిర్ణయించినట్టూ, అది ఫెయిల్ అయితే అది మన తప్పే అయినట్టూ అనుకోవచ్చా? కౌన్సిల్ ఫెయిల్ అవడానికి లక్షకారణాలుండొచ్చు. మనం ఎఫెక్టివ్‌గానో, సిన్సియర్‌గానో పనిచెయ్యకపోతే అది వేరే విషయం మనం ఎవరమూ కూడా కౌన్సిల్‌పని చెయ్యకుండా కూర్చోడంలేదు. అయితే ఈ పనిలో మనం మెషిన్లలాగాకాకుండా కాస్త మనుషుల్లాగా ప్రవర్తిస్తున్నాం. అంతేగా! మనకి తారసపడే మనుషుల్ని వాళ్ల పరిస్థితుల్ని, వాళ్ల కష్టనిష్టురాల్ని గమనిస్తున్నాం. మనం వారికి చేస్తున్న సహాయాలు ఏమీలేవు. కాకపోతే మరీ ప్రయోగశాలల్లో కప్పల్నీ, కుందేళ్లనీకోసినట్లు మనం ఈ మనుషుల్ని కొయ్యడంలేదనేనా నీ కంప్లెయింటూ సుందర్రావుగారి కంప్లెయింటూను?'' అంది సుజాత.

''ఏమోబాబూ! ఎవళ్లిష్టమొచ్చినట్లు వాళ్లు చేసుకోండి. కాని నాకొకటే అనుమానం. అంత ఇష్టంలేని పనిచెయ్యడం ఎందుకు? ఎవరు బలవంతపెట్టారు?'' అంది ఛాయ అక్కసుగా.

''ఆ... అసలు విషయం'అదీ! ఈ ఉద్యోగం మాకిష్టంలేదనీ, అయినా మేం చెయ్యాల్సొస్తొందనీ ఒక్కరోజు కూడా నీతో అనలా. కాకపోతే ప్రతిరోజూ చూస్తున్న దరిద్రంతో, ఘోరాల్తో నిండిన ప్రజల కష్టాల్ని గురించి మాట్లాడకుండా అందరూ బాగానే వున్నారు, మన కౌన్సిల్‌వల్ల మరింత బాగవుతున్నారు అనుకోమంటావు నువ్వు అలా అనుకోవడం అంటే మనల్ని మనమే మోసగించుకోవడం అన్నమాట: మన కౌన్సిల్‌వల్ల అయ్యే పని కాదది. వూళ్లల్లో దరిద్రాల్ని తీసెయ్యడం కూడ మన కౌన్సిల్ పనికాదు. దానికి చాలా చిన్న లక్ష్యం వుంది. పిల్లలకి ఆరోగ్యం తల్లులకి చదువు ఇది కూడా కౌన్సిల్ అనుకున్నంత చిన్న పనికాదు. మన దేశంలో ప్రతి సమస్య పరిష్కారమూ మరో సమస్యలో చిక్కుపడి వుంటుంది. అన్ని సమస్యలకీ పరిష్కారం గురించి ఆలోచిస్తేగాని, ఏ సమస్యా పరిష్కారం పొందలేదు. అందువల్ల మనం ఏదో చెయ్యలేదనీ, ఏదో చేస్తున్నామనీ అనుకోడం అనవసరం. ఉద్యోగం అంటావా... నువ్వెలా చేస్తున్నావో నేనూ అలానే చేస్తున్నాను'' అంది సుజాత.

''నేనేదోవూరికే అంటే....'' అంది ఛాయ.

''నేనూ వూరికే అంటున్నాను'' అంది సుజాత.

ముగ్గురూ నవ్వారు.




జీపు పొలిమేరల్లో ప్రవేశించింది.

''ఇప్పుడెళ్ళి వంటేం చేసుకుంటారు. నా అతిథులుగా మా రమణమ్మగారి దగ్గరకు రాగూడదూ?'' అన్నాడు మోహన్ సుజాత వంక చూస్తూ...

''అమ్మయ్య... ఇప్పుడు మీరు దేవదూతలా కన్పిస్తున్నారు నాకు! ఇప్పుడెళ్ళి ఇక స్నానాలూ జపాలూ వంటలు తిళ్లూ... ఎట్లాగురా భగవంతుడా అనుకుంటున్నాను. బతికించారు. ఇట్నించిటేవెళ్దామా?'' అంది ఛాయ.

''ఏయ్... ఏమిటాతొందర, స్నానాలు కూడా చెయ్యకుండా, ఈ మట్టి బట్టల్తో మట్టి మొహాల్తో వెళ్దామా?'' అంది సుజాత.

''అబ్బ... నీ శుభ్రం సంగతి తెలుసులేవేయ్. మోహన్‌గారూ... మీరెప్పుడొచ్చి పిలిస్తే

అప్పుడు తయారుగావుంటాం భోజనానికి'' అంది ఛాయ.

''సరే... నేనూ స్నానంచేసి వస్తాను. మీరు రెడీగా వుండండి'' అని వాళ్లిద్దర్నీ వాళ్లఇంటి దగ్గర దింపి, ''షఫీ- రమణమ్మగారితో మేం ముగ్గురమొస్తున్నామని చెప్పివెళ్లు'' అని తన రూం దగ్గర దిగిపోయాడు మోహన్.

అతను స్నానం చేసి తెల్లలాల్చీ, పైజామా వేసుకుని వీళ్ల ఇంటి కొచ్చాడు. ఛాయ స్నానం చేసి గులాబీరంగు చీరకట్టుకుని తలదువ్వుకుంటూ కూర్చుంది. మోహన్ని చూడగానే- ''రండి... సుజాత స్నానం చేస్తోంది. వచ్చేస్తుంది. అయిదు నిముషాల్లో బైల్దేరదాం!'' అంది.

''ఏంఫర్లేదు. పదినిముషాలయినా కూర్చుంటాను. ఖంగారుపడకండి'' అన్నాడు మోహన్ కూర్చుంటూ.

''ఏంటోనండి... వంట ఇంట్లోకెళ్ళడమంటే నాకు గొప్పచిరాకు... ముఖ్యం ఆ అంట్లూ అవీ తోముకోవడం'' అంది ఛాయ.

''పనిమనిషి లేదా?''

లేదు... ఇద్దరికోసం పనిమనిషెందుకు అంటుంది. సుజాత. ఒకరకంగా చూస్తే నిజమేననుకోండి... పెద్దపనీవుండదు.''

''కనీసం అంట్లు, బట్టలు కోసమైనా మాట్లాడుకోండి''

''నేనూ అదే అన్నానండి. కాని ఆ రెండు పనులూ వాళ్లు చేసి వెళ్లాక మళ్లీ సుజాత చేస్తుందట! వాళ్లు శుభ్రంగా చెయ్యరట.

సుజాత తెల్లచీర కట్టుకుని తలదువ్వుకుంటూ వచ్చిందప్పుడే.

''నిజమేనా?'' అని అడిగాడు సుజాతని మోహన్.

''ఆ... నాకు నచ్చదు. మన అంట్లు వాళ్లు తోమడం, మన మైలబట్టలు వాళ్లు వుతకడం,...'' అంది సుజాత.

''బైల్దేరదామా?'' అంది ఛాయ.

ముగ్గురూ బైల్దేరారు. రోడ్డువెంట ముగ్గురూ నడిచివెళ్తోంటే, వెళ్లే ప్రతివారూ వీళ్లని చూసి మరీ వెళ్తున్నారు.

''ఎందుకలా ఆగాగి చూస్తారు'' అంది ఛాయ చిరాగ్గా.

''అందమైన అమ్మాయిల్ని చూడకుండా ఎందుకెళ్లాలి?'' అన్నాడు మోహన్.

''మీరూ ఆగి, చూసి వెళ్లేవాళ్లేనన్నమాట''

''ఆ... తప్పకుండా''

నవ్వుకుంటూ వెళ్తున్నారు ఏదో సినిమా బొమ్మకనపడితే-

''భోంచేసి సినిమాకెళ్దామా?'' అన్నాడు మోహన్.

ఛాయ ఆవలించింది. ''అమ్మో... నాకిప్పుడే నిద్రొస్తోంది. భోంచేసేదాకా అనుమానమే'' అంది.

''సినిమాకొద్దులెండి. భోజనంచేసి ఎలాగోలా ఇల్లుచేరండి రమణమ్మగారి మంచమ్మీద పడి నిద్రోకుండా'' అన్నాడు మోహన్.

మోహన్ ఆమాట నవ్వుతూనే అన్నప్పటికీ భోజనం సుష్టుగా చేశాక రేరాణి పరిమళాలతో పెరట్లో మంచమ్మీద కూర్చున్న ఛాయ రెండు మాటలు కూడా మాట్లాడకుండానే నిద్రలోపడింది.

''పడుకో... వెళ్లేప్పుడు లేపుకుని మోసుకుని తీసుకునివెళ్తాలే'' అనే సుజాత మాటల్ని కూడా పూర్తిగా వినలేదు.

''మీకీ రాత్రి సమయంలో అదనంగా పనిపెట్టామేమో?'' అంది సుజాత.

''అదేంలేదమ్మా! ఇవ్వాళ రావల్సిన ముగ్గురురాలా! అంతలోనే మీ డ్రైవర్ చెప్పాడు మోహన్సార్ ఇద్దరు గెస్టులని తీసుకొస్తున్నాడని గెస్టులంటే ఎవరో వూర్నించి వచ్చారేమోననుకున్నా. తీరా చూస్తే మీరిద్దరూను? ఇవ్వాళ ఈ పెరటికి చూడు ఎంతందమొచ్చిందో మీ ఇద్దరితో...'' అంది రమణమ్మగారు.

రమణమ్మగారన్న చివరి మాటతో సిగ్గుపడిపోయింది సుజాత.

''అంటే నేనొచ్చినప్పుడులేని అందం పెరట్లోకి వీళ్లొచ్చేసరికి వచ్చిందన్నమాట'' అన్నాడు మోహన్. అతని మాటల్లో వుడుకుమోత్తనానికి సరదాగా నవ్వింది రమణమ్మగారు.

''ఎలానైనా మొక్కలూ, పూలూ ఆడపిల్లల్ని

చూసే ఆనందిస్తాయిలే మోహన్...'' అంది

''ఎందుకూ... కోసి తల్లో పెట్టుకుంటా రనా?''

''ఏమో... అలా తమ జన్మసాఫల్యమైందనే నేమో?''

''ఏమిటి... మీరు పుష్పవిలాపం చదవ లేదా?'' అని కేకేసినట్టు అన్నాడు మోహన్.

'పుష్పవిలాపం' అనేమాట రమణమ్మగారిని ఎక్కడెక్కడికో తీసికెళ్ళింది.

ఆలోచనలో పడిపోయిన రమణమ్మగారి ముఖం చూస్తూ అలానే వుండిపోయింది సుజాత.

''నేనేమన్నా బాధించానా?'' అన్నాడు మోహన్.

''లేదబ్బాయ్. పుష్పవిలాపం మా ఇద్దరికీ ఎంతలానచ్చేదో. ఎన్నిసార్లు పాడినా ఇంకా



ఇంకా అని మారం చేసి పాడించుకునేవాడు చౌదరి! అదయ్యాక మరొకటి, అదయ్యాక మరొకటి... అలా ఎన్నిపాటలు ఎన్నిపాటలు... ఏమైపోయినాయి ఆ రోజులన్నీ'' ఆగిపోయింది రమణమ్మ.

రమణమ్మగారి విషయం సుజాతకి మోహన్ ఎప్పుడో చెప్పాడు.

సుజాత తన కుర్చీలోంచి లేచి వెళ్ళి రమణమ్మగారి మంచంమీద ఆమె పక్కన కూర్చుంది. ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుని నిమురుతూ "నాకోసం మీరా పాటలు ఇప్పుడు పాడాలి'' అంది.

మబ్బుల్లోంచి వక్కమారుగా చంద్రుడు బైటపడ్డాడు. పెరడంతా వెన్నెల. పూలన్నీ తల లూపాయి అవునవునన్నట్టు.

''ఇప్పుడెందుకులే... పాపం ఆవిడకదంతా గుర్తుచెయ్యొద్దు'' అన్నాడు మోహన్.

''ఏమిటి మోహన్ మీరు మరీను. ఎందుగ్గుర్తు చేసుకోగూడదు. అదేమన్నా చేదు జ్ఞాపకమా! ప్రేమమయమైన జీవితం వుండటం సామాన్యమైన విషయమా? ఏ ప్రేమలేకుండా ఎందరి జీవితాలు ముగిసిపోతున్నాయో? ప్రేమతో నిండిన జీవితం గురించి పదే పదే గుర్తుకు తెచ్చుకోవాలి! రమణమ్మగారు మిగిలినవారికన్నా ఇంత భిన్నంగా వున్నదెందుకనుకుంటున్నారు? తన జీవితంలో ప్రేమని తెల్సుకుని వుండటం వల్లనే. ఆరోజుల్ని పదేపదే గుర్తుకు తెచ్చుకోవడం వల్లనే! పాడండి... నాకోసం'' అనే సుజాతని రమణమ్మ దగ్గరకు తీసుకుంది. ''ఇంత చిన్నదానివి... నీకిన్ని విషయాలెలా తెలుసమ్మా?'' అంది.

''ఇంకానయం! నాకేం తెల్సు... మీతో పోలిస్తే మేమెక్కడుంటాం'' అంది సుజాత.

''భలేదానివే మొత్తానికి'' అని నవ్వింది రమణమ్మగారు.

''సర్లే... మీరు మమ్మల్ని మాటల్లోపెట్టి మరిపించాలనుకుంటున్నారు. ముందు పాటలు, తర్వాతే మాటలు'' అంది సుజాత మారం చేస్తున్నట్టు.

''ఇప్పుడొద్దులేమ్మా... తర్వాతెప్పుడన్నా పాడుకుందాం''

''ఆ...ఇప్పుడు నాలుగు పాటలు పాడండి. తర్వాత అన్నీ పాడుకుందాం''

''అయితే నువ్వొకటిపాడు, తర్వాత నేను పాడతా!''

నవ్వింది సుజాత.

''నాకు పాటలొచ్చివుంటే ఇందాక మీరు విన్న మాటలన్నీ వేరేగా వుండేవి''

''ఎలా?''

''ముందు నా పాటలు వినండి. తర్వాత మీరు మాట్లాడుదురుగాని... ఇలా''

ముగ్గురూ నవ్వారు.

''ఎందుకూ పాడవా?''

''పాడననిగాదు... పాటలు రావు. పాడటంరాదు. అయినా కూని రాగాలు తియ్యకుండా వుండను. ఇకచాలు పాడండి''

''సరే... మోహన్ అమ్మాయి వదిలేలాలేదు. రెండు పాటలు పాడ్తాను'' అంది రమణమ్మ.

''భలేవారే! మీరెప్పుడు పాడతారా అని నేను చూస్తోంటే...''

''అంత చూసేవాళ్లు ఒక్కపాటన్నా పాడించరూ?''

''నిజమే... తప్పే. చెంపలేసుకుంటున్నాను.''

''వినపడ్డంలా! గట్టిగా వేసుకోండి''

నవ్వుతూ రమణమ్మ- ''నేనొక పూలమొక్కకడనిలిచి...'' అని పాట మొదలుపెట్టి పూర్తిగా పాడేసింది.

ఆమె కంఠంలో మధురిమలు...

సుజాత అంది- ''ఇక నేనెప్పుడూ పూలని కొయ్యను. తల్లోపెట్టుకోనండీ రమణమ్మగారూ.''

''అయ్యో! ఈ వక్కసారీ నేనిచ్చినందుకన్నా పెట్టుకోమ్మా'' అని మాలకట్టి వుంచిన పూలను సుజాత తలలో కూరింది.

''మీమాటకి విలువివ్వాలో, పాటకి విలువివ్వాలో తెలీడంలేదు'' అంది సుజాత.

నవ్వింది రమణమ్మ.

''మరొకటి పాడండి'' అంది సుజాత వినడానికి రెడీ అయిపోతూ.

''ఒంటిగా వుయ్యాల లూగితివ క్రిష్ణా,




జంటగా నను బిల్వగదోయి'' అని పాడింది రమణమ్మ.

అబ్బ... ఎంత మధురంగా వున్నాయో మీ పాటలు... ఇంకొకటి పాడండి'' అన్నాడు మోహన్.

అవునండీ... నేనయితే ఇక ప్రతిరోజూ సాయంత్రాలు ఈ ఇంట్లోనే వుండి మీ పాటల్తో కడుపూ, మనసూ, నింపు కోవాలన్పిస్తోంది. పాడండి... ఆపకండి...'' అంది సుజాత.

''పిచ్చిపిల్ల...'' అని ''నామాట తెలుపవే నా రాజుతోటి మా మనసులను కలుపు మా కాశిరాణి''

అని మొదలుపెట్టి రమణమ్మగారు ఆ వెన్నెల రాత్రి, ఆ పూల మధ్యన అలా పాడు తోంటే సుజాతా- మోహన్ తామెక్కడున్నారో తెలియనంతగా మైమరచిపోతూ వింటున్నారు.

''వలపు మాటలకెంత శిలలైన కరగునే'' అని రమణమ్మగారు పాడుతోంటే హృదయపు లోలోతుల్లోంచి ప్రేమ పొంగగా అప్రయత్నంగా మోహన్ వంక చూసింది సుజాత.

మోహన్ కనుల్లోంచి ప్రేమకాంతి వెన్నెలతో కలసి ఓ ప్రవాహంలా సుజాత హృదయాన్ని తాకింది.

రమణమ్మ ఆ పాట పాడి రెండు నిముషాల్లో వస్తానంటూ లోనికెళ్ళింది.

సుజాతా మోహన్లు అలా ఒకర్నొకరు చూసు కుంటూ, ఒకరి కళ్ళలోకి ఒకరు చూస్తు ఎప్పు డూ అనుభవించనటువంటి ఒక వింత అను భూతిని పొందారు.

రమణమ్మగారు మూడు గ్లాసులలో మామిడి రసం తీసుకొచ్చి వాళ్లిద్దరికీ చెరో గ్లాసు ఇచ్చి తనూ ఒక గ్లాసు తీసుకుంది.

''మీకీ పాటలన్నీ నోటికెలావచ్చో నాకర్థంగా వడంలేదు'' అన్నాడు మోహన్.

''ఒక్కోపాటా ఎన్ని సార్లు పాడివుంటారో గదా!'' అంది సుజాత.

నవ్వింది రమణమ్మ.

''మీకంఠం చాలా అద్భుతంగా వుందండీ. ఎంత సున్నితమైన భావాలు ఎంతెంత సున్ని తంగా పలుకుతున్నాయో మీకంఠస్వరంలో'' అంది మళ్లీ సుజాత.

''అప్పుడప్పుడు పాడుతూండాలి మీరు'' అన్నాడు మోహన్.

''మోహన్ ఆవిడ అప్పుడప్పుడు పాడుకో కుండా వుండదు'' అంది సుజాత.

''అది నీకెలా తెలుసు'' అంది రమణమ్మ నవ్వుతూ.

''నాకు తెలుసులెండి'' అంది గర్వంగా సుజాత.

ముగ్గురూ సంతోషంగా నవ్వారు.

''చాలా పొద్దుబోయింది. మరి వెళ్దామా? అంది సుజాత!

''అదే. మరి ఛాయగారు''

''లేపుదామా?'' అంది సుజాత.

''ఎందుకమ్మా యింత రాత్రి. నిద్రపోయే పిల్లనిలేపడం నువ్వూ యిక్కడే వుండిపో!'' అంది రమణమ్మగారు.

''మరి నేనొక్కడ్నే వెళ్లాలా?'' అన్నాడు బిక్క మొగంతో మోహన్.

''పోనీ నువ్వూ వుండిపో అబ్బాయ్! యిక్క డే మంచాలు వేసుకుందాం. హాయిగా గాలివ స్తుంది....'' అంది రమణమ్మ.

''కాదులెండి... వెళ్లాలి'' అన్నాడు మోహన్.

''అవును. సరే ఛాయ యిక్కడే వుంటుంది లెండి. పొద్దున్నే లేచొస్తుంది! మేం వెళ్తాం'' అని బైల్దేరింది సుజాత.

''జాగ్రత్తమ్మా. జాగ్రత్తగా తీసికెళ్లబ్బాయి అమ్మాయిని'' అంటూ వీడ్కోలిచ్చింది రమణ మ్మ.

''మీ పాటలు విన్నాక యిక మమ్మల్ని ఏదుష్టశక్తి ఏమీ చెయ్యలేదులెండి'' అంటూ నడిచింది సుజాత.

''బజార్లన్నీ దాదాపు నిర్మానుష్యంగా వున్నాయి. సైకిల్ మీద ఒకరో ఇద్దరో వెళ్తున్నా రు అక్కడక్కడ.

ఎవరో ఆపకుండా నవ్వుతున్నారు.

చంద్రుడు చాలా జాగ్రత్తగా కనిపెట్టి చూ స్తున్నాడు వీళ్లవంక. రోడ్డుకటూఇటూ వున్న చెట్లు కూడా చల్లని గాలుల్ని పంపుతున్నాయి.

ఇద్దరూ నెమ్మదిగా నడుస్తున్నారు. ఇద్దరి మనసుల్లోనూ ''ఒంటిగా వుయ్యాలలూగితివా.

జంటగా నను బిల్వగదోయి'' మారుమోగు తోంది.

''నా మాటతెలుపవే' అని కూనిరాగం తీసింది సుజాత మనసు.

''వల పు మాటలకెంత శిలలైనా కరుగుతా యట కదూ'' అన్నాడు మోహన్.

సుజాత మోహన్ వంక చిలిపిగా చూస్తు- ''అవును... శిలలు కరుగుతాయటలే. మనుష లు... ముఖ్యంగా మగమనుషులు కరగరు'' అంది.

''అదేమిటి? ఆ పాట నీకలా అర్ధమైందా! మనుషులదేముంది? శిలలేకరుగుతాయి. శిల ల్లాటి మనసులు కూడా వలపు మాటలకి కరుగుతాయి అని అర్ధం'' అన్నాడు మోహన్.

''ఒహెూ... అలానా'' అని వెక్కిరించింది సుజాత.

''ఏయ్'' అని బెదిరించాడు మోహన్.

''ఏంచేస్తావ్'' అంది సుజాత.

''నిన్నొదిలి పారిపోతా!''

''అంత భయమా నేనంటే''

''ఛీ... అదిగాదు. నేను వెళ్ళిపోతే నువ్వు భయపడతావని!'' అన్నాడు మోహన్.

''నువ్వెళ్ళిపోతే ఎందుకు భయం! ఒకవేళ భయపడితే నువ్వున్నందుకు భయపడాలి? నిన్నుచూసి భయపడాలి''

''అంటే ఏంటి నీ ఉద్దేశం''

''అయ్యో చాలా స్పష్టంగా శుద్ధవ్యవహారి కంలో చెప్పానే. దీనికి కూడా టీకాటిప్పణి తాత్పర్యం...''

''అబ్బబ్బ! అవు... అయితే నన్ను చూసి భయపడ్తున్నావన్నమాట!''

''లేదు... ఒకవేళ భయపడితే అన్నాను''

''అయితే నేనంటే భయంలేదన్నమాట!''

''నువ్వంటే భయమెందుకోయ్'' అంది సు జాత. అన్నతర్వాతగానీ తాము ఆరోజు సాయంత్రం కూడా మీరు అండీలో గౌరవించు కున్నట్టూ యిప్పటికిప్పుడు నువ్వుల్లోకి దిగి ఏమోయ్ల్లోకూడా వెళ్తున్నట్టూ గుర్తొచ్చింది. ఒక్కసారిగా మనసుకీ మనసుకీ మధ్యవున్న తెరలు విడవడి ఇద్దరూ ఒక్కటైన అనుభూతి.

మోహన్ కూడా అప్పుడే ఆ విషయం గమనించాడు. తనుకూడా 'నువ్వు నువ్వు' అంటున్నాడు ఇందాకట్నుంచి.

''సుజాత! ఇందాకట్నుంచి ఏకవచనంలోకి దిగాను. ఏమి అనుకోవడంలేదు గదూ!'' అన్నాడు.

సుజాత చిరునవ్వులు నవ్వుతూ- ''మనమ ధ్య ఇంకా ఈ మర్యాదలు మన్ననలు వున్నా యిగాని మనమనసులకున్నట్టులేవు'' అంది.

''అవును సుజా... ఇవ్వాళ నాకెంత ఆనందంగా వుందో తెలుసా'' అన్నాడు మోహన్.

''తెలుసు... నాకూ అంత ఆనందంగానే వుంది'' అంది.

''ఎందుకీ ఆనందమంతా? ఇదంతా నిజ మేనా? ఏదో కలలో జరుగుతున్నట్టుగా... ఎలా గోవుంది నాకు'' అన్నాడు.

''అవును... కలల లోకాల్లో విహరిస్తున్నట్లుగా వుంది. కాని... మోహన్... ఇది కలకాదు గదూ'' అంది సుజాత.

''కాదు... అందమైన కలవంటి అను భూతి'' అంటూ సుజాతకి కాస్త దగ్గరగా జరిగి నడుస్తున్నాడు.

సుజాత... ''మోహన్'' అంటూ అతని చే తిని తన చేత్తో పట్టుకుంది.

''సుజా... ఈ చేతిని అలానే పట్టుకో. జీవి తాంతం వదలొద్దు'' అన్నాడు.

''ఊఁ'' అంది సుజాత భారంగా.

ఇద్దరి మనసులు పరవశం చెందుతు న్నాయి. ఇద్దరి శరీరాల్లో కొత్త జీవశక్తేదో పరుగు లు తీస్తోంది.

అతని భుజానికి తగుల్తూ సుజాత చె క్కిలి... వాళ్లు నడుస్తున్నారో లేదో వారికే తెలీ దు. ఒకవేళ నడుస్తోంటే ఎలా నడుస్తున్నారో కూడా తెలీదు.

నెమ్మదిగా సుజాతా వాళ్లిల్లు దగ్గరకొచ్చింది. సుజాతలోనికెళ్ళింది. సుజాత నడుంచుట్టూ మోహన్ చెయ్యి... అందువల్ల మోహన్కూడా లోనికెళ్ళాడు. గదిలోకెళ్లగానే తనివితీరని తమకంతో ఒకర్నొకరు ముద్దులతో ముంచెత్తు కున్నారు. ఒకర్నొకరు కౌగిలిలో బంధించుకు


కన్స్యూమర్ ఎలెక్ట్రానిక్స్‌లో
అత్యంత నమ్మకమైన పేరు
Solidaire
Solidaire
Colour and B & W TVs
Insight-DE-528


CTS 606


CAT 1000SE

న్నారు. మధురమైన నిట్టూర్పులతో ఆగారు. ఒకర్నొకరు కళ్లు ఇంతింతచేసుకొని చూసుకు న్నారు. కనులలోనుంచి ప్రేమ హృదయాల్లోకి ప్రవేశించింది. అలా ప్రవహించిన ప్రేమ వారి శరీరాల్ని విపరీతమైన మోహంతో కాల్చివే సింది.

''మంచినీళ్లు కావాలి'' అన్నాడు మోహన్.

చిలిపిగా చూసింది సుజాత.

''అమృతం గ్రోలుతూ మంచినీళ్లుకావాలా'' అని అతని నెత్తిమీద మెల్లిగా కొట్టింది. లోనికె ళ్ళి ఓ గ్లాసుతో చల్లటి నీళ్లు తెచ్చిచ్చింది.

అతను పిచ్చెత్తినవాడిలా, ఏమిచెయ్యాలో ఏమి చెయ్యగూడదో తెలియని వాడిలా సు జాత వంక చూస్తూ గ్లాసందుకున్నాడు. గబ గబా సగం నీళ్లుతాగాడు. సుజాత గ్లాసందు కుని అవతలపెట్టింది. అతను ఏమాత్రం ఆలస్యాన్ని భరించలేనట్టు సుజాతని గట్టిగా కావలించుకున్నాడు. ఇద్దరూ చిన్నపిల్లల్లా ఒక రిమీదకొకరు దొర్లారు. నవ్వులు. ఆయాసం కొత్త అనుభవం. శరీరానికి ఇంత ఆనందాన్నేం చేసుకోవాలో తెలీక తేలికయిపోయింది. అంత లోనే భారంగా... ఆమె సహజసౌందర్యాన్ని చూసి అతనూ; అతని అందాన్ని చూసి ఆమె మనసు నింపుకున్నారు. ఆమె వక్షంమీద మొ ఖందాచుకొని అలానే వుండిపోయాడు మోహన్. అతని తలలో చిత్రంగా వేళ్లు కదుపు తూ అతని చెంపల్ని నిమురుతూ, అతని ముఖాన్ని తన వక్షానికదుముకుంటూ వుండిపో యింది సుజాత!

అతను తలెత్తి ఆమె కనుల్లోకి పరీక్షగా చూశాడు తన అనంతమైన ప్రశ్నలకి సమాధా నాలకోసం వెతుకుతున్నట్టు!

అతని కళ్లలోకి ఆమె చూసింది యుగయు గాల విరహాగ్నిని చల్లబర్చేలా!

అతను ఆమె చెక్కిళ్లను పెదవుల్ని కళ్లని ముక్కుని చెవుల్ని తలని కంఠాన్ని అలా అలా ముద్దుల్తో నింపేస్తూ ఆవేశంతో... ఆయా సంతో ప్రయాణించేశాడు.

ఆనందంతో, పులకరింపుల్తో, చక్కిలిగింత ల్తో, శరీరమంతా ఎగిసిఎగిసి పడుతుంటే అత న్ని వారిస్తూనే రెచ్చగొట్టింది సుజాత. అలా వారు ఆ రాత్రంతా... రాత్రి రాత్రంతా ఆనంద నాట్యాలాడారు. వారి శరీరాలు ఐక్యమయి తన్మయాలయ్యాయి. వారి మనసులేగాక శరీ రాలు కూడా ఒకరివి ఒకరికి పరిచయమయి, అవగతమైనాయి.

తెలతెలవారుతోంది. ఎప్పటిలా మళ్లీ తెల వారబోతోంది. కాని నిన్నటిలా లేదు నేడు. కొత్త ఉదయం నూతనోత్తేజం. కొత్తకాంతి కనుల్లో, తనువుల్లో, మనసుల్లో- సరికొత్త కాంతి... ప్రేమ కాంతి.

మోహన్ నెమ్మదిగా ఈ లోకానికి దిగుతున్నా డు. ''సుజా! మనం తొందరపడ్డామా'' అన్నా డు.

సుజాత అతన్నే మైమరచిచూస్తోంది.

''నువ్వేంబాధపడకు సుజా!'' అన్నాడు మోహన్.

''ఛుప్'' అంది సుజాత. నెమ్మదిగా కళ్లతోనే మందలించింది.

''నీకేమీ దిగులుగా లేదుగా'' అన్నాడు మోహన్. ఒకవేళ సుజాత ఏమన్నా దిగులుప డ్తోంటే పోగొట్టాల్సినవసరం బాధ్యత తన మీద వున్నాయి అనుకుంటున్నాడు మోహన్.

''దిగులా... ఎందుకు?'' అంది. ఆమె గొంతులోంచి ఆ పదాలు అమృతాన్ని తాగిన ట్టు మెత్తగా, మత్తుగా బైటకొచ్చాయి.

''పెళ్ళికాకుండానే...''

''ఊరుకో... మనకు పెళ్ళిఅయిపోయింది. రాత్రే నేను నీ పాణిగ్రహణంచెయ్యాలా'' అంది.

అతనికి ఆమె, ఆమెకి అతను ఎప్పటికన్నా అందంగా, అందరికన్నా అందంగా కనబడ్డా రు. ఆ అందాన్ని వాళ్లు ఒకరినొకరు ఇచ్చుకు న్నారు... పుచ్చుకున్నారు.

ఒకరియెడల ఒకరికి కృతజ్ఞతతో, దయతో, కరుణతో, ప్రేమతో హృదయాలు నిండిపో యాయి.

తెల్లవారుతోంది.

''ఛాయ వస్తుందేమో'' అన్నాడు మోహన్.

''అవును... ఛాయ... పాలతను... ఇక ఒకరొ కరుగా అందరూ వస్తారు. మనల్ని విడదియ్యా డానికి'' అంది సుజాత.

ఆమెకి అలా జీవితాంతమూ... తమని వేరు





చేసేవారు లేకుండా అలానే వుండిపోవాలని వుంది.

కాని వున్నారు. చుట్టూ లోకంవుంది. అది వారికీతెలుసు.

ఈ ఒక్కరాత్రితో మనం ఎంత సన్నిహితుల మయిపోయాం. ఎన్నో జన్మల్నుంచి మనం ఒకరికొకరం తెలుసన్నట్టు, ఒకరికోసం మరొకరం జన్మించినట్టూ అన్పించడంలా'' అంది.

''అవును'' అన్నాడు మోహన్.

ఛాయ వచ్చి తలుపుకొడ్తోంది.

''వస్తున్నాం వుండు'' అంటూ లేచింది సుజాత. శృంగార దేవతలా మిల మిలా మెరుస్తూ ఆమె అలా నిలబడి వుంటే మోహన్ మనసు ఆనందంతో, వుద్రేకంతో పిచ్చిగంతులేసింది.

''ఆఁ... అలా చూడకు. ఇప్పుడిక నువ్వెన్ని వేషాలేసినా లాభం లేదు. బైట ఛాయ...'' అంటూ సుజాత వెళ్ళి తలుపుతియ్యగానే కొత్త కళాకాంతులతో వెలిగిపోతున్న సుజాతని చూసి ఆశ్చర్యపోయిన ఛాయ సుజాత వెనకే వున్న మోహన్‌ని చూసి గతుక్కుమంది.

''గుడ్‌మార్నింగు'' అంటూ తనని దాటి వెళ్ళిపోయిన మోహన్ని చూస్తూ ''ఈయనెప్పుడొచ్చాడు?'' అంది ఛాయ.

నవ్వింది సుజాత రావడానికెప్పుడెళ్లాడు- అన్నట్టు.

''ఏమిటి...?'' అంది ఛాయ- ఏమని అడగాలో తెలియక.

''ఏమిటీ ఏమిటి?'' అంది సుజాత కవ్వింపుగా.

''రాత్రి ఏదో జరిగినట్టేవుందే'' అంది ఛాయ కాస్త ఇబ్బందిగా.

''ఆ... అవును. ఏదో జరిగినట్టేవుంది'' అంది సుజాత మళ్లీ.

''ఇంత పొద్దున్నే వచ్చేశావే! నెమ్మదిగా టిఫిను అదీ తినొస్తావను కున్నాను'' అంది సుజాత కావాలనే.

''నేనొచ్చి మీ ఏకాంతాన్ని చెడగొట్టినట్టున్నాను'' అంది ఛాయ.

''అవును... కాని పాలతను కూడా వస్తాడుగా ఇక!'' అంది సుజాత.

''బుట్టలో పడ్డాడా?'' అంది కర్కశంగా ఛాయ. అన్నాక అన్పించింది అంత కర్కశంగా ఎందుకన్నానా అని.

కిలకిలా నవ్వింది సుజాత. ఛాయని కావలించుకుంది. చెక్కిళ్ల మీద ముద్దు పెట్టుకుంది. ''పిచ్చిపిల్లా! ఏమని అడగాలో కూడా తెలవడంలేదు. కదూ. ఇద్దరమూ వలలో... ప్రేమవలలో పడిపోయాం. రాత్రంతా ఆ చిక్కుల్లోంచి తప్పించుకోటానికి ప్రయత్నించి, మరింత చిక్కుకుపోయాం. ఇక లాభం లేదు... నీ స్నేహితురాల్ని అతను కొట్టేసినట్టే'' అంది.

ఛాయకి ఇంకేమి అడగాలో తెలవలా కాని.... అంది.

''పెళ్ళికాకుండా అంత తొందర పనికిరాదు! మోహన్ అలా చేస్తాడనికాదుగానీ.... రేపేదన్నా అవాంతరం వచ్చి....''

''ఆపు... తెల్సు. ఈరాత్రికోసం జీవితంలో ఎంత ఖరీదునైనా చెల్లిస్తా''

''మంచిదికాదనేగాని...''

''పోనీవోయ్... ఏమీకాదు. నా మోహన్, నేనూ వేరుగా అయి బతకం.... బతకలేం''

''మరి మీవాళ్ళుగ్గానీ, వాళ్లవాళ్లగ్గానీ ఇష్టం లేకపోతే...''

''అబ్బ... పొద్దున్నే ఏం లెక్కలోయ్? అవన్నీ చేసుకోవటానికి పగలంతా వుందిగా?''

''ఇంత సీరియస్ విషయం నీకంత తేలిగ్గా ఎలా వుందో అర్థం కావడంలా. మీ ఇద్దరిదీ ఒక కులం కూడా కాదు..... తెలుసా?''

''అవునా? నాకు తెలీదు. కాని.... నా కులం నీకెలా తెలుసు. నేనెప్పుడూ అనలేదే''

''మా ఇద్దరివి కూడా ఒకటికాదు'' అంది అసందర్భంగా ఛాయ.

కొన్ని అసందర్భాలు కొన్నికొన్ని విషయాల్ని భలేగా పట్టిస్తాయి.

కౌన్సిల్‌లో చేరిన మొదటిరోజుల్లో ఛాయ చాలా ఎక్కువగా మోహన్ గురించి మాట్లాడేది. అతని అందం, అతని గుణం, అతని మాటలు, అతని ఆర్గ్యుమెంటు.... సుజాతకి బోర్‌కొట్టేలా మాట్లాడేది ఛాయ. ఉన్నట్టుండి అతని విషయాల్ని మాట్లాడ్డం మానేసింది... అతని పట్ల ఆసక్తి చూపించడం మానేసింది.

బహుశా కులాలు తెల్లాకేనేమో అనుకుంది సుజాత. లోన చిన్న చిరునవ్వొకటి మొలిచింది.

"అసలీ కులాల పిచ్చేమిటి నీకు?" అంది సుజాత.

"సుజాతా... ఆదర్శాలు చెప్పారు. వినడానికవి బాగానే వుంటాయి. ఎవరికన్నా చెప్పడానిక్కూడా బాగానే వుంటాయి. కాని ఆచరించడానికవంత సుఖంగా వుండవు. మనం కులాలు వద్దనుకున్నా కులాలు మనల్ని పట్టుకుని వదలవు. కులాల్ని పట్టుకుని ఎప్పటికప్పుడు పెద్దలు మనల్ని వదలరు. ఎందుకే రొంపిలో చిక్కుకుపోవడం? నీకిష్టమే.... నీకన్నా తక్కువ కులంవాణ్ని పెళ్ళి చేసుకోవడం. కాని మీ అమ్మానాన్నలకి, పెద్దవాళ్ళకి ఇష్టం వుంటుందా? నీకేంతక్కువని తక్కువకులంవా

ణ్ని పెళ్ళిచేసుకోవాలి? నేనే కాదు.... మీ పెద్దలు కూడా ఇదే అడుగుతారు. నీ దగ్గర దీనికి జవాబులేదు. మీవాళ్లు నీకు బోల్డంత ఆస్తి కట్నంగా ఇస్తారు. మోహన్‌కేముంది? ఏ ఫారెన్ రిటర్న్‌డ్ డాక్టర్నో పెళ్ళిచేసుకోవచ్చు. ఈ వుద్యోగం పోతే మోహన్ లిటరల్‌గా రోడ్డుమీద నిలబడాలి. నాదేంవుందిలే.... స్నేహితురాల వని చెప్పడమేగాని. మీ నాన్న వూరు కుంటాడా? ఈ పెళ్ళి జరిగేది కాదు. ఇప్పుడు నీ శీలం....''

''ఆపు ఛాయా... ఆపు..'' అని అరిచింది సుజాత.

''సరే.... నా విషయాలు నేను చూసు కుంటాలే. ఇక రొచ్చులోకి నన్ను ఈడవకు! నీ పని నువ్వు చూసుకో! నువ్వు మాత్రం నాలా ఎప్పుడూ అవివేకంగా ప్రవర్తించకు... బాధలు పడ్తావ్. అయినా నువ్వు చాలా జాగ్రత్తగలదాని విలే. లెక్కలేనుకుని మరీ అడుగుతీసి అడుగే స్తావ్! నీ గురించి నేను దిగులుపడక్కర్లా'' అంది సుజాత.

సుజాత మనసు గిలగిలలాడింది. అంత మధురమైన రాత్రి తర్వాత ఇంత తుక్కు సంభాషణలు. సుజాత ఈ మురికిని బుర్రలో నుంచి తుడిచి రాత్రి జ్ఞాపకాలతో మనసు నింపుకోవడంకోసం ప్రయత్నించింది.

సుజాతకి మళ్లీ రాత్రి అనుభవాలన్నీ ఒక్కొ క్కటిగా గుర్తొచ్చాయి. అతని ముద్దులు.... తన మైమరపు ఆనందంతో తనువు- మనసూ ఏక మై ఏదో ఓ అనంత ప్రవాహంమీద తేలిపోతో న్న అనుభూతి...

ఇవన్నీ గుర్తుకు తెచ్చుకుంటున్న సుజాతకి తన శరీరం మీద, మోహన్‌కిష్టమైన తన ప్రతి శరీరభాగం మీదా అంతులేని ఇష్టం ఏర్ప డ్డాయి. ఆశ్చర్యంగా తనని తను ప్రేమించుకో వడం మొదలెట్టింది. మోహన్ కిష్టమైనందు తనంటే తనకీ ఇష్టమే!

'మోహన్.... ఏం చేస్తున్నావు?' అనుకుంది. ఆ తలపే, ఆ ప్రశ్నే ఆమెను అకారణంగా పిచ్చిదాన్ని చేసింది! ఒక్కసారి వెంటనే మోహన్ని చూడాలనిపించింది. ఈ నిమిషంలో అతని వళ్లో తలపెట్టి, అతని కన్నుల్లోకి చూడా లనిపించింది. విషాదంతో హృదయం బరువె క్కింది. త్వరత్వరగా స్నానంచేసి ఎన్నడూ లేనంత త్వరగా ఇంట్లో పని ముగించుకుని బైటపడింది. ఎదురుగా వస్తూ మోహన్. అత న్ని చూస్తూ ఆగిపోయింది. ఇద్దరూ లోకాన్ని చూసి తడబడ్డారు. నెమ్మదిగా నడుస్తూ ఆఫీసు కెళ్లారు. ఆఫీసులో ఎన్నడూ రానంత విసుగు ఆ పనిమీద. ఎందుకీ ఆఫీసు... ఈ పని... అన్పించింది.

మధ్యాహ్నాం ఇద్దరూ కల్సి సుజాత ఇంటికె ళ్లారు. మామూలుగా అయితే లంచ్ ఆఫీసు లోనే చేస్తుంది సుజాత. ఛాయ తెచ్చింది కూడాను. బైటికెళ్తోంటే సుజాత వంక నిరస నగా చూసింది ఛాయ. లోకపు చూపులు పట్టించుకునేంత తీరిక, సమయం, స్పృహ వారికి లేవు.

ఇంట్లోకెళ్లగానే తలుపువేసి అతన్ని కావ లించుకుని ఏడ్చేసింది సుజాత. మోహన్ కళ్లలోనూ నీరు.

ఇద్దరూ అలా కాసేపువున్నారు.

''ఎందుకు?'' అన్నాడు మోహన్.

''నువ్వెందుకు?'' అంది సుజాత.

''నువ్వెందుకో నేనూ అందుకే'' అన్నాడు.

''నిన్నొదిలి నిముషం కూడా వుండలేను'' అంది.

''అవును.... నేనుకూడా వెళ్లానా... వూపిరాడ లేదు. మంచమ్మీద పడుకున్నాను పడుకోబుద్ధి కాదు. ఒక్కరాత్రికే నా శరీరానికి నీ శరీరం పక్కన లేకుండా కుదరటంలా! నాకు పిచ్చె క్కుతుందా అన్పిస్తోంది. మనమధ్య ప్రేమ వుంది.... ఈ ప్రేమకి బోల్డంత బేసుంది! కేవలం శరీరాలకోసం ఏమిటీ తపన అన్పి స్తోంది! ఎలా...'' అన్నాడు. అతని మొహం దిగులుగా వుంది.

''నువ్వు లేకుండా బతకలేను సుజా'' అన్నాడు

''అవును.... అది నాకూ స్పష్టమైపోయింది. ఎలా..? ఇవ్వాళ వూరెళ్లాం అని...'' ఆగింది సుజాత.

వాళ్లు మళ్లీ ఆ మిట్టమధ్యాహ్నాం ఆ గదిలో వెన్నెల్నీ విరుల్నీ పూయించారు.

ఆఫీసుకెళ్లాలనిగాని, ఎవరు ఏం అను కుంటారో అనిగాని వాళ్లకి గుర్తులేదు





సాయంత్రం ఛాయ వచ్చి తలుపు కొట్టేవరకూ.

ఛాయలోనికొచ్చి "నేను మా బంధువుల ఇంటికెళ్తున్నా" అని చీరలు బాగ్‌లో పెట్టుకుంటోంది చిరాగ్గా.

సుజాత "అక్కర్లేదు.... నేనివ్వాళ మా వూరెళ్తున్నా. రెండురోజుల్లో వస్తాను. అవసరమైతే అప్పుడు వెళ్దువుగానిలే" అంది.

ఛాయ ఆగి "ఆఫీసులో చెప్పావా?" అంది.

"లీవ్ లెటర్ ఇస్తాను. రేపు నువ్విచ్చెయ్" అంది సుజాత.

మోహన్ వంక చూస్తూ ఇబ్బందిగా అటూఇటూ తిరుగుతోంది ఛాయ.

"సుజాతా.... నేను వెళ్తాను" అన్నాడు మోహన్ లేవకుండానే.

"ఇప్పుడెక్కడికి?" అంది సుజాత.

"గాజులపేటకెళ్లాలివ్వాళ" అన్నాడు అప్పుడే గుర్తొచ్చి మోహన్.

"వాళ్లు వెళ్ళిపోయారు, మీకోసం చూసిచూసి..." అని ఆగింది ఛాయ.

"పంకజవల్లిగారేమన్నారు?" అన్నాడు మోహన్. "ఏమంటారు? ఏమైంది వీళ్ళిద్దరికీ అంది. మనవాళ్లున్నారుగా... ఆ మురికి పీనుగులూ... వెకిలి నవ్వులూవాళ్లూనూ- మీరేమనుకుంటున్నారోగాని... మీగురించి వాళ్లు అలా నవ్వుతోంటే నాకే చీదరగా వుంది" అంది ఛాయ.

"అదే అదే.... అందుకే ఈ విషయంలో నలుగురికీ నాలుగురకాలుగా అనుకునే అవకాశం ఇవ్వకూడదనే... నేనివ్వాళ వూరెళ్లేది" అంది సుజాత.

"ఏమనుకుంటున్నావూ.... వూరెళ్లగానే మీవాళ్లు ఇష్టపడతారనుకుంటున్నావా?" అంది ఛాయ.

"వాళ్ళిష్టపడతారు. పడకపోతే ఇష్టపడేలా నేను వాళ్లకి నచ్చచెప్పగలననే ధైర్యం వుంది నాకు. ఒక వేళ ఇష్టపడరూ... వాళ్లకి గుడ్‌బై కొట్టి వస్తా. అంతకన్నా చేసేదేముంది?" అంది సుజాత.

సుజాతకి వాళ్ల నాన్నమీద బాగా గురి. ఆయన ఒప్పుకుంటాడు. ఆయన ఒప్పుకుంటే ఎవరెన్ని మొత్తుకున్నా పెళ్ళిఅయిపోయినట్టే!

"ఒక పని చేద్దామా?" అన్నాడు మోహన్.

"ఏమిటి?"

"హైదరాబాదు వెళ్దాం. చంద్రాన్ని కలుద్దాం"

"చంద్రం ఎవరు?" అంది ఛాయ.

"ఈయన ప్రాణంలే తనువిక్కడా, ప్రాణం చంద్రం దగ్గర..." అని నవ్వింది సుజాత.

"చంద్రంతో మన పరిస్థితి చెప్దాం. వాడు అసలు నిన్నుచూడాలి. మనవిషయం మనిద్దరి తర్వాత తెలవ్వాల్సినవాడు వాడే. వాడికి అన్నివివరాలూ చెప్దాం. వాడేం చెయ్యమంటాడో విందాం. తర్వాతే నిర్ణయించుకోవచ్చు..." అన్నాడు మోహన్.

ఆలోచనగా "సరే...కాని మావాళ్లకెలాగూ చెప్పాలిగదా...." అంది సుజాత.

"చెప్పుగాని! అట్నించటే వెళ్దుగాని...." అన్నాడు మోహన్.

"సరే" అంది సుజాత.

"అయితే ఆలస్యం ఎందుకు? ఇప్పుడు బైల్దేరితే పదింటికల్లా వెళ్ళిపోవచ్చు" అన్నాడు మోహన్.

"సరే... మరి నీబట్టలూ..." అంది సుజాత.

"ఏమీ అక్కర్లా. వాడివి నాకు పడతాయ్. అవసరమైతే అలానే వేసుకుంటాంకూడా! నువ్వు బైల్దేరు. ఇట్నించిటే వెళ్దాం" అని ఛాయతో "రేపు నేనుకూడా రానని....అనుకోకుండా హైద్రాబాద్ వెళ్లానని పంకజవల్లిగారితో చెప్పండి. వచ్చాక లీవ్‌పెడతాను" అన్నాడు.

"సరే" అంది ఛాయ.




బస్సులో ఇద్దరికీ పక్కపక్క సీట్లు దొరికాయి. కూర్చున్నాక పదినిముషాల్లో బస్సు బైల్దేరింది.

"మీవాళ్లు ఏమంటారు?" అంది సుజాత.

"అమ్మతప్ప నాకెవ్వరూలేరు. అక్కలున్నా లేనట్లే. వాళ్లు అభ్యంతరాలు తెలిపేంత దగ్గర్లో లేరు. అన్నలూ, తమ్ముళ్లూ ఎవ్వరూలేరు. అమ్మకి నచ్చచెప్పటం అంతకష్టంకాదు. నావైపునుంచి గొడవల్సంగతి మనం మర్చిపోవచ్చు. నీవైపునుంచే...."

"నావైపునుంచి ఉంటేకూడా ఒక్కనాన్నదే... నాన్న ఒప్పుకుంటే అంతా మామూలుగా జరిగిపోతుంది. ఆయనేమో ఒప్పుకుంటాడన్పిస్తుంది..."

"ఎందుకొప్పుకుంటాడని..."

"ఆయన నాకు చాలా స్వాతంత్ర్యమిచ్చాడు. చిన్నప్పట్నుంచి నేనేదంటే అదే సాగింది మావూళ్లో..."

"మీదేవూరు?"

"గుడివాడదగ్గర చవుటపల్లి. కొత్తా పాతని రెండున్నాయ్. మాది కొత్తది. రోడ్డుమీదే! మావూళ్లో ఆడపిల్లలు నాలాగా దాదాపు ఎవరూ పెరగలా...."

"అంటే..."

"చిన్నప్పుడే నేను సైకిల్ నేర్చుకున్నాను. నాకోసం మానాన్న సైకిల్ కొన్నాడు. నేను దానిమీదే గుడివాడ వచ్చేదాన్ని. మావూళ్లో ఆడపిల్లలు కాస్త వయసొచ్చాక బైటతిరగడం, చదువులకని వూళ్లుదాటివెళ్లడం ఇవేమీ అంతగాలేవు. కాని నేను గుడివాడలో, ఏలూరులో, వైజాగ్‌లో చదువుకున్నాను. నేను షర్టూ ఫాంటులుగానీ, పంజాబీ డ్రస్సులుగాని ఏవంటే అవి తెప్పించేవాడు. అవేసుకుంటున్నావ్ మనూళ్లో బాగుండదని అనేవాడుకాదు. ఎవరన్నా అంటే "కాలం మారుతోందయ్యా. కాలాన్నిబట్టే పిల్లలూ... ఈరోజుల్లో పిల్లల్నిబట్టే పెద్దాళ్లు నడవాల్సిందే" అనేవాడు.

"మేం మగపిల్లల్తో కల్సి ఎక్స్‌కర్షన్సుకీ, పిక్నిక్కులకు వెళ్తున్నామని తెలిసినా ఏమీ అనేవాడుకాదు. పిల్లలు పెద్దయ్యాక ఇక వాళ్ల మంచిచెడ్డలు వాళ్లమీదే వదిలెయ్యాలి అంటూంటాడు. నామీద చాలా నమ్మకం. నాస్వేచ్ఛకెప్పుడూ అడ్డంపడలా...." తండ్రి మీద అపారమైన నమ్మకంతో వుంది సుజాత.

"చంద్రం ఏమంటాడంటే స్త్రీలు స్వేచ్ఛగా వున్నామనుకోడం ఒకపెద్ద భ్రమ అంటాడు. ఇంతకుముందు మా మిత్రుడొకడు ఇలానే ప్రేమలో పడ్డాడు. ఆ అమ్మాయికూడా నీలాగే మా నాన్న నవలలు చదువుతాడు. ప్రేమలూ అవీ మానాన్నకి పడని విషయాలు కావు. నేను ప్రేమించానంటే మా నాన్నకి సంతోషంగా వుంటుంది– అని ఇలానే చెప్పింది. చంద్రం ఏమన్నాడంటే-- మీనాన్న గానివ్వండి, ఎవరినాన్నగానివ్వండి ముఖ్యం ఆడపిల్లకి ఎంత స్వేచ్ఛ ఇవ్వాలో వాళ్లకోలెక్కుంటుంది. దానిప్రకారం ఇస్తాడు. జూలో చూస్తాంగదా! పులులూ సింహాలూ... సఫారిపార్కులో సింహాలు తిరుగుతూ మనం స్వేచ్ఛగా వున్నాం అనుకోవచ్చు. వాటిస్వేచ్ఛ ఎంతో మనకితెలుసు. వాటి లిమిట్స్ నిర్ణయించేవాళ్లు బైటవున్నారు. ఆ లిమిట్స్ దాటడం వరకూ వస్తేగాని తెలియదు తాము బందీలమని. ఆడపిల్లలూ అంతే అంటాడు. ఒకేకులం అయి కాస్త డబ్బులు, అంతస్తులు అన్నీ కుడిఎడంగావుంటే పర్లేదుగాని లేకపోతే ఏ ప్రేమజీవులైనా సరే ముందు పెళ్ళిచేసుకుని తర్వాత పేరెంట్సుకి చెప్పాలనేది మా చంద్రం స్లోగన్. మనక్కూడా అదే చెప్తాడు" అన్నాడు మోహన్.

ఆలోచనలో పడింది సుజాత. "ఇంతకాలం ఇంత ప్రేమగా పెంచితే, ఫలానా అతన్ని ఫలానారోజున పెళ్ళిచేసుకుంటున్నానని చెప్పకపోవడం న్యాయంగా వుందా" అని తల్లిదండ్రులడిగినట్లే ఫీల్‌అయింది.

లేదు. చెప్తాను... వాళ్ళిష్టపడితే వాళ్ళిష్టప్రకారం... లేకుంటే నా ఇష్టప్రకారం... ఎలాగూ జరిగేదే...

"లేదులేమోహన్... మానాన్నని ఒప్పిస్తాను. లేకపోతే వచ్చేస్తాను. అప్పుడే చేసుకోవచ్చు. ఇప్పుడు చేసుకుందామనుకునేలానే...." అంది.

"సరే... నీకంత నమ్మకంవుంటే కానీ...." అన్నాడు మోహన్. సుజాత చేతిని తనచేతిలోకి తీసుకుంటూ. చేతి స్పర్శకే పులకించిపోయింది సుజాత.

దూరంగా భాగ్యనగరపుదీపాల తోరణాలు కన్పడ్తున్నాయ్.

★ ★ ★





రిక్షాదిగి ఇంట్లోకొస్తున్న సుజాతని చూడగానే బసవడు– "దొరసానమ్మగోరో... అమ్మాయిగోరొత్తున్నారండో..." అని గావుకేక వేశాడు. బసవడి నల్లటిముఖం అంతా సంతోషంతో వెడల్పయింది.

లోనుంచి ఎలాటిచప్పుడూ వినపడక "దొరసానమ్మగోరో..." అని మళ్లీ కేకేసి భుజానవున్న కావిడి కిందపడేసి ఇంట్లోకి పరిగెత్తాడు.

మంచంమీద బద్ధకంగా కదుల్తున్న రంగయ్యగారు "ఎవర్రా?" అన్నాడు.

"అమ్మాయిగోరుంటే. అమ్మాయిగోరొచ్చేశారు" అన్నాడు బసవడు.

"అమ్మాయి వచ్చిందా?" అని లేచి రంగయ్యగారు వచ్చేలోపే రామతులశమ్మ మజ్జిగ చెయ్యడం ఆపి వచ్చి కూతుర్ని చూసింది.

"ఏంటమ్మా ఉత్తరం ముక్కన్నా లేకుండా వూడిపడ్డావ్. ఎన్నుత్తరాలేసినా రమ్మని... రాలేదు. ఇప్పుడేమో ఉరుంలేని పిడుగులాగా..."

"ఒసి వూరుకోవే! ఉప్పుటికన్నా వచ్చింది గందాని సంతోషం లేకుండా వురుమూ పిడుగూ అని దాన్ని బెదరగొడతన్నా?" అని వచ్చాడు రంగయ్య.

"ఏంటమ్మా బాగా సిక్కిపోయినట్టున్నా! వంటో బాగుంటాందా?" అంది తల్లి.

"ఆ... బాగానేవుందిలేమ్మా. నీకళ్లకి నేనెప్పుడూ చిక్కినట్లే కనపడతాను. మీరెట్లావున్నారు?" అంది సుజాత.

"మాకే... దిమ్మిచెక్కల్లాగా సుబ్బరంగా వున్నాం. ఒకోరమన్నా శెలవ పెట్టొచ్చావా?" అన్నాడు రంగయ్య.

"వొకోరమేంటండీ అసలా అమ్మాయిగోరు మనూరి అమ్మాయిగోరా ఆ అయిద్రాబాదమ్మాయిగోరా. ఈచారన్నా ఒకనెలుండమనుండి..." అన్నాడు బసవడు.

"వురే... నువ్వు తొట్టెల్లో నీళ్లుబోసి... తొందరగాపో. ఆ ఆకుమడి పని ఇవ్వాళన్నా పూర్తిచేద్దాం..." అన్నారు రంగయ్యగారు.

"మరి కోడ్ని కొయ్యటానికి చాకల్ని పిలవద్దంటండీ..." అన్నాడు నవ్వుతూ బసవడు.

"ఆ... నిజవేరా! ఆ నల్లకోడ్ని పట్టుకుని గూట్లోయేసి ఆ చాకలి రావుడ్ని రమ్మనిచెప్పు. అట్టాగే ఆ రేవుకాడ కావిడిపడేసి మా చెల్లెలిగారింటికెళ్ళి సావిడిమీద సొరకాయవొకటి కోసుకురా అమ్మాయొచ్చిందని చెప్పి. దానికి కోడికన్నా సొరకాయంటే పేణం పిచ్చిమొఖంది!" అంది రామతులశమ్మ.

"అట్టాగేనుండే...." అని కావిడి భుజానేసుకుని త్వరత్వరగా వెళ్ళిపోయాడు బసవడు.

"రామ్మా... ఆ పెట్టె లోనపెట్టి దొడ్డోకెళ్లి మొఖం కడుక్కురా. కాసిని కాఫీ కాసిత్తా! ఎప్పుడు బైల్దేరావో యామో!" అని లోనికి తీసుకెళ్ళింది.

"వీళ్ళింకా లేవలేదా" అంటూ పందిరి కిందున్న మంచాలకేసి చూపింది సుజాత. సుజాతకి ఇద్దరు తమ్ముళ్ళు, ఒక చెల్లెలు. పెద్దతమ్ముడు ఇంటర్ రెండుసార్లు తప్పి 'నాకు చదువచ్చిరాలేదులే' అని వ్యవసాయంలో పడ్డాడు. చిన్నతమ్ముడు పదోతరగతి పరీక్షలు రాశాడు. చెల్లెలు ఎనిమిదిలోకొచ్చింది.

"లేస్తార్లులే... రా!" అని సుజాతతో చెప్పి– "ఉసేయ్! సిన్నదానా... అక్కొచ్చిందే.... అక్కొ అక్కో అని ఒకటే కలవరిత్తాంది! ఉరే...శీనూ... అక్కొచ్చిందిరా. లేవండి... లేవండి" అని ముగ్గుర్నీ రెండు రెండు దెబ్బలేసి లోనికి నడిచింది.

అక్క అనేమాట విని సులోచన గబుక్కున మంచంమీదనుంచి వురికి లోనికొచ్చింది.

శీనుమాత్రం మంచంమీదనుంచి లేవకుండానే "ఉసేయ్... నిజమేనా... అక్కొచ్చిందా" అని కేకేశాడు.

"ఆ" అంది సులోచన.

అప్పుడు శీను కూడా లేచి లోనికొచ్చాడు.

సులోచననిచూసి సుజాత కళ్లు మెరిసినాయ్! "అరే... ఇది పెద్దదయిపోయిందే?" అని చెల్లెల్ని దగ్గరకు తీసుకుంది.

శీనూ లోనికొచ్చాడు. "ఏంటే అమ్మా వీడూ! మన శీనుగాడేనా... అబ్బే... ఆ మీసాలూ, గెడ్డామూ... ఆ మొటిమలేంటి ముఖంనిండా..." అంది సుజాత.

శీనూ "ఎంతసేపయిందక్కా వచ్చి?" అన్నాడు.




''అబ్బో... ఏమిటా గొంతు! బావురుకప్ప లాగా....'' అంది సుజాత.

''వూరుకోవే... వాడసలే సిగ్గుతో జత్తన్నా డు... ఎదిగే పిల్లలు... ఎప్పుడూ అట్టానే వుంటారా? ఒకసారిల్లు వదిలెల్తే ఇక సమ్మచ్చ రాల్తరబడి రావయ్యె. నువ్వొచ్చేదాకా ఇక పిల్ల లు పెరక్కుండా వుండాలంటావు...'' అని ఒక వైపు కూతురిమీద కంప్లయింటూ మరోవైపు ఆపేక్ష కలపోసి మాట్లాడుతోంది తల్లి.

''యామే.... నేనట్టా భూషయ్య బావదగ్గరకె ళ్లొత్తా'' అని ముందునుంచి కేకేశాడు రంగ య్యగారు.

''తెల్లారిందీ... అప్పుడే ఎందుకూ? ఇకంద రూ ఇంటిమీదకొత్తారు. అమ్మాయొచ్చినట్టు తెలవకుండా వుంటందా. ఆళ్లేవత్తార్లే... నువ్వా ముఖం కడుక్కుని ఇట్టారా... కాపీ ఇత్తా'' అంది రామతులశమ్మ.

''పెద్దాడింకా లేవలేదే'' అంది సుజాత.

''లేత్తాడు'' అంది తల్లి.

''ఆడూ రాత్రి సెకండ్‌షో కెళ్లాడు తెల్సా?'' అన్నాడు శీను.

''యావో.... ఎవరికి తెలుసు?'' అంది తల్లి.

''అక్కా... ఇవ్వాళ మనం సినిమాకె ళ్దామా?'' అంది సులోచన.

''అదిగో... మనిషింకా గడపలో కాలుపె ట్టలా! అప్పుడే సినిమాలు. ఈ సినిమాలపిచ్చి బాగా ఎక్కింది దీనికి ఇంటికెవళ్లొత్తే ఆళ్లతో సినిమాకి బైల్దేర్తంది! సినిమా అనకుండా బొడ్డుచుట్టూ అట్టకాడ కాల్చి వాతలు పెట్టాలి'' అంది తల్లి.

''ఊ....'' అంది చెల్లి.

''ఊరుకోమ్మా. వెళ్దాంలేవే... అందరమూ వెళ్దాం''

''అమ్మకూడానా?''

''ఆ''

''అమ్మరాదు''

''వస్తుందిలే''

''రాదు. అడుగు కావాలంటే....'' అని అక్క అడిగే టైం ఇవ్వకుండానే ''అమ్మా? నువ్వు కూడా సినిమాకొత్తావా?'' అంది.

''వత్తేవత్తాలే... మొకాలు కడగండి... మొకా లు...'' అంది తల్లి.

సుజాతవంకతిరిగి- ''ఊ... చెప్పమ్మా టిఫినేం చెయ్యమంటా!'' అంది.

''ఏదోఒకటి చెయ్యమ్మా'' అంది సుజాత.

''పెసరట్టు....'' అంది సులోచన.

''నిన్నొవరడిగారే... ఎప్పుడూ తింటూనే వుంటావు. మళ్లీ కోరికలు'' అంది తల్లి.

''ఊం... అక్క...''

''పెసరట్టే వెయ్యమ్మా!'' అంది అక్క.

''ఆం... పెసరట్టే'' అంది సులోచన.

''పెద్దదవుతోన్నా చిన్నపిల్ల లక్షణాలుపోలా దీనికి'' అంది సుజాత.

''దొరసానమ్మగోరో.... ఇదిగో సొరకాయ. లేత పూవ...'' అంటూ కావిడేసుకుని వచ్చాడు బస వడు.

★ ★ ★

ఆరోజంతా-

''అక్కా... పెద్దమ్మాయొచ్చిందంటగా ఏదే'' అనో

''ఏంబావా... అమ్మాయొచ్చిందంటగా... బాగుందా...'' అనో

ఎవరోఒకరు వస్తూనేవున్నారు.

వచ్చిన ప్రతివారూ కాసేపు కూర్చుని అదీ ఇదీ మాట్లాడటం, వెళ్తూ వెళ్తూ ''ఈసమ్మచ్చర మన్నా పప్పన్నం పెడ్తున్నావా లేదా'' అని హాస్యాలాడటం....

ఇలా గడిచింది.

తనంటే ఎంతో ఇష్టపడే పిన్నీ పిన్నికూతు రు కూడా వచ్చి పగలంతా కూర్చునే వెళ్లారు. అమ్మ ఏవేవో వండుతూ ఆ వంటిల్లుదాటి బైడపటలేదు.

తండ్రికి కూతురంటే గర్వం.

పందిరికింద మడతమంచమ్మీద కూర్చుని- ఎందరొద్దన్నా తను కూతురికి చదు వెలా చెప్పించాడో... తన కూతురివ్వాళ ఎంత ప్రయోజకురాలయ్యిందో... చెప్పుకుంటూ ము రిసిపోయాడు.

''ఆ... నీ గొప్పేముందిలేవయ్యా... అమ్మాయి తెలివైంది కాబట్టి ఒక్కొక్క తరగతీ



దాటుకుంటూ పైకిపోయింది. ఏదీ మా పెద్దన్నయ్య మరి మాపెద్దదాన్ని చదివించాలని చూశాడు. మళ్లీ అట్టాఇట్టాగాదు. డాక్టర్ చదివిచ్చాలని చూశాడు. దానికి మాటలొచ్చినప్పట్నుంచి నువ్వేం చదువుతావే అంటే దాక్తర్ అనేది. మరి ఆ ఎస్సెల్సీ దాటకపోయే. మీ అమ్మాయంటే... మరి పిల్ల తెలివిగలది... నీబతాయేంటంటా... అని ఎకసెక్కెమాడాడు భూషయ్యబావ....

"ఓరి నీకుళ్లు పాడుగాను. ఎదటోడి గొప్పతనాన్ని ఒకపట్టాన ఒప్పుకుసావవుగందా! సరే... మరి అంతతెలివైంది నాకూతురే గందరా! మరి నీకో, మీ అన్నయ్యకో అంతంత తెలివైన కూతుళ్లో, కొడుకులో పుట్టలేదే... ఎందుకో తెలుసా? అరే... మనలో వుండాలిరా బాబూ. మన బుద్ధులు, మన తెలువులే మనపిల్లలకొత్తాయ్‌రా బావా... ఇకన్నా నోరుమూసుకోరా..."

''సరెసర్లేవేయ్... నీ తెలివొచ్చుంటే మీ అమ్మాయింతదాకా సదవకే... అసలాపిల్ల తెలివీ బుద్ధీ అవన్నీ... మా సెల్లెలియ్‌లే....మాట్టాడమాక....''

''ఒర్నీ దుంపతెగ...నీ అన్నాయెం దొంగ ల్దోలా... ఎటునుంచెటు తిప్పావురా...'' ఇలా తండ్రీ తండ్రి స్నేహితులూ మాటల్లో పడ్డారు.

తండ్రి తనని చూసుకుని గర్వపడ్తున్నాడు. మరి ఈవిషయం కదపగానే ఒక్కొక్కరూ ఏమవుతారో, ఎలా ప్రవర్తిస్తారో... మొదటిసారి కాస్త అనుమానం వచ్చింది సుజాతకి.

ఏమైనాసరే రేపుదయమే మాట్లాడేసెయ్యాలి అనుకుంటూ పడుకుంది సుజాత. అకస్మాత్తుగా మోహన్ గుర్తొచ్చాడు. పాపం మోహన్ ఒక్కడూ ఏంచేస్తున్నాడో తనగురించే దిగులుపడ్తూండి వుంటాడు.

అమ్మ తననెంత అపురూపంగా చూసుకుంటుంది. తమ్ముళ్లు, చెల్లెలు తనంటే ఎంత ప్రాణం పెడ్తారు.

రేపు వీళ్లకిష్టంలేదు అంటే వీళ్లంతా తనకికఏమీకారా.. తనకీ వీళ్లకీ సంబంధాలుండవా....

ఏమిటి తనుకూగా ఇలా ఆలోచిస్తోంది. ఎంతోమంది ఎక్కడ బలహీనపడిపోతున్నారో... ముందుకొచ్చినట్టే వచ్చి ఎక్కడ వెనకడుగువేస్తున్నారో.... ఆ బంధుత్వాలు... ఆ సంబంధాలు.... ఆ ఆప్యాయతలూ... బలహీనతలై జీవితాల్ని ఎలా ఎలా మార్చేస్తున్నాయో ఆలోచిస్తూ, మంచంపక్కనే కూర్చుని అమ్మ ఏదో చెప్తోంటే వినీవినకుండానే 'వు' 'వు' అంటూ నిద్రపోయింది సుజాత!

''చూస్తా చూస్తాండగానే పిల్ల దోసపాదులాగ ఎట్టా ఎదిగిపోయిందోసూడు. రేపన్నా ఆ దొండపాడెళ్ళి ఆళ్ళసంగతేంటో కనుక్కురా... ఆళ్లు గాకపోతే మరొకళ్లు. ఎన్నాళ్లు అట్టేపెట్టుకుంటాం. చదువు చదువు అన్నారు తండ్రీకూతుళ్లు. చదువులయిపోయినియ్యి. ఇకిప్పుడు వుద్యోగాలు. పదిమందిలో తిరిగే పిల్ల. ఎప్పుడే మాట ఇనాల్సొత్తందో అని గుండెల్లో దడగా వుంటుంది ఎప్పుడూ. ఆ మూడుముళ్లూయేసి అవతలకి పంపితే...''

''ఒసి నీ సొదపాడుగాను. ఆపవే..... ఎంత సేపూ నీగోలేనా... నేంజెప్పేదేమన్నా ఇంటావా?'' అన్నాడు రంగయ్య.

''చెప్పుమరి...''

''ఇందాక భూషయ్య బావతో మాట్టాడా. మా లక్ష్మయ్య బాబాయి, నేనూ రేపొద్దునే దొండపాడెల్తన్నాం. నూటికి తొంభైపాళ్లు ఖాయం చేసుకొత్తాం సూడు''

''ఆళ్లు వత్తామంటే పిల్లుండగానే చూపిత్తే పోతంది...'' అంది రహస్యం చెప్తున్నట్టు.

''తెల్సులేవే...'' అని.

''దొండపాడుదైతేనే మనకి సరిగ్గా తూగుతుంది. మిగతా ఒకటి రెండూ చెప్పారుగాని... అబ్బే... మనకి పనికిరావు. ఉంకొక సంబంధం ఉందిగాని... పిల్లాడు డాక్టరే కాని... పొట్టి.. పిల్లకన్నా పొట్టి కాకపోవచ్చేమోలేగాని... చూట్టానికి ఈడూజోడూగా వుండడు''

''ఇన్నెందుకు.... మీరు ఆ దొండపాటిదే మాట్టాడండి. నాలుగేలు అటూయిటూ అని చూడకుండా''

''ఒసి నీయమ్మ... నువ్వేన్ని సెబుతున్నావే నాకూ...''

''ఎన్ని చెప్పినా ఆ మూడుముళ్లూ పడేదాకానే. ఆకాస్త సంబరం అయిపోతే... కొడుకుల పెళ్ళిళ్ళు... మీ ఇష్టం... చిన్నదానికి అయిదారేళ్ళదాకా తొందరలేదు. నీకూ కాస్త వూపిరి తీసుకున్నట్టుంటది''

''ఆ మాట నిజమే... చూద్దాంలే. రేపెట్టవుతుందో అనుకుంటాంగాని... కల్సిరావాలే... పెద్దమ్మాయి గురించి నాకు ఎప్పుడూ బెంగలేదు. దానికన్నీ కలిసొత్తాయే. ఆ...'' అని తలూపాడు.

''నా పిల్లకేం తక్కువా..... బంగారబ్బొమ్మ''

''కాక? ఎవరి కూతురు?''

''ఒయబ్బో సంబడం!'' అని మొగుణ్ణి మురిపెంగా చూసింది రామతులశమ్మ.

''నామతిమండా! నాలుగు మిరపకాయలు తిప్పి అవతల యేశానుగాదు. ఎంత మందొచ్చారు. ఎంతమెచ్చుకున్నారు నా బంగారు తల్లిని జూసి...''

''సర్లే.... పో. పోయి పొడుకో... నిద్రొస్తోంది''

ఇవేమీ సుజాత వినకుండానే నిద్రోయింది.




నాన్న కనబడడే.. పొలం వెళ్లాడా?''అన్నం తింటూ అడిగింది సుజాత.

''కాదు... ఎక్కడికో వెళ్లాడులే''

''ఎక్కడికి?''

''తర్వాత చెప్తాన్లే''

తల్లి ముఖంవంక చూసింది సుజాత. సుజాతకి కాస్త అనుమానం వచ్చేలానే వుంది తల్లి ముఖం.

''అమ్మా.... నీతో కాస్త మాట్లాడాలి'' అంది సుజాత.

''ఏంటి చెప్పు?''

సుజాత ఎలా మొదలెట్టాలో ఎన్నోసార్లనుకుని మళ్లీ మర్చిపోయింది.

''ఏంటమ్మా?'' అంది రామతులశమ్మ.

''అమ్మా...''

ఏంటన్నట్టు సుజాత ముఖంలోకే చూస్తున్న తల్లికి ఏదో అనుమానం మొదలై అదొక పెనుభూతంలా మీదపడింది.

''ఏంటి... చెప్పు?'' అంది త్వరగా.

''ఏమీలేదు... మీరు నాకోసం ఏమన్నా సంబంధాలు చూస్తున్నారా?''

''చూడమంటావా?''

''వద్దు''

''ఏ.... నీకెన్నేళ్లనుకుంటున్నావ్? నువ్వు చిన్నపిల్లవా... ఇవ్వాళ మీనాన్న అ పనిమీదే వెళ్లాడు. రాత్రింబవళ్లు నీకు సరైనవాడిని తగలమా లేదా అని ఎంత సతమతమవుతున్నామో తెలుసా?''

''అదే. మీరంత సతమతమవ్వద్దు. నేను ఒకతన్ని ప్రేమించాను. అతన్నే పెళ్ళిచేసుకుంటాను. ఆ విషయమే చెప్దామని వచ్చాను... నువ్వేట్లానన్నా నాన్నని ఒప్పించు''

''ఎవరతను''

''అక్కడే. మా దగ్గరే.. మా ఆఫీసులోనే పనిచేస్తాడు. నాలాగే కాలేజీలో చదివాడు. మంచివాడు...''

''మేం చూడలేమని నువ్వే చూసుకున్నావా?''

''అదేంకాదు..... అతనంటే నాకిష్టం''

''మనిళ్లల్లో ఇటువంటివెప్పుడన్నా ఇన్నామా? ఎవరికన్నా తెలిస్తే తలఎత్తుకు తిరగ్గలమా, రేపట్నుంచి వూళ్లో పలానా వాళ్లమ్మాయి అనరూ. అందరూ నన్ను కాకులు పొడిచినట్టు పొడవరూ... ఇంత తెలివైనదానివి చివరికిట్టాచేశా...'' అంటూ కన్నీళ్లతో, చెంగుతో ముక్కుతుడుచుకుంటూ పెరట్లో కెళ్ళిపోయింది రామతులశమ్మ.

రామతులశమ్మకి తను కన్నకూతురు, తన చేతుల్లో పెంచిన కూతురు ఎవడో ముక్కూ మొఖం తెలియనివాణ్ని ప్రేమించిందనే విషయం పెద్దకొండలా మీదపడింది. ఎంత అపరదిష్ట.... నలుగురూ నవ్విపోరు! ఇంత చదివిన పిల్ల ఇట్టా చెయ్యక ఎట్టాచెత్తందిలే అంటారుగామోను. ఆ తండ్రి ఎట్టా భరిస్తాడూ ఇది విని. గుండెలు పగుల్తాయ్. మోరలేపుకు తిరుగుతున్నాడు నాకూతురుగాబట్టి అని... ఏమైపోతాడా పెద్దమనిషి... తెరలు తెరలుగా ఏడుపొస్తోంది రామతులశమ్మకి. దొడ్లోకెవరో వస్తే ముఖం చాటుచేసి ఏదో చెప్పి వంపేసింది.

సుజాత బైటికొచ్చి తల్లిదగ్గర అటూ ఇటూ తిరుగుతూ,

''అమ్మా... ఇదేమీ కొత్తకాదు. మనవూళ్లో అంటే ఎక్కువ అవ్వలేదేమోగాని చాలామంది ప్రేమించి పెళ్ళిచేసుకుంటున్నారు. ఇదేమీ తప్పుకాదు. నాకు నచ్చినవాడితో జీవితాంతం కల్సి బతకడం బాగుంటుందిగాని ఎవరో ముక్కూముఖం తెలవనివాడితో ఎలా బతకను''

''మీ నాన్నతో నేను బతకట్లా. మీ నాన్న

ముఖాన్ని పెళ్ళిలోకూడా చూడలా నేను.... నాకేం లోపమైంది. నువ్వు చూసుకుంటేనే మంచాడా. మేంచూత్తే ముక్కూముఖం తెలవ నివాడా? నువ్వా ఆఫీసులో చేరకముందు ము క్కూమొఖం తెలవనివాడుగాదూ వాడెవడో! మనిషి ఎవరు. కులంగోత్రం.. మంచీచెడ్డా... పుట్టు పూర్వోత్తరాలు... ఏమన్నా తెలుసా నీకు? నీతోపాటు ఆఫీసులో చేస్తున్నాడు- అంతేగా నీకు తెలిసింది. ఆడెవడో... రేపాడు నిన్నేం చేస్తాడో... అసలేమన్నా తెలుస్తయ్యా... ప్రే మంట ప్రేమ.. పెద్దాళ్లు అంత పనికిమాలినా ళ్లయి పోయారా? నీమీద పేణాలు పెట్టుకుని బతుకుతాంటిమి, ఏగానీ యిలవలేకుండా పోయిందా నీకు మేమంటే? అంత పనికిమాలి నవాడిని తెత్తామనుకుని చూసుకున్నావా? అట్టా తెచ్చేవాళ్లమైతే నీకింతింత చదువు లెందుకు చెప్పిచ్చేవాళ్లం. నీకోసం డాక్టరో అని ఆ బాబు అట్టా దేశంమీదపడి ఎందుకు తిరిగేవాడు. ప్రేమించిందంట ప్రేమించింది''

ఈ మాటలన్నీ అప్పుడప్పుడూ ఏడుస్తూ, శ్వాస ఎగబీలుస్తూ, ముక్కు తుడుచుకుంటూ కూతురితో చెప్పుకుంది ఆ తల్లి.

సుజాత మనసు నీరైపోతోంది.

తను వీళ్లని ఎలా కన్విన్స్ చెయ్యాలి?

తల్లి ఇలాగే అంటుందనుకుంది సుజాత.

ఇప్పుడిక తండ్రిమీదే సుజాత ధైర్యం అంతా...

తండ్రి వచ్చినట్టు అలికిడైంది.

''అమ్మా... నాన్నొచ్చారు'' అంది సుజాత తల్లి దగ్గరే నిలబడి.

''నువ్వు మాట్లాడమాక! ఆయన గుండె పగుల్తుంది. తిరిగి తిరిగొచ్చారు. అన్నంఅన్నా తిననియ్'' అని ముఖం కొంగుతో గట్టిగా తుడుచుకుని లోనికెళ్ళింది.

రంగయ్యగారు లోనికొచ్చారు.

''ఏమైంది ఎళ్ళినపని?'' అంది రామతుల శమ్మ అన్నంపెట్టి ఎదురుగా కూర్చుంటూ.

''ఆ... ఇవ్వాళ వెళ్ళటం దండగైంది. అస లైనవాళ్లులేరు... ఎవరో వున్నారు. అడ్డమైనవా ళ్ళతో ఎందుకులే అని వచ్చేశాం. రెండురోజు లాగి ఎల్దాం'' అని ''ఏమెండ ఏమెండ! వడదెబ్బతగిలి పడిపోతామేమోనని భయం పుట్టింది...'' అంటూ భోజనంలో మునిగిపోయా డు.

ఉన్నట్టుండి రంగయ్య భోజనం చెయ్యడం ఆపాడు. రామతులశమ్మ వంక చూశాడు.

''ఏమిటే పిచ్చిమొహందానా? వాళ్లు ఏదో వూరెళ్లారు. అంతే...''

''నా ఏడుపదికాదులే...'' అని లేచి వెళ్ళిపో యింది.

ఎప్పుడూ ఇలా ప్రవర్తించని భార్య ప్రవర్తన కి కారణం ఏమిటా అని ఆలోచనలోపడి గబ గబా అన్నం తిండం పూర్తిచేసి పెరట్లోకెళ్లాడు.

భార్య గానగచెట్టుకింద రాయిమీద కూర్చుని ఏడుస్తోంది.

''ఏంటి... ఏం జరిగింది? ఎవరన్నా ఏమ న్నా అన్నారా? ఎవరికన్నా ఏమన్నా అయిందా?'' అన్ని ప్రశ్నలూ రంగయ్యే వెయ్యడం. ''ఏదీకాదు...'' మరేమిటి- ఎందుకు ఏడుపు? ఎన్నడూలేనిది ఏడు పెందుకొస్తోంది? కూతురి పెళ్ళి చెయ్యలేకపో తున్నామనా?''

''మన కొంపకేదో శనిచుట్టుకుంది'' అని బావురుమంది రామతులశమ్మ.

కూతురి నిర్వాకం గురించి విన్నాడు రంగ య్య.

ఆయన కలలోకూడా వూహించలేదు ఈ విషయం ఇలా జరగొచ్చని!

పైగా వూళ్లో అందరిముందూ ఎన్ని గొప్ప లు... నా కూతురు అందరి కూతుళ్లలాంటిదికా దు. నేను గీసినగీటు దాటదు. అంత చదువు కుందా ఇవాళ్టికూడా నాన్నా ఇది ఇలా చేద్దా మనుకుంటున్నాను చెయ్యాలా వద్దా అని అడుగుతుంది. చెయ్యమంటేనే చేస్తుంది! ఇలా ఒకటా...

రంగయ్యగారి మనసు వంద ముక్కలైనట్టు అన్పించింది.

లోనికొచ్చాడు. కూతురున్న గదిలోకొచ్చాడు. ''ఏంటమ్మా ఇది... నిజమేనా?''

''అవున్నాన్నా! నీతో మాట్లాడదామనే వచ్చా ను. రెండు నిముషాలు నేను చెప్పేది విను నాన్నా!''

''వద్దమ్మా. ఏంచెప్తావ్... అతను మంచివాడు, అతన్ని ప్రేమించానని. అంతేనా... ఇంకేమన్నా వుందా?''

''అంతే నాన్నా...''

''చాలు... అతను మన కులంవాడేనా? ఇదొక్కటి చెప్పు...''

''ఏ కులమోగాని మన కులం మాత్రం కాదు... ఆయన...''

''చాలు చాలు... కులాలమీద నువ్వు నాకే మీ చెప్పమాక! అతను మన కులంకాదు అంతేకదా! ఇకచాలు. అతన్ని మర్చిపో. అతన్నేకాదు ఇకా వుద్యోగాన్ని, ఆ పనికిమాలిన వూళ్లని... నువ్వు చదివిన చదువుని... అన్నీ మర్చిపో! గొడవ చెయ్యకుండా నేను చెప్పినవాడిని పెళ్ళిచేసుకో... ఊళ్లో నాలుక్కాలాలపాటు మా అందర్నీ బతకనియ్యి. నీఒక్కదాని తొందరపాటుకి మా అందర్నీ- తమ్ముళ్లనీ, చెల్లెల్నీ బలిచెయ్యమాకు... వద్దు... మాట్లాడొద్దు''

''కాదు నాన్నా మీకిష్టంలేకపోయినా నేను వెళ్ళి అతన్నే చేసుకుంటాను. అతన్ని తప్ప మరొకర్ని పెళ్లాడేదిలేదు''

''అది కుదరని వ్యవహారంలే...''

''లేదు నాన్నా... నేను వెళ్లాల్సిందే! అతన్ని...''

''సిగ్గులేకుండా వాగమాక! ఆడపిల్లవిగాదూ. ఎంత చదివితే మాత్రం ఆడదానివిగాకుండా పోయావా? ఈ గదిలోనుంచి నువ్వు బైటకు రామాక'' అని కోపంగా బైటికొచ్చి ఆ గది తలుపు బైట్నుంచి గొళ్లెం పెట్టేశాడు రంగయ్య

ఇంట్లోవాళ్లందరికీ జరగకూడని ఘోరమైందేదో జరిగిపోయిందని తెల్సిపోయింది.

పెద్దతమ్ముడైతే తండ్రి భయంతో ఆగాడుగాని అక్కని ముక్కలుముక్కలుగా నరికి పోగులుపెట్టాలని ఆలోచిస్తున్నాడు. అతనికి తమ ఇంటి ఆడపిల్లలు సంప్రదాయంగా, గౌరవంగా, మగవాళ్ళు చెప్పినట్లు చేస్తారని విపరీతమైన అహంకారంవుంది. అది అలా ఎందుకుందోగాని.. అక్క విషయం వినగానే తమ మొత్తం కుటుంబగౌరవం, పరువూ ప్రతిష్ఠా అన్నీ మంటగల్సినట్లుగానే భావించాడు. కులంగానివాణ్ని అక్క ప్రేమించడం... అసలు ఆడపిల్ల ప్రేమించడమే నేరం, పైగా కులంకానివాణ్ని... తల్లికి కొడుకునించి కూతుర్ని కాపాడాల్సిన బాధకూడా వచ్చిపడింది.

వేళకింత తిండిపడేస్తున్నారు. గదిలో ఎన్నాళ్లుంచుతారు.. ఏమో.. ఇరుగూ పొరుగూ అమ్మలక్కలు రావడం.. ''అమ్మాయేదీ'' అనడం... ''పడుకుందమ్మా'', ''బాగాలేదండి...'', ''చదుకుంటోందమ్మా, ఎవరొచ్చినా పిలవొద్దంది'', ''బైటగొళ్లెం పెట్టారెందుకూ?'' ''యామో ఏ పిల్లలయినా పెట్టారో...''

అబ్బో.... అమ్మలక్కలా అంత తెలివిమాలినవాళ్లు కాదు. నిప్పులేకుండానే పొగని పోగేస్తారు వాళ్లు. ఇక నిప్పుకూడా వుంటే... వూరంతా గుప్పుమంది.

రంగయ్యగారి పరువూ మర్యాదా అలా మంటగలిశాయి.

అయినా గది గొళ్లెం తియ్యాలా.

మూడుముళ్లూ వెయ్యడానికే తియ్యాలి...

తిరుగుతున్నారు నలుగురూ నాలుగువక్కలా. ఈసారి సంబంధం అంత బ్రహ్మాండమైంది కాకపోయినా ఫర్వాలేదు.

★ ★ ★

''చంద్రం...

సుజాత వెళ్ళి అప్పుడే నాలుగురోజులు. ఇంకా రాలేదు. వాళ్లు ఒప్పుకునే వుంటారనుకుంటాను. ఒప్పుకోకపోతే వెంటనే వచ్చేస్తానంది- బస్సు బైల్దేరబోయేముందు.

నువ్వు చెప్పిన ప్రేమ, ప్రేమిస్తున్నామనే భ్రమ... వీటిగురించి అంత అవసరంలేకున్నా నేను చాలానే ఆలోచించాను. అవును... ప్రేమ వివాహాలు విఫలమవ్వడానికి ముఖ్యకారణం నువ్వన్నట్టు అవి ప్రేమ వివాహాలు కాకపోవడమే. సుజాత బస్సులోకూడా ఓసారి ప్రేమ భ్రమ వివాహాల గురించి నువ్వు చెప్పిన విషయాల్ని గుర్తుకు తెచ్చుకుని నవ్వింది.

కాని, నువ్వు నమ్మాలి.

మాది భ్రమకాదు. మా ప్రేమ సత్యమూ, శాశ్వతమూను! కేవలం రూపమో మరొకటో చూసి ప్రేమిస్తే ఏమవుతుందో నువ్వు స్పష్టంగానే చెప్పావు. నేనసలు సుజాతని మొదట్లో అంత శ్రద్ధగా గమనించేవాడినేగాదని నీకు

చెప్పాను. ఆమె విలువలూ, ఆమె టేస్టులూ చూశాకే, తన ప్రవర్తన చూశాకే సుజాతమీద కాస్త ఆసక్తి కల్గింది. ఆ ఆసక్తి కలగడం కాస్త ఆలస్యమయిందేమోకాని తర్వాత సుజాత ఎలాటి మనిషో గుర్తించాను. సుజాత అంత అందమైనదికాదని నేను అనుకున్నట్లు లీలగా ఇంకా గుర్తుంది. ఇవ్వాళ సుజాత నాకు చాలా అందంగా కన్పిస్తోంది. కారణం సుజాతని నేను చాలా ఇష్టపడటమే... సుజాత మనసుని సుజాత ముఖంలో చూడగలగడమే.

చంద్రం... ఏమాత్రం సందేహంలేదు. సుజాతని నేను చాలా ప్రేమిస్తున్నాను. అన్నిటికన్నా అందరికన్నా ఇవ్వాళ సుజాత నా కమూల్యం!

ఇప్పుడు నా మనసెంత అగమ్యంగా వుందో తెలుసా! సుజాత లేకపోతే నేను బతకలేననేది స్పష్టం. ఒకవేళ బతికినా అది బతుకుకాదనేది ఇంకా స్పష్టం.

చంద్రం... నమ్ముతావా సుజాత లేకపోవడంవల్ల విరహమో, నిరుత్సాహమో, నిస్పృహో నిరాశో మాత్రమేగాక అనారోగ్యంగాకూడా వున్నాను ప్రేమలో ఇవన్నీకూడా తప్పనిసరి విషయాలా? ప్రేమిస్తే సంతోషం, ఆనందం ఇవేగాక అనారోగ్యాలు కూడానా... ఆశ్చర్యంగా వుంది?

కాని సుజాత వస్తేనా నేనెంత శక్తివంతుణ్నవుతాను! అవసరమైతే సుజాత కోసం నేను చెయ్యని సాహసం వుంటుందా?

చంద్రం... నీ స్నేహంవల్ల నాలోవచ్చిన మార్పులు... ఇవి పైపై మార్పులుకాదు నిజంగా కలిగిన మార్పులు.

చదువుకునేరోజులు తరచుగా గుర్తొస్తున్నాయి. ప్రతివిషయానికీ రియాక్ట్ అవడం, కొత్త సంగతులకోసం, కొత్త విలువలకోసం పరుగులు తియ్యడం, మరీ ముఖ్యం ఆ చివరిరోజుల మన సాన్నిహిత్యం...

ఈ అపరిచితవీధుల్లో, ఈ మసకచీకటిలో, మనసునిండా కలవరంతో నడుస్తూన్న నామీద నాకే జాలి, దయ. నా భుజంమీద నీచెయ్యిని వూహిస్తాను. అప్పుడిలా వుంటానా? వుండనిస్తావా నువ్వు? చంద్రం... నీలాటి స్నేహితుడు ప్రతివాడికీ ఒకడుండాలి! అదిసరే.... నీలాటి స్నేహితుడొకడు అసలు నీకు వున్నాడా? ఈసారి ఉత్తరంలో ఈ సంగతి మర్చిపోకుండా రాయాలి నువ్వు.

ఇక్కడ పని నాకు చాలా ఎక్కువగానే ఉంటోంది. రోజూ గ్రామాల్లో తిరగాలి. సాయంత్రంవెళ్తే ఒక్కోరోజు వచ్చేసరికి పది కొండుకూడా దాటుతోంది.

రమణమ్మగారి చలవవలన తిండికిబ్బందిలేదు.

ఇన్నాళ్లూ మనం చూసిందీ, మనకు తెలిసిందీ లోకంకాదు. అసలు జీవితాలిక్కడ వున్నయ్ అని ఎన్నిసార్లో అన్పిస్తుంది. రోజూ ఒక కొత్త అనుభవం. కాని ఏదన్నాచూస్తే చూసింది కళ్లద్వారా మెదడుకెక్కి హృదయానికిపాకే టైంకూడా లేకుంటే ఆ అనుభవానికి అర్థం ఏముంది చెప్పు. అసలది అనుభవమేనా? తియ్యడం చేతగాని సినిమా దర్శకుడి విషాద సన్నివేశాన్ని చూస్తే మనకే అనుభూతి కల్గుతుంది? వాడిమీద చులకన భావమో, కోపమో, కసో, ద్వేషమో తప్ప.

జీవితాలకి దగ్గరగా వెళ్ళి చూస్తున్నా. కాదనను. కాని ఈ జీవితాలు నావికావు. అందువల్ల వీటిని గురించి ఆలోచించడానిక్కూడా టైముండదు. ఫీలవ్వడానికి వ్యవధి వుండదు. నేనీ కౌన్సిల్లో చేరిన కొత్తలో కొంత టైముండేది. ఈ జీవితాల్ని గురించి స్పందించే అవకాశముండేది. అప్పట్లో ఈ వూళ్లో ఈ ప్రజలూ ఈపల్లె జీవనం గురించీ నీకు వారానికి రెండు ఉత్తరాలన్నా రాయగలననుకునేవాణ్ని. కానిఏది? ఫీడ్‌బ్యాక్. స్టాటిస్టికల్ డాటా ఇలాటి సోషలాజికల్ టరమ్సుతో, మనుషుల్ని మనుషులుగాకాక మా ప్రయోగాత్మక పథకంలోని నిర్జీవ ప్రయోగ వస్తువులుగా చూడాల్సి వస్తూంది..

చంద్రం...

కొన్ని సత్యాలు మనకు తెలియకపోవడం ఎంత మంచిది. బతుకుల్లోని కాల్పనిక శక్తిని హరించి పట్టి డ్రైగా 'బతుకుతున్నాం గాబట్టి తింటున్నాం, తింటున్నాంకాబట్టే బతుకుతున్నాం' గాడిలో పడిపోతున్నాం.

కొన్ని జీవిత సత్యాలు, అవి కఠినమైనవే గానీ, చేదువేగానీ తెల్సుకున్నవాళ్లు అందుకే అంత సినిక్స్‌గా మారిపోతారు. యువకుల్లా




పెద్దవాళ్ళు ఎందుకుండరో తెలుస్తోంది.

ఉద్యోగ చట్రంలో కాకుండా స్వేచ్ఛగా మన మీ పల్లెల్లో తిరిగితే మిగతా ప్రపంచంలో మనకు తెల్సింది ఎంత తక్కువో తెలుస్తుంది.

నువ్వన్నా అంతే... వెంటనే వెళ్ళిపోదామనే వాడివి. కాదు.... జీవుదిగి ఉద్యోగాన్ని వదిలి వెళ్ళిపోదామనేవాడివి– గ్రామాల్లోకి నడిచి పోదాం, గ్రామాల్లో కల్సిపోదాం, అనేవాడివి... అవునా...

ఈ గొడవన్నిటికి తోడు మా మిగిలిన స్టాపుతో నాకు అంతగా పడటంలా. వాళ్ల విలువల్ని సంసారాల్ని ఏదో ఓ సందర్భంలో విమర్శి స్తూనే వుంటాను. అది స్లోగా పనిచేసి వాళ్లు నెమ్మదిగా నాకు దూరం అవుతున్నారు. అప్పు డప్పుడూ దుర్భరంగా వుంటోంది.

కొంచెంసేపన్నా సుజాతని మరవాలని ఏవేవో గుర్తుకు తెచ్చుకుని ఇవన్నీ రాయడం. నువ్వన్నట్టు మేం చెయ్యబోయే ధిక్కారానికి ఎన్నడూ ఒక్కక్షణం కూడా విచారించాల్సినవ సరం లేకుండా జీవిస్తాం.

చంద్రం....

నీనుంచి దూరంగా వచ్చాకగానీ నేనేమిటో, నువ్వేమిటో నాకు తెలియలా! ఈ జీవితానికి నీ స్నేహమే లేకపోతే, ఈ మాత్రమన్నా ఎదగడా నికి నీ వుత్తేజమే లేకపోతే... ఇంకెంత నిర్జీ వంగా వుండేవాడినో.

ఇక్కడ అప్పుడప్పుడూ కొందరితో చర్చలొ స్తాయి... గకరకాల విషయాలమీద. నేను మామూలుగా వెలిబుచ్చే అభిప్రాయాలకే వీళ్లు జడుసుకు చస్తున్నారు.

మొన్న రమణమ్మగారి దగ్గర ఇలాగే ఏదో విషయంవచ్చి నీ గురించి చెప్తే హైదరాబాద్ వచ్చినప్పుడు ఆయన్ని తప్పకుండా చూడాలి అందామె. నేనన్నాను- ఆయన్ని చూడ్డానికైనా హైద్రాబాదు రావచ్చని!

ఎంతసేపూ నీవేపే మనసు పీకుతోంది. సుజాత వచ్చేస్తే ఎలాగోలా నీదగ్గరకొచ్చేస్తాం. ఎన్ని ఇబ్బందులున్నా ఎన్ని కష్టాలున్నా నీతో కలిసి ఆ వీధుల్లో తిరగడం, ఆ చైతన్యవంత మైన వాగ్వివాదాల్లో మునగడంలోవున్న ఆనందానికి సాటి ఏముంది? హైద్రాబాద్ వచ్చేటందుకు కలలు కంటున్నాను. ఈసారి నీ నాటకాల్లో నాకూ, సుజాతకీ కూడా పోర్షన్లి వ్వాలి.

మానసికంగా ఎంతో నిస్సహాయంగా ఫీలవు తూ, ఇష్టంలేని ఉద్యోగంచేస్తూ, సాహిత్యానికి కొంచెం కొంచెమే దూరమవుతూ ఎక్కడికి నా ఈ ప్రయాణం?

లాభంలేదు.... సుజాతని జీవితంలోకాహ్వా నించడం, సాహిత్యంతో నిత్యసంబంధం నీస్నేహం... ఆహా.... నా అంత సంపన్నుడెవ డు?

చంద్రం....

నీ అభిమానాన్నీ నీ ప్రేమనీ ఎంతో విలు వగా చూసుకుంటాను. వీటిని కోల్పోయేంత నిరుపేదగా ఎన్నడూ మారను.

నీ మోహన్.

★ ★ ★

లంచ్ టైంలో మోహన్ని కల్సి- "సుజాత సంగతేమిటి? ఎప్పుడొస్తుంది? అసలొస్తుందా రాదా? అని అడుగుతున్నారు మేడం " అంది ఛాయ.

మోహన్ ఇరవై లంఖణాలు చేసిన మని షిలా వున్నాడు. ఛాయకే జాలిగొల్పేలా వున్నా డు.

మాట్లాడకుండా ఛాయవంకే చూశాడతను. మాట్లాడ్తే ఏడుపొస్తుందా అన్పించింది ఛాయకు.

"ఏమయిందనలూ? వారం దాటుతోంది..." అంటూ ఏమనాలో తెలవక వెళ్ళిపోయింది ఛాయ.

అప్పటికే ఆఫీసులో అందరికీ వీళ్ళిద్దరి సంగతీ తెల్సిపోయింది. అందుకే పరమేశం కళ్లెగరేసి 'దేవదాసు' అనికూడా అన్నాడు సుందర్రావుతో.

దేవదాసు అనేమాట మోహన్ చెవిలోను దూరింది. విరహానిక్కూడా దేవదాసుని వాడతా రు. కాని విఫల ప్రేమికుడుగదా దేవదాసు.

మోహన్కి సుజాతకేమయిందోననే అను మానం పీడిస్తోంది రెండ్రోజుల్నుంచీ. సుజాత కేమన్నా అయితే ఎలా తెలుస్తుంది? అసలు సరిగ్గా ఇంటికి చేరిందా? గుండెలు కొట్టుకు న్నాయి మోహనికి కనీసం ఉత్తరం అన్నా




రాయొచ్చే! ఫలానప్పుడొస్తున్నానని నేనిలా అన్నాను వాళ్ళిలా అన్నారు- ఇది అయ్యింది ఇదవ్వలేదు అని.

ఎందుకు రాయలేదు?

రాయడానికి వీల్లేని పరిస్థితా?

మోహన్ షాక్ తిన్నంతగా అయిపోయాడు. అవును..... అలాటిదేదో జరిగింది. లేకపోతే ఉత్తరంకూడా రాయకుండా ఎందుకుంటుంది. ఈ విషయం ఇన్నాళ్లూ తనకెందుకు తట్టలేదు? వెళ్ళి సరిగ్గా ఏడురోజులయ్యింది. వెళ్ళిన రోజు ఉత్తరం రాయదు. తర్వాత రాసినా రావాలి. మొదటి నాలుగురోజులూ వస్తుందని చూడ్డంతోనూ, తర్వాత రెండురోజులూ ఏడుపూ, కోపం కలిసీ మోహన్ని ఆలోచించనివ్వలేదు. ఏదో అయింది. సుజాత బహుశా ఏ ఆపదలోనో చిక్కుకుంది. సందేహంలేదు.....

తెలుసుకోవాలి వెళ్లాలి ఎప్పుడు..... ఇప్పుడే ఈ నిముషమే...

మోహన్ వెంటనే పంకజవల్లి దగ్గిరకెళ్ళి విషయం అంతా చెప్పాడు. "నేను వెళ్లొస్తాను విషయం తెలుస్తుంది" అన్నాడు.

"మీరొక్కరే వెళ్ళద్దు. ఎవర్నన్నా తోడు తీసుకువెళ్లండి" అంది పంకజవల్లి.

"అలాగే.... ముందు హైద్రాబాద్ వెళ్తాను. నా ఫ్రండున్నాడు అతన్ని తీసుకుని వెళ్తాను" అని బైటికొచ్చాడు ఎదురుగా ఆఫీసుబాయ్. "సార్ మీకుంది ఇవ్వాళ ఉత్తరం" అన్నాడు. ఆఫీసుబాయ్ సాక్షాత్తూ దేవుడిలా వున్నాడు. గబగబా వుత్తరం తీసుకుని సీటులోకెళ్ళి కుర్చున్నాడు. కవరుమీద అక్షరాలు చంద్రాని వికాదు. ఇక తనకెవరూ రాయరు. సుజాత..... సుజాతే కాగితం బైటికితీశాడు కవర్లోనుంచి

నా మోహన్

ఏంరాయాలో తెలవటల్లా నా పరిస్థితి తల్చుకుంటే అవమానంతో చావాలన్పిస్తోంది. కేవలం నీ తలపు నన్ను బతికిస్తోంది. విషయానికొస్తా. నన్ను గదిలో బంధించారు. సంబంధాలు చూస్తున్నారు. బహుశా వారం తిరిగేలోపు నాకు పెళ్ళిచెయ్యాలని వాళ్లవూహ పెళ్ళి సంగతి వదిలెయ్ ...అది ఎలాగూ జరగదు కాని.. ఎలా బైటపడాలి అందరికన్నా యముడిలాగా మా పెద్దతమ్ముడొకడున్నాడు. వాడు సాక్షాత్తూ జంతువు. అక్కననికూడా చూడకుండా బండబూతులు తిడ్తున్నాడు. తలుపుమీద తన్నుతాడు. నామీద కసి. నేను కుటుంబం పరువు బజారుకెక్కించానని. ఈ ఉత్తరం రాస్తున్నా కానీ ఇదెలా పోస్ట్ అవుతుంది. ఇదొక సమస్య. ఏదోఒకటి చెయ్యాలి ఏనాడూ ఈ గది కేవలం జైలులా వుపయోగపడటానికే కట్టించారని వూహించలేదు. చీమ దూరడానికి సందులేదు. ఎలా... నాకోసం నువ్వెంత సతమతమవుతున్నావో తల్చుకుంటే నా గుండెలు పగిలిపోతున్నాయ్. మోహన్..... నా ప్రియమైన నా మోహన్. నా ప్రేమని ఈ అక్షరాలద్వారా చెప్పలేను. నువ్వు ధైర్యంగా వుండు. మార్గం ఆలోచించు. నేనూ ప్రయత్నం చేస్తా. ప్రతి నిత్యం ప్రయత్నం చేస్తున్నా ఇక్కడ్నించి బైటపడాలని మీ చంద్రంగారితో ఆలోచిస్తావుగదూ నేను ఆయనెంత చెప్పినా వినకుండా వచ్చినందుకు పశ్చాత్తాపపడని క్షణంలేదు. నాకు బుద్ధొచ్చిందనీ, చెంపలేసుకుంటున్నాననీ చెప్పు. ఎలాగోలా ప్లాన్‌చెయ్యండి. నన్నీవూర్నుంచి తీసుకుపొండి.

ఒకటి మాత్రం గుర్తుంచుకో. నేను నీదానిని. మనిద్దర్నీ ఎవరూ వేరుచెయ్యలేరు. తాత్కాలికంగా నాలుగు సమస్య లెదురవ్వచ్చు. వాటిని వివేకంగా పరిష్కరించుకుందాం. అధైర్యపడటం, ఆరోగ్యం పాడుచేసుకోవడం చెయ్యకు. మా నాన్న పేరు రంగయ్య. గుడివాడనుంచి భీమవరం వెళ్లే రూట్‌లో నాలుగయిదు కిలోమీటర్లుంటుంది. ఈజీగా తెలుస్తుంది. మరీ అవసరం అనుకుంటే చెరువుగట్టునున్న సిమెంటు డాబాలో వర్లక్ష్మి అనేపిల్ల మా పిన్ని కూతురు. కాస్త ఉపయోగపడచ్చు. నేనంటే దానికి ప్రాణం. కాని జాగ్రత్త.

మా నాన్నమీద నేను పెట్టుకున్న ఆశలన్నీ అడుగంటాయి. ఘోరంగా విఫలమయ్యాను, మనుమల్ని గురించి అంచనావెయ్యడంలో. మోహన్.... ఎంతో రాయాలని వుంది. కాగితాలూ పెన్నూ సమయమూ హృదయంనిండా రాయడానికి సరిపడా సామాగ్రీ అన్నీ వున్నాయి. కాని పెద్ద వుత్తరాన్ని బైటికి పంపడం మరీ కష్టం.

అందుకే ఆపి, దీన్ని నీకెలా పంపాలో ప్రయత్నాల్లో పడతాను. నన్నెలా తీసికెళ్తారో... నాకయితే ఏమీ తెలవడంలా కాని ఎదురుచూస్తూ వుంటాను.

నీ

సుజాత

ఉత్తరంమీద తారీఖు చూశాడు. నాలుగురోజులముందు రాసింది. అనుకున్నంతా అయిందన్నమాట.

"చంద్రం... యూ ఆర్ రియల్లీ గ్రేట్" అనుకున్నాడు మోహన్.

సుజాత బందీగా వుందనే విషయం తెలిశాక మోహన్‌కి కొండంత బలం వచ్చింది. ఏమీ ఫర్వాలా ఎలాగోలా తీసుకురావచ్చు. పైగా తనుకూడా ధైర్యంగా వుంది. ధైర్యంగా వుండమని రాసింది. వెంటనే పంకజవల్లి రూంలోకెళ్లాడు. ఉత్తరం ముందుంచాడు. ఆవిడ 'మో




హన్' అని చూసి 'చెప్పండి ఏమిటో' అంది.. "ఫర్వాలేదు... చూడండి. విషయాలు తెలుస్తాయి" అన్నాడు.

ఆవిడ పూర్తిగా చదివి "పోస్ట్‌గ్రాడ్యుయేట్ అయిన పిల్లని జాబ్ చేసుకునే పిల్లని ఇంత అనాగరికంగా బంధిస్తారా? దిసీజ్ టూమచ్" అంది. "ఏంచేద్దామనుకుంటున్నారు"

"ముందే అనుకున్నాను గదా! వెళ్ళి తీసుకొస్తాను."

"మీరు వెళ్ళకండి. మీ ఫ్రండుని పంపండి"

"ఎవరైతే యేం. నేనెవరో వాళ్ళెవరికీ తెలియదు. నేనెంతో చంద్రమూ అంతే"

"అవునుగదూ! సరే.... ఆయన్నికూడా తీసుకు వెళ్ళండి"

"అతన్ని తీసుకెళ్ళాల్లెండి. ఆయనదీ గుడివాడ దగ్గరే. ఎవరన్నా తెల్సిన వాళ్ళుండవచ్చు... వెళ్తాను" అని లేచి బైటికి రావడం రావడమే బస్టాండుకు వెళ్ళాడు.

★ ★ ★

'సాధ్యమైనంత త్వరగా హైద్రాబాద్ వెళ్ళి చంద్రాన్ని కలవాలి. చంద్రాన్ని తీసుకుని గుడివాడ వెళ్ళాలి. సుజాతని ఎలా ఆ ఇంట్లోనుంచి తప్పించాలి? అసలు గుడివాడలో పోలీసుల సహాయం తీసుకుని ఏకంగా పోలీసుల్తోనే వెళ్ళి సుజాతని తీసుకొచ్చేస్తే పోతుందేమో. ఎలాగో చెయ్యాలి. చంద్రం చూస్తాడ్లే.' ఇలా ఆలోచిస్తూ బస్సు కోసం ఎదురు చూస్తున్న మోహన్‌కి ఖాళీ చేతుల్తో బస్సు దిగిన సుజాత కన్పడింది. ఆశ్చర్యంతో నమ్మలేక మళ్ళీ మళ్ళీ చూశాడు. సుజాత మోహన్ని చూడలేదు. గబగబా అడుగులేస్తూ బస్టాండు దాటుతున్న సుజాతని సమీపించి 'సుజా' అన్నాడు మోహన్. ఉలిక్కిపడింది సుజాత.

మోహన్ని చూడగానే సుజాతకి కళ్ళల్లో నీరూరింది.

"ఎలా వచ్చేశావ్" అన్నాడు మోహన్.

"ఎలాగో వచ్చాన్లే" అంటోంది సుజాత

"వుండు... ముందు ఇంటికెళ్దాం. రిక్షా మాట్లాడ్తాను" అని గబగబా ఓ రిక్షాని పిలిచాడు.

బేరం సారం ఏమీ లేకుండానే ఇద్దరూ ఎక్కి కూర్చుని వెళ్ళాల్సిన చోటు చెప్పారు.

దోవలో సుజాత "మోహన్... అమ్మని, నాన్నని అందర్నీ వదిలేసి నీదగ్గిరకొచ్చేశాను" అంది.

మోహన్ ఆమె చుట్టూ చెయ్యివేసి, "ఎలా వచ్చావు?" అన్నాడు.

చిన్నగా నవ్వి- "వట్టి చేతుల్తో" అంది.

"అది గాదు... ఇంట్లోనుంచి..."

సుజాత అంతలోనే కోపం తెచ్చుకుని "ఎలా అడుగుతున్నాడో! వచ్చి నన్ను తీసుకరావల్సింది పోయి...."

"అదిగాదు... నీ వుత్తరం ఇప్పుడే అందింది. అది అందకముందే బైల్దేరాను"

"ఎక్కడికి బస్టాండుకా? అవునూ... బస్టాండులో ఎన్ని రోజుల్నుంచి నాకోసం చూస్తున్నావు"

"అబ్బ... అది కాదు లేవోయ్. మీ వూర్రావడానికి బస్సుకోసం చూస్తున్నా. అదంతా పోనీ గానీ, నువ్వేలా వచ్చావు..."

"బస్సులో చూశావుగా"

"చంపుతున్నావు సుజా"

"అవును... అందుకే అందర్నీ వదిలి వచ్చాను"

"నేననేది అదికాదు"

"నేననేది అదే"

"ప్లీజ్ సుజా..."

బసవడి సాయంతో తను ఎలా ఇంట్లోంచి బైటపడి ఎవరికీ తెలియకుండా వచ్చేసిందో సుజాత చెప్పింది.

సుజాత సాహసాన్ని నివ్వెర పోయి విన్న మోహన్ "సుజా... నిన్నెన్నడూ కష్టపెట్టకుండా చూసుకుంటాను" అన్నాడు.

★ ★ ★

"నువ్వేం విగులు పడబోకమ్మాయ్ సుజాత! మీ పెద్దవాళ్ళు లేనంత మాత్రాన మేమంతా లేమా?" అంది పంకజవల్లి.

"దిగులేం లేదండీ" అంది సుజాత.

"ఆ... అలా అంటారుగాని.. దిగులులేకుండా ఎట్లా వుంటుందీ? కని పెంచిన వాళ్ళు

దగ్గరుండి జరిపిస్తే ఆ పెళ్లి ఆదేవ వేరు... ఎం చేస్తార్లే. వాళ్లు ససేమిరా అన్నారంటున్నా రాయె...'' అన్నాడు సుందర్రావు.

''వాళ్లు వప్పుకున్నా మేం దండల పెళ్లే, సింపుల్‌గా చేసుకుందామనుకున్నాం'' అన్నాడు మోహన్.

''అలాగే కానివ్వండి'' అంది పంకజవల్లి.

''మీరు చేయించాలి'' అంది సుజాత.

''నేనా?'' అని చిన్నగా నవ్వింది పంకజవల్లి.

''అవును... మీరే చేయించాలి'' అన్నాడు మోహన్.

చిరునవ్వులు నవ్వాడు సుందర్రావు పరమేశం వంక చూసి.

ఆ నవ్వులు పంకజవల్లి కంటపడనే పడ్డాయ్.

''నేను కాదులే... ఇక్కడ ఎక్సెమ్మెల్యే ఒకాయనున్నారు.. పాతరోజుల్లో స్వాతంత్ర్యం కోసం జైలుకెళ్లొచ్చినాయన వీరరాఘవయ్యగారని....'' అని ఆగింది పంకజవల్లి.

''అవునవును... వీరరాఘవయ్యగారు అయితే బాగుంటుంది'' అన్నాడు పరమేశం.

''అవును... ఆయనైతే చాలా బాగుంటుంది. ఆయన చక్కగా మాట్లాడ్తారు కూడా. అదీగాక మనం ఎప్పుడు ఎక్కడికి రమ్మంటె అక్కడికి వస్తారు'' అన్నాడు సుందర్రావు

''ఎందుకు మేడం... మీరు..'' అంటోంది సుజాత.

''నాదేముంది. నేనెలాగూ వుంటాను గదా. కాస్త పెద్దవాళ్లయితే నాలుగు ముక్కలూ చెప్తారు. వినడానికీ, చూడ్డానికీ కూడా బాగుంటుంది... అన్నట్టు మీ అమ్మగారున్నారన్నారు గదూ?'' అని మోహన్నిఅడిగింది పంకజవల్లి.

''వుంది గాని... '' అని ఆగాడు మోహన్.

''ఏ... ఆవిడకీ ఇష్టం వుండదా?''

''ఆవిడకి ఇష్టముండకపోవడం ఏమీ లేదులెండి. కాని...''




''అదేమిటి? ఆవిడ్ని తీసుకురండి. ఇష్టమైన తల్లిని వదిలి ఇష్టం లేని తల్లిదండ్రుల దగ్గర కెళ్లడం ఎందుకు? మీ అమ్మని తీసుకురండి. ఎక్కడ ఆవిడుండేది?''

''మేం ఏమనుకుంటున్నామంటే మా పెళ్లి సాధ్యమైనంత త్వరగా అంటే వీలయితే ఇవ్వాళే...''

''ఓర్నీ! భలేవాళ్లండీ మీరు'' అని పెళపెళ నవ్వాడు సుందర్రావు.

పరమేశం కూడా బిగ్గరగానే నవ్వాడు. ''అదేంటండీ. ఇన్నాళ్లు ఆగారు. రెండు మూడు రోజులాగలేరా...?'' అని కూడా అన్నాడు.

''ఎందుకంత త్వరపడుతున్నారు?'' అంది పంకజవల్లి.

''ఎప్పుడేఆటంకమొస్తుందోనని''

''అంటే... ఇంకా ఎక్స్‌పెక్ట్ చేస్తున్నారా... సుజాత వాళ్ల వాళ్లు అడ్డు తగుల్తారేమోనని'' అంది సాలోచనగా పంకజవల్లి.

''అడ్డు తగుల్తారని కాదుగాని... తాత్సారం చెయ్యడం అనవసరమని...''

''సరే... అయితే అలానే కానీండి. కాని ఇవ్వాళ కుదుర్తుందా?''

''ఇవ్వాళ కాకపోతే రేపు సాయంత్రం''

''రేపా? రేపెట్లా చేసుకుంటారయ్యా బాబూ! శుభమా అంటూ పెళ్లి చేసుకుంటూ, అదీ పెద్దలకిష్టం లేకుండా. రేపు అమావాస్య'' అన్నాడు పరమేశం.

''మాకా పట్టింపులేమీ లేవులెండి'' అంది సుజాత.

''మీకు లేకపోయినా... అమావాస్యనాడు పెళ్లేమిటి?'' అంది అప్పటివరకూ మాట్లాడకుండా వున్న ఛాయ.

''పట్టింపు లేదంటే మళ్లీ అమావాస్య అంటారేమిటి?'' అన్నాడు మోహన్.

''అది కాదులే. ఒక పని చెయ్యండి. రేపు అమావాస్య. ఎల్లుండి పాడ్యమి వెళ్లి సాయంత్రానికి విదియ వస్తుంది. మీకు నమ్మకాలున్నా లేకున్నా ఎల్లుండి సాయంత్రం చేసుకోండి. మనము కాస్త హాలూ అవీ మాట్లాడుకోటానికీ బాగుంటుంది. వీరరాఘవయ్యగారితో కూడా చెప్పాలా? ఆయన వూళ్లో వున్నాడో లేదో....'' అన్నాడు సుందర్రావు.

"అయితే ఒక పని చెయ్యండి మోహన్. మీ అమ్మ ఎక్కడుంది?"

"మా అక్క దగ్గర... మిర్యాలగుడా దగ్గర...."

"మరింకే.... రేపు వెళ్లి మీ అమ్మనీ, వస్తా నంటే అక్కనీ తీసుకుని వచ్చేయండి. ఎల్లుండి సాయంత్రం పెళ్లి చేసుకోండి... ఎందుకంటే... మీ ఇద్దరూ మన గ్రామాల్లో టీచర్లకీ నలుగురు పెద్దలకీ చెప్తే బాగుంటుంది గదా... వాళ్లూ సంతోషపడతా రు... ఏమంటారు...?" అంది పంకజవల్లి.

"అవును..." అని సాలోచనగా సుజాత మోహన్ వంక చూసింది.

మోహన్‌కి కూడా అది నిజమేననిపించింది! రమాదేవి, హేమ.... ఈరమ్మ వీళ్లనన్నా కనీసం పెళ్ళికి పిలవాలి.

తమ పెళ్ళిచూసి మనమరాలు కూతురు పెళ్ళికి పిలవని బాధ ఈరమ్మ మర్చిపోవాలి.

కనీసం ఒక్కరోజన్నా ఈరమ్మకీ, మరికొందర కీ భోజనం.... కడుపునిండా మంచిభోజనం పెట్టి... వాళ్ళ సంతోషాన్ని చూడాలి

"అవును... తప్పక పిలవాలి" అన్నాడు దృఢంగా మోహన్.

"మరి రేపే మీరు బైల్దేరి మిర్యాలగూడా వెళ్లండి. అమ్మనీ వాళ్లనీ తీసుకురండి. ఎల్లుండి సాయంత్రానికి ఇక్కడ అన్ని ఏర్పా ట్లూ మన స్టాఫ్ చేస్తారు" అంది పంకజవల్లి.

"అవును మేడం ఇది చాలా బాగుంది" అన్నారందరూ.



ఈశ్వరమ్మకి సంగతి తెలవగానే చాలా సంతో షపడింది.

సుజాతల్ని చూస్తే ఆమెకి మంచిరోజులు మళ్లీ వస్తున్నట్టే అన్పించింది.

"మల్ల ఎన్నడు పెల్లి?" అంది ఈరమ్మ.

"ఎప్పుడేమిటి... ఎల్లుండి సాయంత్రం నిన్ను హేమగారు తీసుకొస్తారు, వచ్చెయ్" అన్నాడు మోహన్.

తలూపి కాస్త ఆశగా మోహన్‌వంక చూ సింది ఈరమ్మ.

"ఏమిటి?" అన్నాడు మోహన్.

"నామనమ్మడి కొడుకు, చిన్నపోరడు. అన్నిభీ తీన్కస్త. నాచెయి పట్టుకుంటడు" అంది.

నవ్వి "అలాగే తప్పకుండా తీసుకురా" అంది సుజాత.

తమకు తెలిసిన మోహన్ సుజాతల పె ళ్లని తెలిసి హేమావాళ్లందరూ చాలా సంతోష పడ్డారు.

వారితో సమవయస్కులవడంవల్లా, మోహన్ ఎప్పుడూ అందరితోనూ మంచిగా మాట్లాడ్డంవల్లా హేమ వారితో సన్నిహితంగా మాట్లాడ్తుంది. ఆఫీసుక్కావాల్సిన విషయాలు చూసుకుంటూనే, డాటా రాసుకుంటూనే, వూళ్లో వాళ్లగురించీ, ఆ పరిస్థితుల గురించీ అవీఇవీ వాళ్లు మాట్లాడుకుంటూనే వుంటారు.

అలానే ఇవ్వాళకూడా నవ్వుకుంటూ, మాట్లా డుకుంటూ పనులుచేస్తున్నారు.

అంతలో వచ్చిందొక గొంగళి.

అవును... పైనించి కిందిదాకా గొంగళి వేసు కుని ఒకతను నడిచివచ్చాడు. గొంగళి నడుస్తు న్నట్లుంది - కింద రెండు కాళ్లతోసహా.

"పెయ్యబాగలే! గోలీలిస్తవా పంతులమ్మా"

"ఎవరికి?"

"ఇగ్గో" అని గొంగళిలో దాచిన చిన్నకుర్రా ణ్ని చూపించాడు.

"బతికించావు... నీకనుకున్నా" అని హేమ నవ్వింది.

"నీ మన్మడా!" అన్నాడు మోహన్.

"ఆఁ... అవ్"

"నీకోడలు పేరు మాతాన ఎక్కించినవా?"

"లే"

"ఎందుకు"

అతను మాట్లాడకుండా నుంచుని మోహన్

వంక చూస్తున్నాడు. అతని కళ్లు ఎక్కడో గోతుల్లో. మళ్లీ దాన్లో ఓ కంటిని మూసి చూస్తు న్నాడు. అందరికిలాగానే గడ్డం బాగా మాసివుంది.

"నీకోడలి పేరెక్కించి ఇస్కూలుకి పంపు తావా? నీ మన్మడికి గోలీలిస్తం" అంది సుజాత అతని చూసలోనే.

"గోలీలియ్యర్రి" అన్నాడు క్లుప్తంగా.

హేమ నవ్వుతూ అంది - "అది ఆయన స్లోగన్. రోజుకో పోరన్నో పోరి నోదేస్తడు. రోజు గోలీలియ్యాలె"

"నీకెంతమంది మన్మలు, మన్మరాళ్ళు" అన్నాడు మోహన్.

"మస్తుమంది"

"అదీ! ఎంతమంచిగా జెప్పినవ్. తియ్... గీమన లిస్టుల పేర్లు ఎవరివయితే లెవ్వో అల్లపిల్లలంత గీయన మన్మలు, మన్మ రాండ్లు"

"అదేంటి?"

"గంతెమల్ల! ఈనికైతే ఎవ్వర్‌లేరు. గాని... అందరూ మన్మలే" అని నవ్వింది హేమ. "ఆయన్తో మీరు జరసేపు మాట్లాడుర్రి. నేనీ పనిజేసిస్త మీకు" అని తన పనిలోపడింది హేమ. వీళ్లకిద్దరికీ చెయ్యడానికేమీలేదు ఇప్పు డు. అతన్తో బైట కూర్చున్నారు. మేమడిగిందా నికి చెప్తు గోలీలిస్తాం - అని ఆశపెట్టి మరీను.

"నీ పేరేంది?" అన్నాడు మోహన్.

"బుచ్చిగాడు"

"ఎన్నేల్లు?"

"ఆఁ"

"నీకెన్నెళ్లుంటయ్"

"రజాకార్ల జమానకిరవైయుంటుండొచ్చు"

"వాళ్లేమన్నా చేశారా నిన్ను?"

"నన్నేం జేస్తర్..."

"వాళ్లన్నువ్వేమన్నా చేశావా?"

"నేనేం జేస్త"

"వాళ్లు ఎవర్నీ ఏమీచెయ్యలేదా?"

"ఎందుకు చెయ్యలే?"

"ఏంచేశారు?"

"చంపిర్రు"

"ఎవర్ని"

"మందిని!"

"మందిలో నువ్వులేవా?"

"మందలో వున్న మేకల్ని తోల్కపోతి"

"మరి నీమందనేం చెయ్యలావాళ్లు?"

"లే"

"నీకసలెప్పుడన్నా కనపడ్డారా?"

"మస్తుమార్లు"

"ఏంజేసేవాళ్లు?"

"మందల వండుకుని దాంకునేటోల్లు"

"నువ్వేం అనేవాడివిగాదా?"

"మన్నేం అననోల్లని మనమేటికనాలె"

"మేకల్నేం అనేవారుగాదా?"

"మేకల్నేం అంటార్?"

"పాలుతాగడం"

"పాలుతాగరామల్ల!"

"చంపడం"

"మేకల్ని వండుకోరా!"

"నీ మేకల్ని వాళ్లెట్లా వండుకుంటారు?"

"అల్లు జెయ్యని పనున్నాది!"

"వాళ్లు మేకల్ని చంపుతోంటే నువ్వేం చేసే వాడివీ?"

"దాంకునేటోడ్ని"

"వాళ్లంటే భయమన్నమాట!"

"పేనం తీసెటోడ్నిచూస్తే నువ్ భయపడవ్లే"

"అచ్చా! అయితే అప్పుడేం చేశారు"

"ఏంజేస్తరు కూర తీస్కపోయిర్రు"

"నువ్వేంజేశావ్"

"వూర్లనుంచి మా అల్లుడొచ్చిండు"

"అల్లుడా?"

"అవ్ అక్కకొడ్కు"

"వచ్చి ఏమన్నాడు?"

"ఏమంటడు?"

"ఎందుకొచ్చాడు?"

"ఎందుకొస్తడు"



"మరి వచ్చాడన్నావుగా"

"వచ్చిండు"

"వచ్చి ఏమంటాడు?"

"రమ్మన్నడు"

"ఎక్కడికి"

"వూల్రకి"

"వెళ్లావా?"

"ఎల్లను మల్ల!"

"ఏమైంది?"

"ఏమవుతాది?"

"తర్వాతేంజేశావ్"?

"పొలం వూరా అమ్మితి"

"ఎందుకు?"

"ఏంజెయ్యాలెమల్ల!"

"చెయ్యటానికేమీ లేక పొలం అమ్మావా?

"గట్లా"

"మరెందుకమ్మావయ్యా పొలం!"

"కర్సులగ్గావద్దా"

"ఎంత పొలం?"

"ఎన్మిదెకరాలు"

"ఎన్మిదెకరాల పొలం అమ్మి ఏంఖర్చుచేశా?"

"ఏం ఖర్చుజేస్త"

"మరేంజేశా?"

"ఏందది"

"డబ్బయ్యా"

"డబ్బేడుంది"

"పొలం అమ్మినావ్‌గదా?"

"అమ్మిన"

"మరి ఆ డబ్బేది?"

"ఇంకిప్పుడుంటాది"

"ఇప్పుడుకాదు. అప్పుడే ఏంచేశావ్...?"

కర్సవదా మల్ల"

"దేనికి?"

"చావుకి"

"ఎవరిచావు?"

"మమ్మ, మా నాయన. అందరి చావుకి'

"వాళ్లెట్లా చచ్చిపోయారు?"

"చావరామల్ల"

"ఒక్కసారేనా?"

"అవ్"

"ఎట్లా?"

"అగో...."

"ఇక్కడేదో సస్పెన్సుంది" అంది గొంతుతో సుజాత మోహన్ చెవి దగ్గర.

"మీ అల్లుడొచ్చి నువ్వు మేకలదగ్గరున్నప్పుడు ఏంచెప్పాడు?"

"వూర్లకి రమ్మంటడు"

"ఎందుకు?"

"వూర్లకెందుకెళ్తారు?"

"మీ అల్లుడు వూర్లకి రమ్మనంగానే నువ్వేమన్నావు?"

"ఏమంట!"

"ఎందుకూ అని అడగలా?"

"అడిగిన!"

"ఏమన్నాడు?"

"ఏమంటాడు?"

"ఏమనలేదా?"

"ఎవలు?"

"మీ అల్లుడు?"

సంభాషణ పూర్తయినట్టు వూరుకుని "మల్ల ఇయ్యర్రి గోలీలు" అన్నాడు.

"ఇస్తంలేగానీ... మీ అల్లుడేమన్నాడు?"

"ఏందయ్యా... నువ్‌భీ మంచిగున్నవ్"

"మీ అల్లుడేమన్నాడు?" అంది సుజాత

"ఏమంటే మీకేంటికి?"

"వూరికినే" అన్నాడు మోహన్.

"ఊకోమల్ల... గోలీలియ్యర్రి"

"ఇస్తాంగానీ... పొలమెందుకమ్మినావు?"

"ఎన్నిమార్లు చెప్పాల్నయ్యో"

"మీ అమ్మనాన్నలు చచ్చిపోయారన్నావుగా?"

"అవ్"

"వాళ్లే చచ్చిపోయారా?"

"మల్ల నేనా?"

"జబ్బుచేసిందా?"

"లే"

"మళ్లెట్లా చచ్చిపోయారు?"

"కత్తితో పొడిస్తే బతుకుతారా?"

"ఎవరు పొడిచారు?"

"ఆల్లే..."

"ఎవరాల్లు?"

"రజాకార్లు"

"మరప్పుడేంచేశావ్?"

"పొలమమ్మిన"

"ఎవరికి?"

"ఇంకెవలికి దొరకి..."

"ఎంతకి?"

"మూడొందల్కి"

"ఎన్మిదెకరాలూ మూడొందలకా?"

"అవ్"

"మూడొందలూపెట్టి మీ అమ్మానాన్నల చావుచేశావా?"

"అవ్"

 

"తర్వాతేమయింది?"

"ఏమయితది?"

"మీ అమ్మానాన్నల్ని చంపిన రజాకర్లని నువ్వేమీ చెయ్యలేదా?"

"ఊకుంటామా?"

"ఏంచేశా?"

"ఏంచేస్తాం?"

"ఏదోచేశానన్నావే?"

"చెయ్యమా మల్ల"

"ఎందుకుచెయ్యం! ఏంచేశావని?"

"ఏం చెయ్యాల్నో గదే!"

"దాక్కున్నావా?"

"నువ్వయితే గట్లనేజేస్తవులే!"

"మరి మేకల్ని జంపితే నువ్వదేగా చేసింది!"

"మేకలు అమ్మనాయన్లు వక్కటేనా?"

బుచ్చయ్య 'గోలీలియ్యర్రి' అనేమాట ప్రస్తుతానికి మర్చిపోయాడు. యవ్వనంలో తనున్న తమవూరూ, భోనగిరీ... అవన్నీ గుర్తొచ్చినాయి. అంతావరసబెట్టి చెప్పేశాడు.

"నేనూర్ల కెల్లిన ఇంట్ల అంత ఏముంది. ఏడ చూసినా పీన్గలే అమ్మనాయన, అక్కసెల్లెంట్లు... అందర్నీ ఆ రజాకర్లు జంపేశిర్రు. ఇంక నాతాన ఒక్క ఈటెవుండె. వుచ్చుకున్న. రజాకర్లుండేది మాకందర్కి ఎర్కే... వుర్కినం. పెద్దఇల్లు. దానిచుట్టూ నుంచున్నం. బైటికురికి రమ్మని కేకేసినం. రాలే. ఇగ నేను తలుపుగల్గొట్టిన, ఆల్లు బాగతాగి వూగుతున్నారు. మమ్మల్ని జూసి కత్తులు బుచ్చుకున్నారు. ఆల్లతాన తుపాకులు భీ వున్నయ్. గవన్నీ గుంజుకున్నం. వరసగా నడిపించి మా దొడ్లోకి తెచ్చినం మా అమ్మానాయన్లందరు దొడ్లనే పడున్నారు. బొందలగడ్డకి తీస్కపోలే ఇంక. మేమంత యాభైమందిముంటిమి. ఆల్లు అంతాగల్సి పదిపన్నెండుమంది. మా అమ్మనాయన్ల దగ్గర నుంచోబెట్టినం. కత్తొక్కటి... ఆల్లదే... వుచ్చుకున్న. ఇంక కనబినమని ఏడుగుర్ని పొడిచి చంపినా. నా ఇద్దరు మేనల్లుళ్లు, మావక్కింటాయన ముగ్గురు అయిదుగుర్ని జంపిర్రు. ఆ రక్తంతో మావాళ్లందర్ని తడిపి యింగప్పుడు చావుచేసినం! అందరం మంచిగా తాగినం. రజాకర్ల పీన్గలమీదెక్కి తొక్కి గంతులేసినం. పోలీసులొస్తరన్నరు. పీన్గలనొదిలి వురికినం, వుర్కినం" అని వూరుకున్నాడు.

"తర్వాతేమయింది?" ఆతృతగా అన్నాడు మోహన్?

"ఏంగాలే"

"పోలీసులు పట్టుకోలా?"

"లే"

"ఎందుకనీ?"

"మేం దొర్కినమా?"

"అప్పట్నుంచి దొరకలేదా?"

"లే"

"తర్వాతేమయింది?"

"ఏమవలే"

"ఇప్పుడు?"

"ఇప్పుడేంది?"

"మరిప్పుడు పట్టుకోరా?"

"ఎవలు?"

"పోలీసులు"

"ఎందుకు?"

"అంతమందిని చంపినావని"

"ఎవలు?"

"నువ్వు"

"ఏంది?"

"అంతమందిని చంపావని పోలీసులు పట్టుకోరా?"

"ఎవలు చంపిర్రు?"

"నువ్వు"

"లే"

"చంపినానన్నావుగా?"

"ఎవలు?"

"నువ్వు"

"ఎవలతో?"

"నాతో"

"నువ్వు పోలీసువా?"

"ఓహో... పోలీసులతో చంపలే దంటావా?"

"లే"

"అనవా"

"లే"

"ఎందుకని?"

"ఏంది"

"పోలీసులతో చంపానంటావా?"

"నేనెందుకంట!"

"చంపలేదంటావా?"

"నేనెందుకంట"

"మరి"

"నువ్వేమంటావ్?"

"ఏంటది"

"నిన్నడిగితే నువ్వేమంటావ్"

"నన్నెందుకడ్గుతరు"

"నువ్వు చంపావుకాబట్టి"

"నేనే జంపినోణ్నని ఆల్లకెట్ల దెలుస్తది?"

"అనలు నీపేరు బుచ్చిగాడేనా?"

"అవ్!"

"అప్పుడు"

"గప్పుడు మేకలోడు. ఇప్పుడు మేకలేడున్నాయ్"

"మీ మేనల్లుళ్లేం చేస్తున్నారు?"

"కొలువు"

"మరి ఈ వయసులో నిన్ను పనిచెయ్యనిస్తున్నారే?"

"ఆల్లు చేస్తున్నారుగదా!"

"నీకు పెళ్లయిందా?"

"ఆఁ"

"పెళ్లాముందా?"

"పెల్లయినంక పెల్లాముండదా?"

"పిల్లలా?"

"లే"

"ఎందుకని?"

"అల్లనడుగు"

"ఎవర్ని?"

"పిల్లల్ని"

"ఏరీ?"

"లేరు"

"నీ పెళ్లాం పనిచేస్తుందా?"

"చెయ్యిదా మల్ల!"

"నిన్ను మంచిగ చూస్తుందా?"

"నాకన్న మంచిగ చూస్తుంది"

"అయితే ఇప్పుడు సుఖంగానే వున్నానంటావ్?"

"సుఖమాడికెల్లొస్తది"

"కష్టంగానే వున్నావన్నమాట"

"కష్టాలేడున్నయ్"

"మరేమంటావ్?" అంటూ వచ్చింది హేమ.

"లొల్లిచెయ్యకుర్రి, గోలీలియ్యుర్రి అంట" అన్నాడు లేస్తూ బుచ్చయ్య.

పిల్లాణ్నిచూసి గోలీలిస్తూ హేమ "ఇప్పుడేమంటావ్?" అంది.

"ఈ సదువులు బంద్‌చేసి వూల్ల అందర్కి నాలుగ్గింజలు వంచిపెట్టుమంట. పెడ్తరా?" అన్నాడు బుచ్చయ్య.

ఎవరూ మాట్లాడలా. మాట్లాడలేదనేకంటే మాట్లాడలేకపోయారనడం సరిగ్గా వుంటుంది.

అందరివంకా ఓసారి చూశాడు బుచ్చయ్య.

"వూల్ల మందంత ఆకల్తోజస్తరు. అప్పుడు భీ ఆ శవాల్కి మీరు సదువే జెప్తమంటార్లే" అని మరోసారి చూసి వెళ్లిపోయాడు బుచ్చయ్య.

బుచ్చయ్య ఆ మాటలు తమని మాత్రమే అన్నాడని మోహన్ నమ్మలేకపోయాడు. చివరగా అతను వెళ్తూ చూసిన ఆ చూపు నాగరిక మానవుల్నందర్నీ తిరస్కారంగా చూసిన ఆ చూపు.

చచ్చేవరకూ వూరుకుని చచ్చాక కూడా, శవాలయినాక కూడా చదువే చెప్తామా?

ఈ జనాలక్కా వల్సింది ఈ చదువుకాదు, వారికి మరో రకమైన చదువు కావాలి? అది ఎవరు చెప్తారు?

"ఏమిటోయ్ మళ్లీ అంత డల్‌గా అయిపోయావు?" అన్నాడు సుజాత కళ్లలోకే చూస్తూ మోహన్.

సుజాత దీనమైన మొహాన్ని చూస్తూ- "ఏమిటి... మీ అమ్మా నాన్న గుర్తొచ్చారా?"

అన్నాడు.

"కాదు.... వాళ్లుగుర్తొచ్చినా దిగులు పడటానికేముంది. వాళ్లంతా శుభ్రంగానే వున్నారు. మోహన్..... ఈ వూళ్లెళ్ళివచ్చినప్పుడల్లా మనం ఏదో నేరం చేస్తున్నట్టు ఫీల్ అవుతున్నాను. వూళ్లల్లో ప్రజలు అనుభవిస్తున్న దరిద్రం మనని అంటని దరిద్రం. ఏమిటో మోహన్.... మనం ఎంత సుఖంగా బతుకుతున్నాం. ఇలా వాళ్ళు జన్మలో బతగ్గలరా. అన్నానికి మొహం వాచిదినదినగండంగా వాళ్లు అలా రోజులు గడుపుతోంటే నిముషనిముషం మృత్యువుకి దగ్గిరవుతూ వాళ్లలా కృశించి పోతుంటే మనం నాగరీకులం, చదువుకున్నవాళ్లం, అన్నీ తెలుసని విర్రవీగేవాళ్లం మన సంస్కారం ఏమిటి? మనం జీవితం కోసం ఆడుతున్న నాటకం కాదూ, ఈ సంక్షేమపథకాలూ ఈ చదువుల బూటకాలూ..." అని మాట్లాడలేక ఆగిపోయింది సుజాత!

దాదాపు టూర్‌కెళ్ళివచ్చిన ప్రతిరాత్రీ ఇలా మనసులు పాడుచేసుకుని ఎప్పటికో నిద్రలోకి జారుకోవడం ఈమధ్య మామూలయిపోయింది.

"అదికాదు మోహన్.... ఏ సమస్యయినా మనకొస్తేనే మనం పరిష్కారం ఆలోచిస్తాం. ప్రేమకోసం నేను చిన్నప్పట్నుంచి పెంచిపోషించిన ఎంతో ప్రేమించిన తల్లిదండ్రుల్నే వదిలేసి వచ్చేశాను. నా ప్రేమని సఫలంచేసుకోవడానికి అవసరమైన స్టెప్స్ తీసుకున్నాను. ఈ కరువునుంచి ఈ ఆకలి చావుల్నుంచి కనీసం కొంతమందినైనా మనం రక్షించలేమా? మనం ఈ ప్రజల కోసం ఏమీ త్యాగం చెయ్యలేమా? ఈ సమస్యని మన స్వంత సమస్యలా తీసుకోలేమా? పరిష్కారం ఆలోచించలేమా? ఈ ప్రశ్నలు నన్ను నిలవనివ్వడం లేదు. ఏపనీ శ్రద్ధగా చెయ్యనివ్వడంలేదు.

అన్నం తింటోంటే ఇదిలేక ఇవ్వాళ చచ్చిపోబోతున్న వృద్ధులు, పిల్లలు గుర్తొస్తున్నారు.

'ఇంకాస్త పెట్టుకో అని ప్రేమగా నువ్వన్నప్పుడల్లా నామీదా నీమీదా కోపం వస్తోంది.

"అసలీ జీవితాలిలా జీవించడానికి మనం అర్హులమేనా? అని ఏదో తెలియని గిల్టీనెస్ నన్ను తరుముతోంది. ఎలామోహన్.... ఏంచేసి మనం మన బాధ్యతల్ని సరిగ్గా నిర్వహించగలం. మనతోటి మానవులుకూడా కాస్త సుఖంగా గడపటానికి మనమేమీ చెయ్యలేమా?"

"సుజాత అంటున్న ప్రతిమాటా ఆమె పడ్తున్న ఆవేదనా అన్నీ మోహన్‌కీ అనుభవంలోవున్నవే.

ఏంచేస్తాం? ఏంచెయ్యగలం? వ్యక్తులుగా ఏ ఒకరిద్దరో చెయ్యగల పనేనా ఇదీ? అందరూ అలానే అనుకుంటే? ఎవరికివారు వారి సుఖాల్నేవారు చూసుకుంటే... అనాథలు, అభాగ్యులు, అన్నార్తులు... వాళ్లగతేమిటి?

-అన్నీ ప్రశ్నలే.

నీచుట్టూ ఆకలితో అలమటించే చూపులు, ఆ చూపుల మధ్యనువ్వు కడుపునిండా తింటున్నావు. నీకిక శాంతి ఎక్కడిది? ఆ చూపులకి కారణమైన ఆకలిని తీర్చినప్పుడే ఎవరికైనా శాంతి! అందుకే ఆ ఆకలి సమస్యలేకుండా చెయ్యడానికే పనిచెయ్యాలి. అదే ఎలా?

వారిమీద సానుభూతితో హృదయం నిండుతుంది. కాని సానుభూతివల్ల వారి కడుపులు నిండవు. అలాగే ఏపెళ్ళికో, పేరంటానికో ఏ ఈరమ్మనో, బుచ్చయ్యనోపిలిచి ఓపూట పెళ్ళి భోజనం పెట్టినా సమస్య తీరదు. తనొక్కడూ ఏమీ చెయ్యలేడు.

మోహన్‌గాని, సుజాతగాని అన్నం తినడం మానినా ఏమి ప్రయోజనం లేదు.

"అవును మోహన్.... నువ్వొక్కడవే ఏమీ చెయ్యలేవు. అలానే నేనొక్కదాన్నీ ఏమీ చెయ్యలేను. కాని ఇక్కడున్నది నువ్వూనేనూ మాత్రమే కాదు. మనచుట్టూ మనుషులున్నారు. వారిలో మనసులున్నాయి. అందరూ మనలానే ఆలోచిస్తున్నారేమో? వారందర్నీ కలవాలి. ఏం చెయ్యగలమో ఆలోచించాలి. అందరికన్నా బాధలుపడుతున్న ప్రజలున్నారు. వారిని వారి సమస్యల పరిష్కారం కోసం ప్రభుత్వం మీద పోట్లాడమని చెప్పాలి.

"అవును. మనసమస్యని మనం పరిష్కరించుకున్నట్టే ఎవరి సమస్యని వారు పరిష్కరించుకోవాలని చెప్పాలి. దానికి మనం తోడ్పడాలి. మనం అవసరమైతే వారిని ముందుండి నడపాలి. మనవారందర్నీ కలిసి దీనికొక ప్రో

గ్రాం వెయ్యాలి. అలాగే పంకజవల్లిగారితో మాట్లాడి గవర్నమెంటు నుంచి కూడా మనం ఏమన్నా గ్రాంటులు సంపాదించి మందుల్తోపాటు గింజలు కూడా ఇవ్వగలమా చూడాలి.''

''అదంతా జరిగే పనికాదులే. వాలంటరీ ఆర్గనైజేషన్లేమన్నా తీర్చుద్దాయేమో చూడాలి గాని. ప్రజలు పెద్దసంఖ్యలో కదిలి ముందుకొస్తే తప్ప ప్రభుత్వం ఏ పనీచెయ్యదు. అదొక దున్నపోతు. బురదలోదున్నపోతు. దాన్ని ఎంత అదిలించు లేవదు. కొడితే ఇక తప్పద నుకుంటే అప్పుడు... లేచి రెండడుగులేస్తుంది. ప్రభుత్వమూ అంతే. తప్పదు. ఈ జనం పూరుకోరు అనేది చాలా స్పష్టమైతేనే తప్ప దానికి చీమకుట్టినట్టుండదు. మోహన్.... మనం నిజంగా ప్రజలకోసం ఏమయినా చెయ్యాలి''

''అవును. చెయ్యకుండా వుండలేని పరిస్థితులు... మనచుట్టూ ఏమీ చెయ్యకుండా మనం ప్రేమగా వుండలేం మనంకూడా ఒకర్నొకరం ప్రేమించుకోలేం శాంతివుండదు''

''అవును''

''ఈరోజుల్లో కూడా కులాంతర వివాహాలు ఇన్ని సమస్యలకు లోనవడం అంటే నిజంగా ఇది మన దౌర్భాగ్యం'' అంది సుజాత.

''అమ్మాయ్ ఈ రోజులు ఈ రోజులు అని మీరంతా అంటూంటారు. అవి ఏ రోజులగురించీ?'' అన్నాడు వీరరాఘవయ్య.

''అంటే?''

''అంటేనా! నేను చెప్తాను. ఈ రోజులు అని మీరంటున్నారంటే... ఇంత అభ్యుదయమో, సంస్కారమో సాధించిన ఈ రోజులు అనీ అర్థం... అంతేగదా'' ఆయనే తన ప్రశ్నకి జవాబు కూడా ఇచ్చాడు.

''అవునండీ''

''నేనొక్కటి చెప్తాను నమ్మండి. ఈ రోజులకన్నా మా రోజుల్లోనే ప్రజలు సంస్కారవంతంగా, స్వేచ్ఛగా, న్యాయంగా, చైతన్యవంతంగా, స్వతంత్రంగా... ప్రవర్తించారు... ఏదన్నా మూఢవిశ్వాసమో, కుసంస్కారమో వుందంటే అది మంచిదికాదని తెలవకపోవడంమూలానే అలావున్నారు. ఇవ్వాళ... ఇవ్వాళేమిటి జరుగుతోంది. ప్రతి సమస్యకీ పరిష్కారం తెలుసు. ప్రతి జబ్బుకీ మందుంది. ప్రతి ప్రశ్నకీ జవాబుంది. కాని... ఏది.. ఒక్కడు న్యాయంగా ఆలోచిస్తున్నాడా? ఒక్కడు పరోపకారదృష్టితో వుంటున్నాడా? ఒక్కడు మూఢసనాతనమైన పనిచెయ్యకుండా మాన్తున్నాడా? ఎదటివాణ్నిచావనీ... నీకు రెండు రూపాయలు జేబులో పడితేచాలు- ఇవేగద మీరు ఓ పొగుడుకునే ఈ రోజులు... మీరోజులు'' వీరరాఘవయ్యగారికి ఆవేశమేకాదు ఆయాసంకూడా ఎక్కువే.

''మీరన్నది అక్షరాలా నిజమండీ''

''తప్పదు.... ఒప్పుకోకతప్పదు. మా రోజుల్లో కూడా కులాంతర వివాహాలు జరిగినయ్. ఎప్పుడో నలభైఏళ్లనాడే జరిగిన ఒక పని ఈనాడు జరిగినా, నలభైఏళ్లనాడు ఎంతగోల జరిగిందో అంతా జరగాల్సిందే? మరయితే ఈ నలభైఏళ్లనించి మీరంతా ఏంనేర్చుకున్నారు.... ఏమీలేదు. ఒక్కమాటలో చెప్పాలంటే, ఏమీలేదు. నాకు తెల్సుగా! ఆనాడు దేశంలో ఇంత ఆకలుందా? ఆకలితో జనం చచ్చేవారా? అన్నం లేకజనం చస్తూవుంటే ఇవ్వాళ మీరంతా మనకేమని పూరుకున్నట్టు ఆనాడు మేం పూరుకునేవాళ్లమా? పూహూ... ఎందాకో ఎందుకూ, జరిగిన సంగతేచెప్తా. నలభైఏళ్లపైమాటే. ఈ మన జిల్లాలోనే తీవ్రమైన కరువొచ్చింది. చుక్కనీరు లేదు. అన్నంకాదు గదా గంజికూడా దొరక్కజనం అల్లల్లాడిపోయారు. పనుల్లేవు. డబ్బుల్లేవు. గింజలులేవు. పచ్చిమొక్క కనుచూపుమేరలో కనపడేదికాదు. పశువులన్నీ చచ్చాయి. చావగా మిగిలిన వాటిని అయినకాడికి అమ్మిపడేశారు. ముసలీముతకా తాము చస్తేనన్నా వున్న పిల్లలకింత తింటానికి దొరుకుతుందుమోనని చావడానికి వువ్విళ్లూరారు. ఆకలి బాధకి తాళలేక చావాలనుకున్నారేమోలే. అయితే ఇప్పుడు మీ చదువుకున్న సంస్కారుల్లాగాక అప్పుడు చదువంతగా లేకపోయినా సాటిమనిషి అనే భావన ఒకటుండేదిగదా నాదగ్గరింత వుంటే పక్కవాడికి పెట్టకుండా దాచుకుతినాలనుకునే రోజులుకావు అయినా నాదగ్గరా లేకపోయె! అందుకేం చేశాం. పార్టీలూ పాడూ మర్చిపోయాం. ఒక్కవూరులో నాలుగు గ్రూపులుండనీగాక అన్నిగ్రూ

# రచయితలకు సూచనలు




★ ''చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలుకాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. ''చతుర''లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 300 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 30 వేల పదాలకు తక్కువగాకుండా ఉండాలి. వ్రాతపతిలో హిరి వారి దస్తూరినిబట్టి,ఒక పేజీకి ఎన్ని పదాలు వస్తున్నాయనేదానినిబట్టి మొత్తం నవల పేజీలకు ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ ప్రకారం ''చతుర'' కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికగాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగుపోస్టేజీని జతపరచాలి. వ్రాత ప్రతులు పోస్టులోగానీ, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482.

వుల ప్రజలకీ పొట్టలున్నాయి. ఆ పొట్టల్లో ఆకలీ వుంది. ఊరూరా గ్రామ కమిటీలు పెట్టించాం. అందరమూ పిల్లాపాపా తేడా లేకుండా ఆందోళన చేశాం. ప్రభుత్వం దెబ్బతో దిగివచ్చి గంజికేంద్రాలు పెట్టేవరకూ వక్కరూ ఆందోళన లోంచి వెనకడుగు వెయ్యలా. ప్రభుత్వం గంజికేంద్రాలు పెట్టి నడిపింది. జనం ఆకలిమంటలు గుడ్డిలోమెల్లగా చల్లారాయి. ఇప్పుడో... జిల్లాకి జిల్లానే శ్మశానం అవనీ, వుహు ఒక్కడిక్కూడా తేలుకుట్టినట్టుండదు. జిల్లాలోవున్న నాయకులకే ఏమీ పట్టదు. ఇక బైటజిల్లాలవాళ్లేం పట్టించుకుంటారు. మళ్లీ ఊరికి పదిమంది నాయకులు, నాయకుడికి రెండు పార్టీలూ. ఎన్ని పార్టీలున్నా, ఎన్ని ప్రతిపక్షాలున్నా అన్నీ తమ తమ పార్టీ ప్రయోజనం చూసుకునేవే. దొరల కొమ్ము కాసేవే. దోపిడీదారులకు దోచిపెట్టేవే... అవునంటారా, కాదంటారా''

''నిజం చెప్తున్నారండీ'' అంది సుజాత.

''చెప్పక! కుండవపగలగొట్టి మరీ చెప్తాను. నాకేం... నాకేమన్నాభయమా? నన్నెవడేం చేస్తాడు. మహా అయితే వదరానాయినా జైలుకి అంటారేమో. అంతేనా వద... నాకేమన్నా కొత్తా మీ జైలు''

''అదికాదండీ! అసలు అప్పట్నుంచీ ఇప్పటివరకూ వదలకుండా వెంటబడే ఈకరువు రక్కసికోరలు పీకలేమంటారా?'' అన్నాడు ఆవేశంగా మోహన్.

''కరువు రక్కసి కోరలు పీకటమంటే ఏమిటయ్యా మోహన్ చెప్పు. కరువు లేకుండా చేసుకోవడం. అంటే ఏం చెయ్యాలి. పంటలు పండేలా చూసుకోవాలి. పంటలు పండటం అంటే రెగ్యులర్‌గా చేలకినీళ్లు... అంటే నీటి సరఫరా మన చేతుల్లో వుండాలి. వానమీద ఆధారపడకుండా ముఖ్యంగా చెరువులూ, కాలవలూ ప్రతివూరూ వచ్చేలా చూసుకోవాలి. అంటే మరి మన నదులకి అవసరమైన ప్రతిచోటా ఆనకట్టలు కట్టుకోవాలి. ఎన్ని పంచవర్షప్రణాళికలు వేసినా పంచవర్షాలూ రావడం పోవడమేగాని ప్రణాళికలు రూపుదిద్దుకోవడమనేది ఎరగం గదా! అదేమంటే ఫండ్సు లేవు అనేది తారకమంత్రం కన్నా దివ్యంగా పలుకుతారు మన ప్రభువులు. మొన్న ఏసియాడ్‌కి 1600 కోట్లు ఖర్చు పెట్టారు. మన నాగార్జున సాగర్‌కి ఖర్చయిందెంతో తెలుసా. 533 కోట్లు అంటే ఏమన్నమాటా? ఏసియాడ్ మానేస్తే మూడు నాగార్జునసాగర్‌లాటి ప్రాజెక్టులు కట్టొచ్చు. వుహూఁ మనకి ప్రాజెక్టులకన్నా ఆటలూ వాటివల్ల వచ్చే గొప్పలూ ముఖ్యం. అన్నింకన్నా ఆకాశయానాలు, ఆర్యభట్‌లూ అవశ్యం.

మన మిలిటరీ బడ్జెట్‌లో సగం తగ్గిస్తే మొత్తం దేశమంతా సుభిక్షమైపోతుంది. ఈ సంగతి తెలుసా మీకు? తెలవదు... మీకసలే సంగతీ తెలవదు. మీ కడుపు మాడితే తప్ప ఆకలి అంటే ఏమిటో తెలవదు. మీ తలుపు కొట్టి మీ బొక్కలు ఇరగ్గొడితే తప్ప పోలీసు లంటే ఏమిటో తెలవదు. మిలిటరీ బడ్జెటు ఎందుకింత పెరిగిపోతోంది... యుద్ధాలొస్తాయేమోననీ, ఇంట్లో తిరగబడే వాళ్లెక్కువైపోతున్నారనీ... నీఇంట్లో నీ తమ్ముళ్లు ఎందుకు తిరగబడ్తారు. వాణ్ని ఆకలికి మాడ్చినువ్వు అరగనంత తింటున్నావు కాబట్టి నువ్వు సమస్త భోగాలు అనుభవిస్తూ వాణ్ని చంపుతానని భయపెడ్తున్నావు కాబట్టి... అందుకు వాడు నిన్నే చంపుతానంటాడు. వాణ్ని అణచడానికి వాడి దగ్గరే వసూలు చేసిన డబ్బుల్తో వాణ్ని చావగొట్టడానికి మిలటరీని పెంచుతావు. ఎందుకు ఇదంతా దేశాన్ని కరువునుంచి కాపాడలేని వాళ్ళు ఏలడం మూలంగా.

ఒక పక్క భూములు ఎండి బీటలు వారుతూ వుంటే

మరోపక్క వరదలు వచ్చి పంటల్ని తీసుకపోయి సముద్రం పాలు చేస్తయ్.

వరద బాధితుల సహాయంకోసం కోట్లు ఖర్చుపెడతామేగాని వరదల్ని నిరోధించడానికి పైసఖర్చుపెట్టం. ఎందుకనంటే వరదల్ని నిరోధిస్తే కరువు కూడా పోతుంది. ప్రభువులకు ఈ వరదలూ కావాలి. ఈ కరువులూ కావాలి. దానికీదీనికీ కూడా సహాయాలు చేస్తున్నాం అని కోట్లుకికోట్లు అందినవాడు అందినంత తినెయ్యొచ్చు.

దేశమంతా వదిలేసి ఈ జిల్లానే తీసుకుందాం. జూరాల ప్రాజెక్టు అయిదు సంవత్సరాల్లో పూర్తి చెయ్యాల్సి వుంది. దాని ఖర్చు 76 కోట్లు. పూర్తవలా. ఆలస్యమైనందువల్ల 210

కోట్లవుతుందని అంచనా. ఇప్పటివరకూ నడుస్తున్నట్టే నడిస్తే 2000వ సంవత్సరంలోగా పూర్తి అవదు. అవ్వకపోతే ఈ నీటిని ట్రిబ్యునల్ వేరే ప్రాజెక్టులకు కేటాయించొచ్చు! గొడవొదిలిపోలా. ఆపైన అసలు ఈ ప్రాజెక్టు గొడవుండదు మనకి. ఇది తెలియనివాళ్ల సంగతి వదిలేద్దాం. తెలిసినవాళ్లేం చేస్తున్నారు. వాళ్లు ప్రజలకి తెలిసేలా వూరూరా సభలూ, సమావేశాలూ పెట్టి ఇదిరా నాయనా మన ప్రాజెక్టు సంగతి అని తెలియజెప్పి ప్రజల్ని ముందుండి నడిపించే నాయకుడుగానీ, పార్టీగానీ ఒక్కటి ఒక్కటి ఒక్కటి వుందా? ఇలా అయితే ఇప్పుడు ఇలా ఆనాడూ మేం కూడా వుంటే మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చేదా? మీరు మాట మాట్లాడితే 'ఈ రోజుల్లో కూడా' అంటారా? ఏమిటి ఈ రోజుల గొప్పదనం. ఆనాడు మా రోజుల్లో లేనివి మీ రోజుల్లో ఏమున్నయ్. ఉన్నాయ్‌లే. రోజూ మానభంగాలు, దోపిడీలు, అక్రమాలు, అన్యాయాలు కుళ్లూకుతంత్రాలూ దుర్మార్గాలూ దౌర్జన్యాలూ... మనుషులు మనుషుల్లా మెలుగుతున్నారా? ఏడీ ఒక్కడ్ని చూపించండి. 'ఇదుగోనండోయ్ ఇక్కడో మనిషున్నడూ' అని దేశం అంతా వెదికైనా సరే చూపించండి. నా ఎడమచెవి కోసుకుని పేరు మార్చుకుంటా...

ఆనాడు దేశంలో ఇంత ఉత్పత్తుందా? ఇంత సంపదుందా? లేదు. ఏమీలేదు. కాని ఆకలీ లేదు. ఇవ్వాళ అన్నీ పెరిగాయి. ఆకలీ పెరిగింది. ఆకలి చావులూ పెరిగాయి.

"అయితే మరి ఎందుకండీ అప్పటి తెల్లాడి ప్రభుత్వాన్నే వుంచకవాణ్ని తరిమి మీరు సాధించిందేమిటి?" అన్నాడు మోహన్.

...బూడిద! నాయనా బూడిద! అంతే"

"అంటే మీరిప్పుడు పశ్చాత్తాపుడుతున్నారా? స్వాతంత్ర పోరాటం చేసినందుకు!" అన్నాడూ మోహన్.

అకస్మాత్తుగా తగ్గిపోయాడు వీరరాఘవయ్య! "ఏమాటకామాట చెప్పాలంటే స్వతంత్ర పోరాటం చేసినందుకు ఏనాడూ పశ్చాత్తాప్పడలేదు. పడాల్సి వచ్చేదేమోగాని... ఇదిగో" అని చుట్టూ వున్న ఇళ్ల పోర్షన్‌లన్నీ చూపిస్తూ ఇవన్నీ గవర్నమెంటోడిచ్చిన భూములే. కిందమీదపడి ఈ పోర్షన్లు కట్టించుకున్నా. మీకు మీకు అద్దెలకిచ్చుకున్న. ఇవ్వాళ నా కొడుకూ కోడలూ నాకింత ముద్దపడేస్తున్నారూ అంటే ఇవిగో ఇవి చూసేనని నాకు తెలుసు! ఏ ఆస్తులూ లేకపోయిన కన్నతల్లిదండ్రులకు ఇంత అన్నం పెట్టడానికి ఇవేమన్నా మా రోజులా? మీ రోజులుగాని" అని బొళబొళ నవ్వాడు వీరరాఘవయ్య!

పొలిటికల్ సఫరర్‌గా వీరరాఘవయ్య స్థలం సంపాదించి ఇళ్లు కట్టి అద్దెకిస్తే అద్దె ఇళ్లల్లోకి దిగిన సుజాతా, మోహన్లు ఇప్పుడు ఆ వీరరాఘవయ్య వల్ల నోర్మూసుకోవాల్సొచ్చింది.

★ ★ ★

చంద్రం!

నేనే నీకు రోజూ ఒక వుత్తరం రాయగల్గితే ఎంత బాగుండుననిపిస్తుంది. కాని చాలా అలిసిపోతున్నాను రోజూ పనినుంచి వచ్చేసరికి. సుజాతని రాయమంటాను. కాని నాకే తెలుసు తనెంతఅలిసి పోతోందో. ఇప్పుడు మావాళ్లు అంటే మా కౌన్సిల్‌వాళ్లు మరో పదివూళ్లల్లో ప్రోగ్రాంని ప్రవేశపెట్టాలని. అంటే అర్థమైంది గదూ. మా వుద్యోగం మరో సంవత్సరం వుండటం ఖాయం.

గ్రామాల్లో మా అనుభవాలు మళ్ళీ మొదలవుతాయన్నమాట.

ఇవ్వాళ నేనూ, సుజాత, ఛాయా కలిసి ఒక వూరికి మోటివేషన్‌కెళ్లాం. వూరు పెద్దదే.

బద్ధకంగా శవాల్లా అటూఇటూ వూగుతూ గొడ్లు వూళ్లోకొస్తున్నాయి. గొడ్ల వెనకే పేడకోసం పలికలతో చిన్నచిన్న పిల్లలు ఓపికలేక వుసూరుమంటూ. ఒక్కరికళ్లల్లోను కాంతిలేదు.

మేం పోలీసు పటేలు ఇంటికెళ్ళి మేంవచ్చిన పని చెప్పి కావలివార్నిమ్మని అడిగాం. ఆయన వాళ్లనిచ్చేలోపు టీ తాగుదామని వూరి చివరి హొటల్ కొచ్చాం. అదొక గుడిసెలో వుంది.

ఒక యాభై ఏళ్ల గూని స్త్రీ గల్లాపెట్టె ముందు కూర్చునివుంది. ఎదురుగా వున్న టేబుల్ మీద పళ్లాల్లో పకోడీలు, జంతికలూ పెట్టివున్నాయి. అవి ఆ హొటల్ పెట్టిన మొదటిరోజుల్లో వండి అక్కడపెట్టినట్టున్నయ్. వాటిమీద ఈగలు మునురుకొని వున్నాయి. చప్పుడు చేస్తే అవి ఎక్కడ చెదురుతాయో

అన్నట్లు ఆమె కదలకమెదలక వాటివంక చూస్తోంది.

ఆ టేబుల్ నానుకుని అంతయెత్తేవున్న ఓ పసివాడు. ఎంత అపరిశుభ్రంగా వుండవచ్చో అంతకికాస్త ఎక్కువగా వున్నాడు. ముక్కుకింద పైపెదవి పైన ఈగల గుంపు మూగి...

"వీళ్ళమ్మ ఎవరు యిలా వదిలింది" ఆగ లేక అన్నాను.

"అగ్గో...." తల్లిని చూసి అంది గల్లా స్త్రీ.

తల్లి ఆ గుడిసెకి కాస్త పక్కగావున్న రాళ్ల మీద కూర్చుని భూమిలోకి తీక్షణంగా చూస్తోంది. వళ్లో పసిపిల్లవాడు. వాడినోట్లో నానుతూ ఆమె స్తనం.

నా చూపు కనిపెట్టినట్టుంది గల్లా స్త్రీ.

"నువ్వుగూడ సిన్నప్పుడు గిట్లనే వుండవ్" అంది.

"తుడిస్తే ఏమవుతుంది?"

"ఏమవుతది? మల్లోస్తది"అందిమూతి ముడుచుకుని-

"నా మన్మడే..." అంది నిర్లిప్తంగా.

"నువ్వయినా...."

"ఎప్పుడు దుడుద్దుము? నా బిడ్డె పొద్దంత కూలికిబోతది! నాకిదే సరిపోయె. ఎప్పట్కిదు డుస్తగూనునాల్నా" అని.

"ఉష్" అని ఆ బుడ్డడి ముఖం మీదికి చెయ్యి ఆడించింది.

ఈగలు జుయ్‌మంటూ లేచాయ్, వాడి మూతి మీది నుంచే గాదు పళ్లాల మీద నుంచి కూడా.

పావు నిముషంలో మళ్లీ రెండు చోట్లా చేరిపోయాయ్.

"జూసినవా?" అంది నిష్ఠూరంగా ఆ స్త్రీ

"అరె... శుభ్రంగా తుడువమ్మా" అన్నాను కంపరంగా.

"అరె... ఏం లొల్లిజేస్తున్నవయ్యా. పోరడూ కుంటడా?" అని శ్రమపడి లేచి వాడి ముక్కు పట్టుకునేంతలో వాడు తునీగలా పారిపోయాడు. పోతూపోతూ ఏదో ఓ బూతుమాటని ఆ స్త్రీ మీదికి విసిరేశాడు.

కడుపులో వికారపెడ్తోంది. ఛాయ్ ఇచ్చాడు ఓ చిన్న టవల్ మొలచుట్టూ చుట్టుకున్నతను తాగలేక ఆమె చూడకుండా పారబోసి డబ్బులు లెక్కగట్టి ఇచ్చివెనక్కితిరిగాం!

చాలామంది ఇళ్లల్లోలేరు. ఎక్కడ చూసినా పేదరికాన్ని బావురుమంటూ చాటుతున్న వసారాలు.

ఒక్కొక్కరూ వూరు బైట నుంచి వస్తూ కనపడ్డారు.

"యాడినుంచొస్తున్నారు?"

"సడాక్ పనికెల్లి?" అని చెప్పి--

"మీది యావూరయ్యా?" అనడిగారు.

"మాది పాలమూరు మీవూళ్లో యాకటి మనుసులకు, సన్నపిల్ల తల్లులకు దవకాన పెడ్తున్నం. దాంతోపాటె మీకింత చదువు చెప్తాం"

"మాకు సదువెందుకు? మందులి య్యుంగ్రి. కాలు మొక్తా!"

"మంచిది మంచిది... మొదలు నీపేరు జెప్పు ఎంతమంది పిల్లలు. మరి రోజూరావాలె మావాళ్లు చెప్పింది వినాలె. ఏమన్న బీమార్ వుంటె... ఎక్కువ తక్కువలుంటే జూయించుకునాలె"

"మంచిది"

"పేరు చెప్పు"

"పేరెందుకు?"

"కావాలెగద!"

"చెప్త"

"చెప్పు"

"ఇంట్లఅడ్గి చెప్త"

"అరె... నీ పేరు నీకు తెలవదా?"

"నా పేరు తెల్సుగనీ... మల్లయింట్ల ఎందుకు జెప్పినవంటె? జెప్తగాని రేపు రాత్రి. జెప్తనన్నగదా"

"లేదమ్మ... నువ్వేమి పైసలివ్వొద్దు. గోలీలిచ్చినగని పైసలివ్వొద్దు. అంతా వూరికినే పుక్కడ్కి..."

"మంచిది... అందర్కిరాయి. మల్ల నేను కూడా జెప్త"

ఒక్కముసలామె లేవబోయి, లేవలేక చేతులు జోడించింది. "అప్పట్సంది జూస్తున్న మీ

రు మంచోల్లు! బీమార్లున్న ఆడిమనునులకు గోలీలిస్తరు. గింత చదువుజెప్తరు మంచిగనే. ఓయ్యే.... అటు జూడు.... నీకాలు మొక్త పశిపో రలు అల్లల్లాడుతున్నరు. అయ్యో. నాయనే. జర్ర-ఇన్ని జొన్నలిచ్చిపోండ్రి. శానదినాలాయె కూడులేక''

తానూ, తన పిల్లలూ, తన మనమలూ, ఎప్పుడు తిన్నారో వివరిస్తోందామె.

ఎటుజూసినా-

ఆశలెండిన కళ్లు

తెరిచిన నోళ్లు

ఈ ప్రపంచంలో ఎవరేం చెప్పదల్చుకున్నా ముందు వీళ్లకు తిండి బెట్టి మాట్లాడాలి.

క్షణంక్షణం వీళ్లు చచ్చిపోతున్నారు.

అహింస అహింస అని గద్దెలెక్కి అరిచే గద్దలకి, ఈ గ్రామాల్లో ప్రతినిత్యమూ ఎంతెంత హింస జరుగుతోందో తెలియదా? కళ్లు మూసు కుపోయాయా హృదయాల్లాగే!

సాయంత్రం చిక్కబడ్తోంది ఆవిరైన పేదప్ర జల రక్తం ఆకాశంలో అలుముకుంటున్నట్లుగా ఎర్రటి కాంతులు పరుచుకుంటున్నాయి.

మనసంతా ఎరువెక్కింది.

మెల్లగా కదిలాం ఇంకోచోటికి

అరిగిపోయిన రికార్డు విన్పించటానికి

మా బూటకపు నాటకం రిహార్సల్‌కి

ఎక్కడికెళ్లినా ఆకలితో హాహాకారాలు చె య్యని మనిషిలేదు.

"అయ్యా- దేవదారు కూరపీక్కచ్చి దింటు న్నం. గడ్డలు తవ్వకొచ్చి తింటున్నం జాజిరాకు ల్ని నీల్లల్ల వుడ్కపెట్టుకు తింటున్నాం. చస్తమో బత్కుతమోకూడా చూడకుంట ఏదంటె అద్దింటున్నం. అవ్వికూడా దొర్కుత లేవు. నాలుగ్గింజలిచ్చిపోండ్రి''

అయ్యో!

ఏమిటిది చంద్రం!

ఇదంతా నిజమేనా?

బతుకెంత దుర్భరంగా వుంది? ఈదే శంలో... అవును నువ్వెన్నోసార్లు చెప్పావు... విన్నాను, నమ్మాను.

కాని రోజురోజా చూస్తేగాని తెలియడంలే దు చంద్రం. దుర్భరం అంటే ఏమిటో? మను మలెట్లా బతుకుతున్నారో?

ఏమనిషీ కూడా మనిషిలాగ లేరు.

మనుమల కళ్లు మనకు కన్పించవు

అవెక్కడో గుంటల్లో వుంటాయి

మనుమల మాటలు మనకు విన్పించవు

అవెక్కడో గోతుల్లోంచి వస్తాయి

ఈ మనుమలు నడవటంలేదు

తమనుతాము ఈడ్చుకుంటున్నారు

వాళ్లకీ ప్రపంచంలో ఏమీలేదు

అనలీ ప్రపంచం వీళ్లదికాదు.

వీళ్లకిక్కడ తిండే లేదు. తిండి లేని వాళ్ల కేం వుంటుంది!

వాళ్లకి భవిష్యత్‌లేదు.

గతం లేదు.

వర్తమానం మాత్రం వుంది.

అది మంటలతో భగ్గుమంటూ ఒక్కొక్కరినే నెమ్మదిగా కాలుస్తూవుంది.

చీకట్లు...

వీధులనిండా

ఇళ్లనిండా

మనుమల నిండా

మనుమల ముఖాలనిండా

మనసుల నిండా.

కిక్కిరిసిపోతున్న చీకటి

చిక్కబడిపోతున్న చీకటి

క్రమంగా ఒక భయంకరమైన నైరాశ్యం వూరి నిండా అలముకుంటోంది.

ఊరంతా ఒక పెద్ద శ్మశానంలా వుంది!

ఇప్పటిదాకా కదిలిన శవాలు.

తమనితాము ఈడ్చుకున్న శవాలు పలుచ బడిపోతున్నాయి.

నెమ్మదిగా... నెమ్మదినెమ్మదిగా... తమతమ సమాధుల్లోకి ముడుచుకుంటున్నాయి.

దూరంగా మా జీపు వస్తోంది! మమ్మల్ని తీసుకెళ్లడానికి వస్తోందది! మేమేదో ఇక్కడ ఉద్ధరించామని... ఇక్కడ ప్రజల జీవితాలు బాగుచెయ్యడానికేదో పూడబొడిచామని మా

జీపొస్తోంది! గర్వంగా హారన్ వేసుకుంటూ, దుమ్ము లేపుకుంటూ మా జీపు!

పొడుగాటి వెలుగు చార పూరుమీద పరుచుకుంటో వస్తోంది మాజీపు. ఈ వెలుతురికి గ్రామాల్లోని తరతరాల చీకట్లను కాల్చేసే శక్తిలేదు.

ఈ క్షణంసేపటి వెలుతురే.

'మీఇంట్లో దీపాలు వెలుగుతాయి' అనేది మా స్లోగన్. మా స్లోగన్ ఈ ప్రజలని ఆశపెడ్తోంది! కాని తాత్కాలికంగా వాళ్లకళ్లను వెలిగించే సత్తువకూడా ఈ వెలుతురికి లేదు.

గ్రామస్తులకు దేనిమీదా నమ్మకంలేదు. తరతరాల్నుంచి తమను కాలుస్తున్న ఆకలిమీద తప్ప మరి దేనిమీదా వారికి నమ్మకం లేదు. ప్రతిదాని మీదా అవిశ్వాసాన్ని పెంచుకున్నారు వాళ్లు కాని వాళ్ల ఓపిక మొక్కవోనిది. ఇంక ఎన్ని యుగాలైన తరగని ఓపిక.

'అంశల వున్నంతయితది' ఇదీ వాళ్ల స్లోగన్.

"మన వర్క్ అంతా పెద్ద జోక్ మేడం" అన్నాను పంకజవల్లిగారితో జీపులో వస్తూ.

"అవును... నిజమే" అందామె.

ఆశ్చర్యపోయి చూశాను.

ఆవిడ ఇవ్వాళ మరొకవూరిలో మోటివేషన్‌లో పాల్గొంది.

"కాని.... నువ్వేంచూశావ్ మోహన్. యూ హావ్ సీన్ నథింగ్" అంది.

ఆమె కంఠంలో జీరలు.

"ఘోరమైన సఫరింగ్, వూళ్లనిండా ప్రజల నిండా... నువ్వేం చూశావ్ మోహన్"

పంకజవల్లి గారేనా మాట్లాడేది?

"తరతరాల వాళ్ల ఓర్పువల్లనే వాళ్లకీ ఆకలి. వాళ్లకి ఫుడ్ లేదు. ఆహారం వుత్పత్తి చెయ్యడంవరకే వీళ్లపని. దాన్ని దాచుకోవడం వేరేవాళ్లపని. ఆహారం మీద.... అది పండే భూమిమీద వీళ్లు హక్కు సంపాదించేవరకూ... ఈ ఆకలి, ఈ ఓర్పు వాళ్లని తినకతప్పదు. మనమా? ఈ ప్రాథమికావసరాలు తీర్చకుండా మనం ఎన్ని సంక్షేమ పథకాలు పుచ్చుకుని వాళ్ల దగ్గిరకెళ్ళినా... ఇలాగే... ఇవ్వాళలాగే... వృధావృధా!" అంది.



ఆమె కళ్లవెంట నీళ్లు.

సుజాత రెండు చేతుల్తో ముఖం కప్పుకుంది.

శవం ముందు ఏడుపురాని వాళ్లలా కూర్చున్నాం నేనూ, ఛాయా.

కాని-

చంద్రం...

అందరికీ అన్నీ తెలుసు. తెలిసే తల వంచుకు నడిచిపోతున్నాం.

కళ్లుకూడా అటూఇటూ తిప్పం.

అందరమూ అదే చేస్తున్నాం. పాలమూరు పొలిమేరల్లోఅన్నాను-

"భారతదేశంలో వైద్యుడు కాని యువకుడి బతుకు వ్యర్థం. ప్రైమరీ మెడికల్ ట్రైనింగ్ నేర్చుకోవాలి. తీరిక సమయాల్లో గ్రామాల్లో వైద్యం చెయ్యాలి"

విషాదంగా నవ్వింది మేడం.

"డాక్టర్లయిన యువకులు ఎంతమంది గ్రామాల్లో వైద్యం చేస్తున్నారు. అసలు డాక్టర్లయ్యేదెందుకు?

మైడియర్ బోయ్... గ్రామాల్లో ప్రజలకి కావాల్సింది తిండి. ముందు వాళ్లకి తిండి కావాలి.... తిండి.

తిండే వాళ్లకి మందు.

వాళ్ల అన్ని రోగాలకీ మూలం ఆకలే. గ్రామాల్లో వుండే వాళ్లరోగాలన్నిటినీ సర్వేచేస్తే అన్నిరోగాలకీ కారణం మాల్‌న్యూట్రిషన్ అని తేలింది. మాల్‌న్యూట్రిషన్‌కి మందు ఆహారం. తిండి. అన్నం"

చంద్రం....

అదీ సంగతి.

నువ్వు నా పక్కనుంటే ఎంతో చెప్పేవాడివి. ఉత్తేజాన్నిచ్చేవాడివి. దారి చూపేవాడివి కాని, చంద్రం...

నాకు ఏడుపొస్తోంది. అండగాలేవు నీవిక్కడ. సుజాత ఉంది, కానీ ఆమె కూడా నాతోపాటు ఇవన్నీ అనుభవిస్తున్నదే గదా!

చంద్రం!... మనం ఏంచెయ్యలేమా? చెయ్యవద్దా? ఎందుకు ఆలస్యం? ఏమిటీ అడ్డం?...

-- మోహన్





# చతుర సమీక్ష

ఈ శీర్షిక ద్వారా ప్రతి నెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని పాఠకులకు కల్పిస్తోంది 'చతుర'. పాఠకులు 'చతుర' నవలపై ఏ నెలకానెల తమ అభిప్రాయం వెల్లడిస్తూ, ఆ నవల ఎందువల్ల తమను ఆకట్టుకుందో, లేదా ఎందువల్ల ఆ నవల తమకు నచ్చలేదో వివరిస్తూ, రచన బాగోగుల గురించి రాయాలి. పాఠకులు గమనించవలసిన కొన్ని ముఖ్యాంశాలు:

1. మీ **"చతుర సమీక్ష"** అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏనెల నవల సమీక్షలు ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవర్‌పై **చతుర సమీక్ష కు** అని పేర్కొని, ఎడిటర్ 'చతుర', ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడా, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించినవాటిలో తొలి మూడింటికి రు. 100/-, రు. 75/-, రు. 50/- చొప్పున; మరో మూడింటికి రు. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

**కూపన్**

నవంబర్ 'చతుర' నవల: మోహనరాగం

**సమీక్షకుని పేరు:**.................................................

**చిరునామా:**.................................................

.................................................

.................................................

.................................................

ప్రతినెలా పాఠకులకు
రు. 300/- నగదు
బహుమతులు ఇస్తున్న
ఏకైక పత్రిక

# చతుర

వివరాలకు ఈ సంచికలోని
10, 11, 12, 13, 123
పేజీలు చూడండి.

మీరూ పాల్గొనండి.
మీ పరిశీలనాత్మక పఠనాసక్తిని
సమీక్షాత్మక రచనాశక్తిని నెల
నెలా ద్విగుణీకృతం చేసుకోండి.




## అతిచిన్న పెద్దమనిషి

**ఆ**ఫ్రికాలోని ట్రాన్‌గాయి ఆస్పత్రిలో జన్మించిన "సిద్ధాంటవి" పుట్టగానే ఇరవై కిలోగ్రాముల బరువు తూగాడు. అతని తల్లికి పురుడుపోసిన డాక్టర్ ఈ బిడ్డ మేధస్సుగురించీ, శరీర స్థితిని గురించీ ఆసక్తికరమైన అంశాలను వెల్లడించాడు.

ప్రస్తుతం అతను నాలుగేళ్ళవాడే అయినా 38 కిలోల బరువున్నాడు. పదేళ్ళపిల్లలకి సరిపడే దుస్తులు కావాలతనికి. ఎలాంటి ఆహారమైనా ఇట్టే జీర్ణించుకుంటాడు. ముఖం ఎక్కువ వయసుగలవాడి ముఖంలా ఉంటుంది. పుట్టగానే తాగేందుకు అతనికి తల్లిపాలు చాలలేదు. 500 గ్రాముల పొడరు సాలు రోజూ తాగేవాడు. బంగాళదుంపలు, అన్నం, లివరు, కూరగాయలు రోజువిడిచి రోజు తినేవాడు.

స్వరం పద్దెనిమిదేళ్ళ కుర్రవాడి స్వరంలా ఉంటుంది. వయస్సు చిన్నదే అయినా పెద్దపెద్ద కబుర్లు తెగచెబుతాడు. ప్రతీ విషయం తెలుసుకోవాలని కుతూహలపడతాడు. స్థిరంగా ఒకచోట కూర్చోలేడు. డాక్టర్లెన్నో పరీక్షలు నిర్వహించి వెన్నెముక, ఇతర ఎముకలు పెరగవలసిన రీతిలో పెరగలేదని చెప్పారు. ఏ సంస్థలైనా ఆర్థిక వనరుల్ని సమకూర్చితే ఆపరేషన్ నిర్వహిస్తానంటున్నాడు అక్కడి డాక్టర్

ఈ వార్త కార్చిచ్చులా వ్యాపించి జపాన్, డచ్, జర్మన్ న్యూస్‌పేపర్లు ప్రముఖంగా ప్రచురించాయి. టోకియోలో టి.వి. ప్రోగ్రాం ఏర్పాటు చేశారితనికోసం. అతని తల్లిదండ్రులు నిరుపేదలైనందున కొన్ని ప్రైవేటు కంపెనీలు అతనికి తిండీ, బట్టా సమకూరుస్తున్నాయి. త్వరలో జరగబోయే ఆపరేషన్‌మీదే అతని భవిష్యత్తు ఆధారపడివుందని తెలిసిన తల్లిదండ్రులు అతను మరణిస్తాడేమోనని ఆందోళనపడుతున్నారు. పుట్టగానే పేరుపొందినవారిలో ఈ "సిద్ధాంటవి" ఒకడు





## పాకిస్తాన్‌లో హిందూ పండగలు?

పాకిస్తాన్ భారతదేశం నుండి విడిపోయి నల భైఏళ్లయినా ఇప్పటికీ అక్కడ ముస్లింలు హిందువుల పండుగలు కూడా జరుపుకుంటారని చాలామందికి తెలియదు. దీపావళి, బసంతపంచమి, హోలీ వంటి పండుగలు తామూ జరుపుకుంటారు.

ఈ సంవత్సరం 'వసంత పంచమి'ని పాకిస్తానీయులు మహోత్సాహంతో అత్యంత వైభవంగా జరుపుకున్నారు. ఆరోజు రాత్రి లాహోర్ నగరంలోని భవనాలు రంగు రంగుల విద్యుద్దీపాలతో అలంకరించారు. ఆ రాత్రి గాలిపటాలతో ఆకాశం నిండిందంటే అతిశయోక్తికాదు. వీటికోసం అక్కడి ప్రజలు ఒక కోటి రూపాయలదాకా ఖర్చుపెట్టారు. ఒక గాలిపటం ఖరీదు మూడు నుంచి అయిదు రూపాయలు కాగా మాంజా దారంచుట్టిన ఓ చక్రం వందనుండి పదిహేనువందలదాకా ధర పలికింది. రాత్రంతా గాలిపటాలు ఎగురవేస్తారుగనుక వెలుతురుకోసం సెర్చ్‌లైట్లను అతిపెద్ద భవనాలపై ఏర్పాటుచేసుకున్నారు.

తెల్లవారేవరకూ గాలిపటాలు ఆకాశవీధిలో విహరిస్తూ పోటీపడుతూనే వున్నాయి. లాహోర్‌లో వాటికోసం కాసిన పందేల్లో పదికోట్ల రూపాయలదాకా చేతులు మారింది. ఆ ఉత్సాహంలో ఇరవైగంటలపాటు చట్టాన్ని అతిక్రమించి తమ ఆనందం వెల్లడించుకుంటూ కేరింతలతో ప్రజలు రివాల్వర్లూ, తుపాకులు పేల్చారట. దీన్ని నివారించాలని చేసిన ప్రయత్నాలు వ్యర్థమయ్యాయి. ఈ సందర్భంలో 24 మంది ఘర్షణలకుదిగి గాయపడ్డారు. ఎనిమిదిమంది చనిపోవటం జరిగింది. అయిదుగురు వికలాంగులయ్యారు.

హిందువుల పండగల్ని ప్రజలు ఇంత ఘనంగా జరుపుకోవటం పాక్ ప్రభుత్వానికో సవాలుగా పరిణమించింది. గాలిపటాల ఉత్సాహంలో ఆరోజు శుక్రవారం అయినా మసీదుకు వెళ్లటం మరచిపోయారట ప్రజలు. ఇది మరీ అవమానకరంగా వుందని కొందరు వాపోతున్నారు. ఈ పండుగరోజుల్ని ఇంత వైభవంగా గడపటానికి పాకిస్తాన్ పీపుల్స్ పార్టీ నాయకులు ముందే వేసుకున్న పథకమని కొన్నివర్గాలు ఆరోపిస్తున్నాయి. పీపుల్స్ పార్టీ, నేషనల్ పార్టీల జండాలు గాలిపటాలపైన చోటుచేసుకోవటంతో ఇలాంటి ఆరోపణలు, దూషణలు మరిన్ని పెరిగాయి.

''మాంజా'' కావలసినంత తమ దేశంలో

లభించనందున మద్రాసునుండి దిగుమతి చేసుకున్నామని పాకిస్తాన్ కైట్ ఫ్లయింగ్ అసోసియేషన్ అధ్యక్షుడు మహ్మద్ అయూబ్ చెప్పారు.

క్రికెట్ ఆట భారత్ - పాక్‌లమధ్య సన్నిహిత సంబంధాల్ని పెంపొందించినట్లే గాలిపటాల క్రీడలు కూడా ఇరుదేశాలనడుమ స్నేహ భావానికి వారధి కావాలని శ్రేయోభిలాషులు ఆకాంక్షిస్తున్నారు.

## నీళ్లిస్తాం! రేషన్ కార్డేదీ?

రేషన్ కార్డు చూపి బియ్యం, నూనెలు, పంచదార, గోధుమలు తెచ్చుకోవటం మనం ఎరుగున్నదే . కానీ మనదేశంలోనే తాగే నీళ్ళు సైతం రేషన్‌కార్డుమీదే లభిస్తాయంటే వింతగా లేదూ? కాని ఇది పరమసత్యం. మహారాష్ట్రలోని 'సతారా' జిల్లా, కోరేగావ్ తాలూకాలో 'వాథర్' అనే చిన్న పల్లెటూరుంది. ఆ జిల్లా కుటుంబ నియంత్రణలో మంచి ఫలితాలు సాధించి, అభివృద్ధి పథకాలెన్నో చేపట్టి విజయవంతం చేసినందుకు బహుమతులు కూడా పొందింది. మరి ఈ వూళ్ళో మంచి నీరు మాత్రం రేషన్ కార్డుంటేనే దొరుకుతుంది.

ఆ ఊరి జనాభా సుమారు 5 వేలు. ఎక్కువమంది శ్రామికులే. 1972 నుండి ఈ గ్రామానికి మంచినీరు టాంకర్ ద్వారా మార్చి, జులై నెలల్లో సరఫరా అయ్యేది. ఇళ్ళలో ట్యాపులున్నాయిగానీ నీళ్ళు రావు. ఎందుకంటే ఈ ఊరి బావి నీళ్ళనే ట్యాపుల్లోకి పంపు చేస్తారు. అదెప్పుడో ఎండిపోయింది.

ఆ గ్రామస్థుల అవసరాలకిగాను ఒకేఒక నీటి టాంకరు ఉంది. ఇది ఉదయం 5 గంటలనుండి అర్ధరాత్రివరకు పనిచేస్తూనే వుంటుంది. ప్రతి లొకాలిటీకి టాంకర్ వెళ్ళేసరికి ప్రజలు తమ చేతుల్లో రేషన్‌కార్డులూ, బిందెలూ పట్టుకుని ఎదురుచూస్తుంటారు. ఒక్క మనిషికి ఒక డబ్బాడు నీళ్ళచొప్పున ఒక కుటుంబంలో ఎందరు సభ్యులుంటే అన్ని డబ్బాల నీళ్ళు సరఫరా చేస్తారు. టాంకర్ వచ్చే సమయం ఏదో తెలీదు కాబట్టి కుటుంబానికి ఒకరు చొప్పున నీళ్ళు పట్టుకోడానికి ఇంట్లో ఉండాల్సిందే. టాంకర్ 7 కిలోమీటర్ల దూరం నుండి నీళ్ళు నింపుకుని వస్తుంది. రేషన్‌కార్డులేనివారికి చుక్కైనా నీరు దొరకదు. ఆ వూళ్ళోవాళ్ళు రేషన్ కోసం ఏమోగానీ నీళ్ళకోసం ఖచ్చితంగా రేషన్‌కార్డు చేయించుకోవలసిందే!







# వారేనయం

నాగరికత వెర్రితలలు వేస్తోందని వాపోతున్న ఈ రోజుల్లో కూడా ఆదిమానవుల్లా గడుపుతున్న వారెందరో ఉన్నారు.

ఒరిస్సాలోని అరవై రెండు ఆదిమతెగలవారు సముద్రమట్టానికి 1500 మీటర్ల ఎగువన పర్వత ప్రాంత అడవుల్లో నివసిస్తుంటారు.

ఒక తెగ పేరయిన "రాంజియ సూర" అంటే ఒరియాభాషలో గోచీ ధరించిన వీరుడని అర్థం. ఆ నమ్మకంతోనే చాలామంది పురుషులు గోచీలే ధరించి తిరుగుతుంటారు. ఓ తలపాగా చుట్టుకుని ఎర్రని గుడ్డను ఛాతీపై కప్పుకుంటారు. స్త్రీలు తువాలులాంటి గుడ్డను ఒంటికి చుట్టుకుంటారు. బిగుతైన రవికెలు తొడుక్కుంటారు. పొట్టభాగం చాలావరకు కనిపిస్తుంది. కొందరు ఆ రవికలు కూడా వేసుకోరు. కురులను మాత్రం శ్రద్ధగా దువ్వుకుంటారు. ఇళ్ళలో తయారుచేసుకున్న నాటుసారాయి పుచ్చుకుంటూ వుంటారు.

ఒరియా గిరిజన స్త్రీలు పురుషులకంటే చురుగ్గా ఉంటారు. వ్యవసాయపు పనులు పురుషులకంటే సమర్ధవంతంగా చేస్తారు అల్లం, మొక్కజొన్న పసుపు వీరు ఎక్కువగా పండించే పంటలు. విత్తనాలనుండి నూనెతీస్తారు. పురుషులు ఈ రకం పనుల్లో జోక్యం కలిగించుకోరు.

వారానికి ఒకసారి దగ్గర్లోవున్న టౌనుకువెళ్ళి అడవిలో దొరికే వస్తువుల్ని షావుకారుకిచ్చి దానికి ప్రతిఫలంగా తమకు కావలసిన సరుకులు తెచ్చుకుంటారు.

యువతీయువకులు వాళ్ల తల్లిదండ్రుల గురించీ, ఊరుగురించీ అరమరికలు లేకుండా, నిర్భయంగా స్వేచ్ఛగా వర్తించుకుంటూ వుంటారు. ఎదిగిన ఆడపిల్లకు ఓ అబ్బాయి నచ్చితే అతన్ని ప్రేమించటం ప్రారంభిస్తుంది. తనే చొరవ తీసుకుని పెళ్ళి ప్రస్తావన తెస్తుంది. ధైర్యంగా ఆ కుర్రవాడి గురించి తన తల్లిదండ్రులకు చెబుతుంది. వారు వెంటనే వరుడి తల్లిదండ్రుల్ని కలుసుకుని పరస్పరం అభినందించుకుంటారు. ఈ గిరిజనుల్లో అన్నీ ప్రేమవివాహాలే. వధువుకిష్టంలేని పెళ్ళిళ్ళు అసలే జరగవు. వరకట్నపు చావులు ఒక్కటైనా కనిపించవు. భర్త, అత్తగార్ల వేధింపులు వినిపించవు. మనకంటే వారేనయంకదూ!

# రోజుకు పదహారు కోట్ల మైళ్లు



మన శరీరంలో ఓ ఇరవైనాలుగు గంటల్లో ఏమేం జరుగుతున్నాయో తెలుసుకోవటం ఆశ్చర్యకరంగా ఉంటుంది.

ఆరోగ్యవంతమైన మనిషి గుండె 24 గంటల్లో 103689 సార్లు కొట్టుకుంటుంది. రక్తం పదహారు కోట్ల ఎనభైలక్షల మైళ్ళు ప్రయాణిస్తుంది. 438 క్యూబిక్ ఫీట్ల గాలిని పీల్చుకుని 23040 సార్లు శ్వాసించటం జరుగుతుంది. ఇరవైనాలుగు గంటల్లో మూడున్నర పౌండ్ల ఆహారం జీర్ణమవుతుంది. $3\frac{1}{2}$ లీటర్ల నీటిని వినియోగించుకుంటుంది.

ఏడెనిమిది పౌండ్ల వ్యర్థపదార్థాలు శరీరంనుండి విసర్జింపబడతాయి. సుమారు 4800 మాటలు మాట్లాడతాం. 750 నరాలు చురుకుదనాన్ని పెంచుకుంటాయి. గోరు 0.000046 అంగుళాలు పెరుగగా, వెంట్రుక 0.01714 అంగుళాలు ఎదుగుతుంది.

ఇదంతా పెద్దవారిలోనే. పసివారిలో, వృద్ధుల్లో జరిగే ప్రక్రియలు మరో రకం లెక్కలు చూపుతాయి. 




"మనిషి తనకుతానుగా కొని తెచ్చుకుంటున్న దుఃఖాల్ని జయించాలంటే శాంతిబీజాలు కావాలి. అవి మీరు తేవాలి. వీటిని నాలుగు రకాలుగా విభజిస్తున్నాను" అంటున్న ప్రొఫెసర్ మూర్తి సందేశాన్ని శ్రద్ధగా విన్నారా నలుగురు యువతీ యువకులు.

ఎవరీ ప్రొఫెసర్ మూర్తి? ఆయన తన నలుగురు విద్యార్థులతో చేస్తున్న పరిశోధన ఏమిటి?
వారి పరిశోధన ఎలాసాగింది? ఏయే సమస్యలెదురయ్యాయి?

దైనందిన జీవితంలో మనం అనుభవిస్తున్న సమస్యలకి మూలకారణం, వాటికి చక్కని పరిష్కారం సూచించే సందేశాత్మకమైన నవల "రాగాన్వేషణ". మాధవపెద్ది పుణ్యశీలాప్రసాద్ రచన, వచ్చే నెల 'చతుర'లో చదవండి.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad-500 016, TEL: 229428
CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad-500 482.



# సంపూర్ణమైన పెరుగుదల కోసం రుచికరమైన ఫారెక్స్® మార్గం.

| మీ పాపాయి పొడవు, బరువు తనిఖీ చేసుకోండి* | మగ పిల్లలు | | ఆడ పిల్లలు | |
|---|---|---|---|---|
| | బరువు | పొడవు | బరువు | పొడవు |
| **3** నెలలు | **5.2** కిలోలు | 59.1 సెం.మీ. | **4.9** కిలోలు | 58.4 సెం.మీ. |
| **6** నెలలు | **6.7** కిలోలు | 64.7 సెం.మీ. | **6.1** కిలోలు | 63.7 సెం.మీ. |
| **9** నెలలు | **7.3** కిలోలు | 68.2 సెం.మీ. | **6.9** కిలోలు | 67.0 సెం.మీ. |
| **12** నెలలు | **8.4** కిలోలు | 73.9 సెం.మీ. | **7.8** కిలోలు | 72.5 సెం.మీ. |

*ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ మెడికల్ రిసెర్చి ద్వారా నిర్ణయించబడినవి.

ఇవి భారతీయపిల్లల కోసం సగటు బరువు, పొడవులు మాత్రమే. వీటితో సరిపోలకపోయినా, మీ పాపాయి పెరుగుదల మీ డాక్టరుకు సంతృప్తికరంగా వుంటే ఆందోళనపడవలసిన అవసరం లేదు.

పిల్లల పెంపకం సంబంధంగా తీసుకోవలసిన శ్రద్ధను గూర్చి తెలిపే చిన్న రంగుల పుస్తకపు ఉచిత ప్రతి కోసం వీరికి వ్రాయండి:
గ్లిండియా లిమిటెడ్, (FPD/66),
డా. అనీ బెసెంట్ రోడ్,
వర్లీ, బొంబాయి-400 025.




సంపూర్ణమైన వికాసం
మరియు పెరుగుదల కోసం
మీ పాపాయికి ఇవ్వండి

## ఫారెక్స్®

పెరుగుదల కోసం
రుచికరమైన విధానం

